ప్రజలమనిషి కె.జి. కన్నబిరాన్ స్మృతి

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 9 సంచిక : 2 హైదరాబాద్ 115 ఫిబ్రవరి 2011 పేజీలు : 68 రు. 15

- ఫోకస్ : శ్రీకృష్ణ కమిటీ నివేదిక
- ఆదివాసులదే ఈ దేశం
- హిందుత్వ ఉగ్రవాదం
- టునీషియా ప్రజా విజయగాథ
- మళ్లీ మొదలైన గుజ్జర్ల ఆందోళన
- 'అభివృద్ధి' పథంలో రాజ్యహింస
- పుస్తకంపై ఆసక్తి తగ్గలేదు





2008 ఆగస్ట్ 13న వీక్షణం కార్యాలయంలో కె.జి. కన్నబిరాన్

## కె జి కన్నబిరాన్ (1929 – 2010)

జీవితమే ఒక నమూనా, ఒక ఆదర్శం, ఒక పాఠం.
నిరాడంబరత్వం,
ఎన్ని కష్టాలు ఎదురయినా నమ్మిన విలువల కోసం కట్టుబడి ఉండడం,
దౌర్జన్యాన్ని, అధికారాన్ని సాహసికంగా ప్రతిఘటించడం,
చేయదలచుకున్న పని అత్యంత సమర్థంగా, నైపుణ్యంతో చేయడం –
ఆయన నుంచి ఎవరయినా నేర్చుకోవసిన పాఠాలు.
ఈ దేశంలో అసంఖ్యాక పీడిత ప్రజానీకం అనుభవిస్తున్న దుర్భర దోపిడీ పీడనలు
రద్దు కావాలని కోరుకునే వారందరూ
కన్నబిరాన్ జీవితాదర్శాన్ని, జీవితాచరణను
అధ్యయనం చేయాలి, అనుసరించాలి.

115

# వీక్షణం
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

ఫిబ్రవరి 2011
సంపుటి : 9
సంచిక : 2

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ



## లోపలి పేజీల్లో...

ఫోకస్ : శ్రీకృష్ణ కమిటీ నివేదిక





ప్రింటర్స్
డక్కన్ ప్రెస్ /
చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజెన్సీస్
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు,
డి.డి లు పంపాల్సిన చిరునామా
వీక్షణం
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

### వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ – 013911011002175
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

వీక్షణం జనవరి 2011 సంచికలో వచ్చిన ఫోకస్ అంశం 'వనరులు, ప్రజలు, సమస్యలు, పోరాటాలు' గురించి ఎన్. వేణుగోపాల్ వ్యాసంలో రాజకీయ, ఆర్థిక, సామాజిక అంశాలతోపాటు ప్రజల ఆకాంక్షలను అద్దంపట్టినట్టు వివరించినందుకు, సంపాదకీయంలో పాలకులకు రైతులపై ఉన్న ప్రేమను, వ్యవసాయ రంగ సంక్షోభాన్ని, రైతుల ఆత్మహత్యలను ప్రస్తావించినందుకు వారికి నా సాహితీ అభినందనలు తెలుపుతున్నాను. సమాజాన్ని అర్థం చేసుకోవడానికి, అధ్యయనం చేయడానికి దోహదపడే ప్రధాన అంశాలైనటువంటి వనరులు, ప్రజలు, ప్రజల సమస్యలు, సమస్యల పరిష్కారానికి చేస్తున్న ప్రయత్నాలు, పోరాటాలు, వీటి గురించి ఆలోచించినట్లైతే ఆంధ్రప్రదేశ్‌లో వనరులు ముఖ్యంగా భూమీ, నీరూ, అడవీ, ఖనిజాలూ లాంటివి సమాజంలోని సామాన్య ప్రజలందరికి సక్రమంగా పంపిణీ జరగడం లేదు. ఈ వనరులన్ని కొద్దిమంది గుప్పెట్లో కేంద్రీకృతమై ఉండడం వల్ల ప్రజలు జీవన సమస్యలతో సతమతమ వుతున్నారు. ఆ సమస్యల పరిష్కారం కోసం అనేక ప్రయత్నాలతో పాటు పోరాటాలు చేయవలసిన అనివార్య పరిస్థితి ఏర్పడింది. పాలకుల చర్యల వల్ల వనరుల పంపిణీలో అక్రమ పద్ధతులు అవలంబించడం వల్ల ప్రాంతాల మధ్య అసమ అభివృద్ధి జరిగి ప్రాంతీయ ఉద్యమాలకు ఊతం ఇస్తున్నాయి. ముఖ్యంగా వనరులన్నీ ప్రజల కోసం ఉపయోగపడకుండా బడా వ్యాపారవేత్తలకు, బహుళజాతి సంస్థలకు, రాజకీయ నాయకులకు, వారి ఆశ్రితులకు అప్పగించడం వల్ల అవి అడ్డగోలుగా కొల్లగొట్టబడి భావితరాలకు బతుకు దెరువు లేకుండా చేస్తున్నారు. ఇలాంటి విధ్వంసక చర్యల వల్ల పునరుద్ధరింపబడే వనరులు కూడా పునరుద్ధరింపలేని వనరులుగా మారి రాబోయే కాలంలో భవిష్యత్తు భయంకరంగా మారే ప్రమాదం ఉంది. ఏ సమాజంలోనైనా ప్రకృతి వనరులతో పాటు, మానవ వనరులు కూడా అన్ని వర్గాల వారికి, అన్ని ప్రాంతాల వారికి సమ పంపిణీ జరగనపుడు సమస్యలతో సతమతమయ్యే ప్రజలు సమస్యల పరిష్కారానికి అన్వేషణ చేయవలసిన అవసరం ఉంటుంది. అందులో భాగంగానే ప్రజాసమూహం పాలకులకు విజ్ఞప్తి చేయడం దగ్గర నుండి ప్రదర్శన, సభ, చర్చ, రాస్తారోకో, రైల్ రోకో, ధర్నా, బంద్, సమ్మె లాంటి ప్రజాస్వామ్య పోరాటాల నుండి ప్రజాగ్రహ కార్యక్రమాల వరకు చేపట్టే అనివార్య పరిస్థితి ఏర్పడుతోంది. ప్రజా సంక్షేమం కోసం పాటు పడుతున్నామని చెప్పే పాలకులు, ప్రజలకు తాత్కాలికంగా ఉపసమనం కల్గించే సంక్షేమ కార్యక్రమాలతో పాటు, దీర్ఘకాలిక ప్రయోజనం చేకూర్చే శాశ్వత అభివృద్ధి పథకాలను ప్రవేశపెట్టి ప్రజాస్వామ్య గౌరవాన్ని కాపాడవలసిన అవసరం ఉంది.

**– బోరెడ్డి మధుసూదన్ రెడ్డి**
సిద్దిపేట, మెదక్

నేను వీక్షణం పాఠకుడిని, అభిమానిని. గతంలో వీక్షణం బయట పుస్తకాల షాపులలో కొనుక్కునే వాణ్ని. ఇటీవలే చందాదారుడిని అయ్యాను. నా స్నేహితుల చేత కూడా వీక్షణం చదివిస్తున్నాను. వీక్షణంలోని వ్యాసాలు ఎంతో విజ్ఞానదాయకంగా ఉన్నాయి. నేను సివిల్ సర్వీసెస్ పరీక్షలకు చదువుకుంటున్న విద్యార్థిని. వీక్షణంలో అచ్చవుతున్న వ్యాసాలు సమాచారంతో, వాస్తవాలతో ఆలోచనాస్ఫోరకంగా ఉంటున్నాయి.

**– జి. వంశీకృష్ణ**
మాదాపూర్, హైదరాబాద్

వీక్షణం జనవరి 2011 సంచిక సంపాదకీయం, సంపాదకీయ వ్యాఖ్యలు బాగున్నాయి. ఛత్తీస్‌ఘడ్ పౌరహక్కుల నేత బినాయక్‌సేన్ కోర్టు ప్రకటన ద్వారా కేసుకు సంబంధించిన చాలా విషయాలు తెలిసాయి. 24 డిసెంబర్ 2010న రాయపూర్ రెండవ అదనపు సెషన్స్ కోర్టు బినాయక్ సేన్, నారాయణ సన్యాల్, పీయూష్ గుహలకు యావజ్జీవ కఠిన కారాగార శిక్ష విధించింది. ఈ కేసుకు సంబంధించి బినాయక్‌సేన్ 27 పత్రాలు జతపరిచారు. పోలీసులు 37 పత్రాలు ఇతనిని నేరస్తునిగా చూపుతూ కోర్టుకు అందచేసారు. కొన్ని కల్పించిన పత్రాలు. చాలా వాటిపై సాక్షుల సంతకాలు లేవు. ఆధారాలు లేనప్పటికీ అన్యాయంగా శిక్ష విధించారు. కోర్టులలో జన న్యాయం 'గొంతు నులిమి చంపబడింది' అన్న 'చెరబండ' మాటలు జ్ఞాపకం వచ్చాయి. ప్రభుత్వ ఆదేశాలు న్యాయమూర్తి తీర్పునకు కార్బన్ కాపీ. వనరులు, ప్రజలు, సమస్యలు, పోరాటాలు సుదీర్ఘ వ్యాసంతో పాటు మిగిలిన వ్యాసాలు బాగున్నాయి. రాజకీయ, సామాజిక విజ్ఞాన దాయకమైన మరిన్ని వ్యాసాలు రావాలని కాంక్షిస్తున్నాను. రైతు నాడు కవులకు, ప్రజలకు ఆత్మబంధువు. నేడు రాజకీయాలకు కేంద్ర బిందువు.

**– తుంపాల శ్రీరామమూర్తి**
ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం విశాఖపట్నం జిల్లా శాఖ అధ్యక్షులు,
గాజువాక, విశాఖపట్నం

మానవ సంబంధాలు – ప్రజా ఉద్యమాలు కుంచించుకుపోతున్న సందర్భంలో 'వీక్షణం' ప్రజాస్వామిక స్ఫూర్తిని బతికించడానికి పడుతున్న తపన ఎంతగానో ఆకట్టుకుంటున్నది. పత్రిక ప్రారంభం నుంచీ చదువుతున్నాను. ప్రజా వనరులు – కాపాడుకోవాల్సిన ఉద్యమాలు – అవసరమైన వ్యక్తిత్వాలు – కొల్లగొట్టబడుతున్న హక్కుల రక్షణకు అంకితమవుతున్న జీవితాలు – ప్రభుత్వాల బూటకాలు – వంటి వ్యాసాలను ఎప్పటికప్పుడు వీక్షణం ద్వారా చదవగలుగుతున్నాం. అనేక తెలుగు పత్రికలు అందుకోలేని / ఇవ్వలేని సమాచారాన్ని వీక్షణం ఇస్తుండడం విశేషం. జనవరి నుంచి పత్రిక రేటు పెంచడం కూడా అవసరమైన పరిణామమే. ప్రచురణ కష్టసాధ్యమయిన నేపథ్యంలో పదిహేను రూపాయలు పెద్ద రేటు కాదు. అదే విధంగా వ్యాసకర్తలు కూడా పత్రిక మనుగడకు తోడ్పాటునిస్తే బాగుంటుందేమో. వాణిజ్య ప్రకటనలు లేకుండా ఇంతకాలంగా ఇలా పత్రికను నిర్వహించడం కత్తి మీద సామే. బినాయక్‌సేన్‌పై ఒక్క వీక్షణమే ఐదుకు పైగా సంచికల్లో వ్యాసాలను వెలువరించింది. జనవరి సంచికే కాదు వీక్షణం ప్రతి సంచికా, చదవడమే కాక, మిగిలిన మిత్రుల చేత చదివించాల్సిన అవసరం చదువరులందరికీ ఉంది.

**– డా. నూకతోటి రవికుమార్**
ఒంగోలు

నేను వీక్షణం చందాలు కట్టిస్తున్నాను. ఇలా చెయ్యడంలో ఉన్న స్వార్థం భావజాల సారూప్యం గల వారిలో ఆయా భావజాలాలు బలంగా ప్రచారం చెయ్యాలనిపించడం, ఇంకా ముఖ్యంగా వివిధ పత్రికలలో చెదురుమదురుగా ప్రచురితమైన వ్యాసాలు ఒకే పుస్తకంగా చదవడంలోని ఏకత్రత, ఇంగ్లిష్ రాని పాఠకులు మంచి వ్యాసాలను వీక్షణంలో చదువుకోగలగడం. ఈ పనులన్నిటి ద్వారా మధ్యతరగతి పాఠకుల ఆలోచనను మరింత క్రియాశీలం చెయ్యడం. ఆలోచన అవగాహనకీ, అవగాహన ఆచరణకీ దారి సుగమం చేస్తాయని నమ్మి ఈ పని చాలా కాలం నుంచి చేస్తున్నాను. జనవరి సంచికలోని బినాయక్‌సేన్ కోర్టు ప్రకటన, వందన శివ వ్యాసం, వికీలీక్స్, 2జి స్పెక్ట్రమ్‌పై వ్యాసాలు చాలా బాగున్నాయి. అట్టమీద కేవలం అక్షరాలకు బదులు ఫోకస్ వ్యాసాలకు సంబంధించి కొన్ని ఫొటోలు కూడా వేస్తే బాగుంటుంది.

**– డా. మానేపల్లి**
యలమంచిలి, విశాఖపట్నం

*సవరణ : డిసెంబర్ 2010 సంచికలో బి. సాంబశివరాజు గారి '21వ శతాబ్ది సోషలిస్టు నిర్మాణ దృక్కోణం' వ్యాసంలో 45 పేజీలో కుడివైపు ఏడో పేరా 2వ లైన్‌లో 'కొరవడడానికి' బదులుగా 'పెరగడానికి' అని సరిచూసుకోగలరు. అచ్చు తప్పుకు చింతిస్తున్నాం. – సం.*

**విజయవాడలో వీక్షణం చందాల రసీదు పుస్తకం పోయింది**

విజయవాడలో 2011 జనవరి 1 నుండి 11 వరకు జరిగిన బుక్ ఫెయిర్‌లో వీక్షణం బుక్ స్టాల్‌కు వచ్చి జనవరి 8న కొందరు పాఠకులు వీక్షణంకు చందాలు కట్టారు. అనుకోని విధంగా ఆ చందా రసీదుల పుస్తకం అక్కడ పోయింది. ఎవరికయినా ఆ రసీదు పుస్తకం దొరికితే మాకు పోస్టు చేసి సహకరించగలరు. విజయవాడలో చందాలు కట్టి వీక్షణం కాపీ అందని మిత్రులు వీక్షణం కార్యాలయానికి ఫోన్ చేసి తమ రసీదు నెంబర్ చెప్పి కాపీ తెప్పించుకోగలరని మనవి. ఈ ఇబ్బందికి చింతిస్తున్నాం. – సం.

# పరిష్కారానికేనా శ్రీకృష్ణ నివేదిక?

పదినెలలుగా రాష్ట్రం ఎదురుచూస్తున్న జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ నివేదిక ఇచ్చిన గడువుకన్న ఒకరోజు ముందే వెలువడింది. ఆ ఒక్క ఘనత మినహా, ఈ కమిటీ ఏర్పాటు దగ్గరనుంచి నివేదిక వెల్లడి వరకూ మరే వ్యవహారమూ సక్రమంగా, హేతుబద్ధంగా, న్యాయబద్ధంగా జరగలేదు. 2009 డిసెంబర్ 9 ప్రకటన తర్వాత 'పరిస్థితులు మారినందువల్ల' 'విస్తృత సమాలోచనలు' అవసరమయ్యాయని డిసెంబర్ 23 ప్రకటన చెప్పింది. ఆ సమాలోచనలలో భాగంగానే 2010 జనవరి 5న కేంద్ర హోం మంత్రిత్వ శాఖ ఆధ్వర్యంలో ఢిల్లీలో అఖిలపక్ష సమావేశం జరిగింది. ఆ సమావేశ ఫలితంగానే జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ ఏర్పాటయింది. అంటే ఈ కమిటీ డిసెంబర్ 9 తర్వాత పరిస్థితులు ఎందుకు, ఎలా మారాయనే విషయంపైన విస్తృత సమాలోచనలు జరిపి ఉండవలసింది. కాని ఫిబ్రవరి 12న ఆ కమిటీ విధివిధానాలు, చర్చా ప్రాతిపదికలు ప్రకటించేనాటికి, కమిటీకి అసందర్భమైన, అనవసరమైన పనులెన్నో ఇవ్వడం జరిగింది. 2009 డిసెంబర్ 7న హైదరాబాదు అఖిలపక్ష సమావేశంలో అన్ని పార్టీలూ ఆమోదించిన విషయాన్ని మళ్లీ చర్చనీయాంశం చేసి, ఆ చర్చ పనిని కమిటీకి ఇవ్వడం జరిగింది. ప్రజా ఆకాంక్షల, ప్రజా ఉద్యమాల ఫలితంగా ఒప్పుకోక తప్పని అంశాలమీద కూడ పాలకవర్గాలు ఎటువంటి మాయోపాయాలు పన్నగలవో చూపడానికి ఇంతకన్న పెద్ద ఉదాహరణ అక్కరలేదు. అసలు సమస్యను పక్కదారి పట్టించడానికి, కాలయాపన చేయడానికి ఈ కమిటీ ఉపయోగ పడుతున్నదనే అభిప్రాయం వచ్చినా సరే, ఈ కమిటీ ద్వారానైనా సమస్య పరిష్కారమైతే చాలునని ప్రజలు అనుకున్నారు. అందుకే పది నెలల పాటు కమిటీ పర్యటనలకు, విచారణకు సహకరించారు. కాని ఇంతచేసి కమిటీ వెలువరించిన తిలకాష్టమహిషబంధనం సాధించినది సమస్య పరిష్కారం కాదు, సూచించినది సమస్యకు సామరస్యపూర్వక పరిష్కారాలు కాదు. కమిటీ అవలంబించిన దృక్పథం, వాస్తవాలను, చరిత్రను, రాజకీయార్థిక పరిణామాలను కమిటీ ఉపయోగించిన తీరు, కమిటీ చివరికి చేసిన సూచనలు అన్నీ కూడ వివాదాస్పదంగానూ, అభ్యంతరకరంగానూ ఉన్నాయి. నిజాయితీ పరుడిగా పేరుపొందిన న్యాయమూర్తి అధ్యక్షతన, ఒక న్యాయనిపుణుడు, ఒక అర్థశాస్త్రవేత్త, ఒక సామాజిక శాస్త్రవేత్త సభ్యులుగా ఉన్న ఈ కమిటీ నివేదిక ఆ నిపుణుల విజ్ఞతకు చిహ్నంగా మాత్రం మిగలలేదు. ఈ కమిటీకి కార్యదర్శిగా పనిచేసిన పోలీసు అధికారి ఎంత తెలివితో, ఏ దృక్పథంతో ప్రజా సమస్యలను చూడగలడో అందుకు చిహ్నంగా మాత్రమే ఉంది. కొత్తగూడెం రాయలసీమలో ఉందనడం, భీమా, నెట్టెంపాడు వగైరాలను గోదావరిపై చూపడం, తెలంగాణలో సాగునీటి సౌకర్యంగల భూమి వృద్ధిరేటు 713 శాతం అనడం (అది నిజమైతే తెలంగాణలో నీటిపారుదల సౌకర్యం లేని భూమి లేదన్నమాట!) – లాంటి అవాస్తవాలు, గణాంకాల తప్పులు డజన్ల కొద్దీ ఉన్నాయంటే నివేదిక ఎంత నిర్లక్ష్యంగా, ఎంత మేధో దివాళాకోరుతనంతో తయారయిందో అర్థమవుతుంది. ఈ చిన్న తప్పులను పక్కనపెట్టినా, అసలు నివేదిక తయారీలో పనిచేసిన దృక్పథంలోనే రెండు ప్రధానమైన ప్రజావ్యతిరేక ప్రాతిపదికలు ఉన్నాయి. ఒకటి, నివేదిక ప్రజల సమస్యలను, ప్రజల ఆకాంక్షలను శాంతి భద్రతల కోణం నుంచి మాత్రమే చూసింది. యథాస్థితి వల్ల ప్రయోజనాలు పొందేవారు, యథాస్థితి వల్ల ప్రయోజనాలు లేకపోయినా భావజాలపరంగా మార్పును ఇష్టపడనివారు ప్రతి ప్రజా సంచలనాన్ని ఇలా శాంతిభద్రతల కోణం నుంచి చూస్తారు. శాంతి భద్రతలకు భంగం కలుగుతున్నదనే మాట నిజమే అనుకున్నా, ఆ పరిస్థితికి దారి తీసిన పరిణామాలను ఆలోచించవలసి ఉంటుంది. కమిటీ ఆ పని మాత్రం చేయకుండా, చేసినచోట అరకొరగా చేసి, మొత్తం వ్యవహారాన్ని శాంతిభద్రతల సమస్యగా చూసింది. అందుకే శాంతిభద్రతల మీద ప్రత్యేకంగా ఒక అధ్యాయం రాసి దాన్ని బహిరంగం కూడ చేయకుండా రహస్యంగా హోంమంత్రిత్వశాఖకు అందజేసింది. ప్రజాధనంతో విచారణ నిర్వహించిన కమిటీ, ప్రజలను ఏడాదిగా, ఆమాటకొస్తే దశాబ్దాలుగా, అతలాకుతలం చేస్తున్న సమస్యను విచారించిన కమిటీ, తన నివేదికలో ఒక ముఖ్యమైన భాగాన్ని ప్రజలకు, రాజకీయపార్టీలకు కూడ చెప్పగూడని రహస్యం అనుకున్నదంటే అది ఎంత ప్రజావ్యతిరేక ఆలోచనతో ఉన్నదో రుజువవుతున్నది. బహిరంగం చేసిన నివేదికలో కూడ చాలచోట్ల ఈ దృక్పథం వ్యక్తమయింది. ఇక రెండవ ప్రాతిపదిక, ప్రజలజీవితాలతో, ప్రజల ఆకాంక్షలతో సంబంధంలేని అంకెల, సగటుల, వృద్ధిరేటుల, భవనాల, ఫ్లై ఓవర్ల 'అభివృద్ధి' దృక్పథం. హైదరాబాదు మీద ప్రత్యేకంగా రాసిన ఒక అధ్యాయంలోనూ, మొత్తంగా నివేదికలోనూ కూడ ఈ దృక్పథం వ్యాపించింది. అంకెలు, సగటులు, వృద్ధిరేట్లు విశాల సామాజిక చిత్రాన్ని గ్రహించడానికి ఒకానొక సౌకర్యమే గాని, వాటిద్వారానే సామాజిక వాస్తవికతను గుర్తించగలమనుకోవడం అమాయకత్వమైనా కావాలి, దుర్మార్గమైనా కావాలి. శ్రీకృష్ణ కమిటీ నివేదిక పూర్తిగా అటువంటి అవిశ్వసనీయమైన, తప్పుడు సూచనలు ఇచ్చే అంకెలమీద ఆధారపడింది. ఈ దృక్పథం వల్ల కమిటీ పరిష్కార మార్గాల సూచనలు కూడ గందరగోళంగా తయారయ్యాయి. తామే ఆరు సూచనలు చేసి, వాటిలో నాలుగు పనికిరానివని చెప్పడం కనీసమైన ఇంగితజ్ఞానం ఉన్నవారు కూడ చేసే పని కాదు. ఇక అత్యుత్తమ మార్గంగా చెప్పిన సూచన 1958 నుంచి 1973 వరకు అమలయినదే. రాజ్యాంగ రక్షణలు ఉన్నా విఫలమయినదే. ఇప్పుడు అదే సూచన చేస్తూ ఈసారి అమలవుతుందనే హామీ ఏమిటో చెప్పకపోవడం పరిష్కారం కాదు. ప్రజల సమస్యలు పరిష్కారమయ్యేది ప్రజల మధ్య మాత్రమే. పాలకవర్గాల ద్వారా, వారి కుతంత్రాలకు సాధికారత ఇచ్చే కమిటీల ద్వారా కాదు. ప్రజల సమస్యలు తీర్చడం ప్రస్తుత పాలకవర్గాలకు సాధ్యం కాదని, ఎక్కువలో ఎక్కువ అవి ప్రజలను మభ్యపెట్టే కాలయాపన పనులు మాత్రమే చేయగలవని ఈ ఉదంతం మరొకసారి రుజువు చేస్తున్నది. వీ

## దొంగల పేరు చెప్పాలా, ఎంతమాట?!

దేశ సంపదలను కొల్లగొట్టి విదేశీబ్యాంకుల రహస్యఖాతాలలో దాచుకున్న దొంగల గురించి రెండు సంవత్సరాలకు పైగా సాగుతున్న చర్చ ఇప్పుడు ఒక మలుపు తిరిగి అసలు నిజాలు బయటపెడుతున్నది. ఇన్నాళ్లూ ఆ దొంగలు వేరు, ప్రభుత్వం వేరు అనుకున్న వారెవరయినా ఉంటే, ఈ ప్రభుత్వం ఆ దొంగలదేనని, లేదా, ఆ దొంగలను కాపాడడమే తన కర్తవ్యమని ప్రభుత్వం అనుకుంటున్నదని రుజువవుతున్నది. ఈ ప్రభుత్వమేదో ఆ దొంగల గుట్టు బయటపెట్టి ఆ అక్రమసంపదను దేశానికి తిరిగి తెప్పించగలదని ఎవరయినా నమ్మిఉంటే, తాము ఆ పని చేయబోమని ప్రభుత్వాధినేతలు నిస్సిగ్గుగా కుండబద్దలు కొడుతున్నారు. ప్రభుత్వాల రహస్యపత్రాలు సేకరించి బహిరంగం చేస్తున్న వికీలీక్స్‌కు ఒక మాజీ స్విస్ బ్యాంకు అధికారి అందజేసిన ఖాతాదార్ల జాబితాతో మరొకసారి ఈ వార్తలు పత్రికలకు ఎక్కాయి. ఆ జాబితాలో భారతీయుల పేర్లు ఉన్నాయని బయటపడింది. ఇంతకూ స్విట్జర్లాండ్‌లో ఉన్న అనేక బ్యాంకులలో అది ఒకానొకటి మాత్రమే. ఒక్క స్విట్జర్లాండ్ లోనే కాక, అటువంటి దేశాలెన్నిటిలోనో ఉన్న వందలాది బ్యాంకులలో ఇటువంటి అక్రమనిధులు ఉన్నాయి. అంటే మిగిలిన ప్రపంచం సంగతి అలా ఉంచినా, భారతదేశం నుంచి కొల్లగొట్టుకుపోయిన సంపదలో ఇప్పుడు వికీలీక్స్ జాబితా ద్వారా బయటపడబోయేది సముద్రంలో కాకిరెట్టకన్న తక్కువ. ఆ కనీసమైన, అతిస్వల్పమైన జాబితాలోని పేర్లు కూడ బయటపెట్టలేమని, ఒక వేళ బయటపడినా ఆ డబ్బు తెప్పించలేమని, అందుకు అంతర్జాతీయ ఒప్పందాలు అంగీకరించవని స్వయంగా ప్రధానమంత్రి ప్రవచిస్తున్నారు. దాన్నే ఆర్థికమంత్రి పునరుద్ఘాటిస్తున్నారు. దేశ ప్రయోజనాలకు భంగకరమైన ఒప్పందాలను ఎందుకు గౌరవించాలని ప్రతిపక్షాలని పేరు పెట్టుకున్నవి కూడ అడగడం లేదు. కోటి కోట్ల రూపాయల అక్రమ ధనం తిరిగి తెప్పించగల ప్రయోజనమే కలిగితే, అంతర్జాతీయ ఒప్పందాలను ఉల్లంఘించడంలో నష్టమేమీ లేదు. ఇంతకూ ఆ అంతర్జాతీయ ఒప్పందాలలోకి మనం ప్రవేశించినది దొంగలను కాపాడడానికా, దేశ ప్రయోజనాలను మరింతగా రక్షించుకోవడానికా? ప్రజలకు తెలియకుండా, ప్రజలకు సమాచారం లేకుండా గత అరవై సంవత్సరాలలో భారత ప్రభుత్వం ఏయే దేశాలతో ఏయే ఒప్పందాలు చేసుకున్నది? ఆ ఒప్పందాలు ఇలా భారత ప్రజల సార్వభౌమాధికారానికి ముందరి కాళ్ల బంధం వేసేవేనా? అయితే, తనకు తాను భారత ప్రభుత్వం అని పేరు పెట్టుకున్నది భారత ప్రయోజనాలకోసం పనిచేసిందా? భారతదేశంలోని దొంగల కోసమూ, వారిని కాపాడే విదేశీ దొంగల కోసమూ పనిచేసిందా? దేశాన్ని మూడు వందల సంవత్సరాలలో బ్రిటిష్ వలసవాదం ఎంత దోపిడీ చేసిందో అరవై సంవత్సరాలలో భారత ప్రభుత్వ ఆధ్వర్యం కింద అంతకన్న ఎక్కువ దోపిడీ జరిగిందనుకోవాలా? ఇప్పటికైనా ఈ ప్రశ్నలు అడగకపోతే ఈ దేశానికీ, ఈ దేశ ప్రజలకూ విముక్తి లేదు. ఏ పార్లమెంటరీ రాజకీయపక్షానికీ ఈ ప్రశ్నలు అడిగే ఆసక్తి లేదని ఈ ఆరుదశాబ్దాల చరిత్ర రుజువు చేసింది గనుక ఇక ఈ ప్రశ్నలు అడగవలసిన బాధ్యత, జవాబులు కనిపెట్టవలసిన బాధ్యత పూర్తిగా ప్రజలమీద, ప్రజా ఉద్యమాలమీద మాత్రమే ఉంది.

## ప్రజాశక్తిని రుజువు చేస్తున్న టునీషియా, సూడాన్

ప్రజా ఆకాంక్షలకు విలువలేదనీ, ప్రజాపోరాటాలకు కాలం చెల్లిందనీ, పాలకవర్గాల దుర్మార్గాలు యథాతథంగా సాగిపోతూనే ఉంటాయనీ, వాటిని ఆపలేమనీ నడుస్తున్న అధికారిక ప్రవచనానికి గండిపడింది. ఆ మూల ఆఫ్రికా నుంచి రెండు చిన్న దేశాలు ప్రజాశక్తి ఎంత శక్తిమంతమైనదో రుజువు చేస్తున్నాయి. దోపిడీ పీడనల పెట్టుబడిదారీ విధానం తప్ప 'ఇక మరో దారి లేదు' అని రెండు దశాబ్దాల కింద మార్గరెట్ థాచర్ ప్రకటించిన తర్వాత, ప్రజాప్రయోజనాలను తాకట్టుపెట్టే పాలనలదే రాజ్యంగా కొనసాగుతున్న సందర్భంలో, ఉత్తర ఆఫ్రికాలోని టునీషియాలోనూ, సూడాన్‌లోనూ ప్రజలు తలచుకుంటే ఏమి చేయగలరో, మరొకదారి ఉన్నదో లేదో చూపించారు. టునీషియాలో ఫ్రాన్స్, అమెరికా ప్రభుత్వాల అండతో కొనసాగుతున్న ప్రభుత్వం అవినీతికీ, ఆశ్రితపక్షపాతానికీ నిలయమయినప్పుడు, ప్రజలను దారిద్ర్యంలోకీ నిరుద్యోగంలోకీ నిర్బంధంలోకీ నెట్టివేసినప్పుడు, ఒక చిన్న నిప్పురవ్వతో టునీషియా సమాజం మొత్తం అంటుకుని విస్ఫోటనం జరిగి జనవరి 14న నిరంకుశ అధ్యక్షుడు బెన్ అలీ దేశం వదిలి పారిపోవలసి వచ్చింది. ప్రజల ఆకాంక్షలు ఇంకా సంపూర్ణంగా నెరవేరకపోయి ఉండవచ్చు, అందుకు సమయం పట్టవచ్చు గాని నిరంకుశ పాలకులకు ఏ గతి పడుతుందో మాత్రం టునీషియన్ ప్రజలు తమ ఆచరణ ద్వారా చూపారు. మరొకపక్క ఈశాన్య ఆఫ్రికాలోని అరబ్ దేశం సూడాన్ నుంచి విడిపోయి స్వతంత్ర దేశంగా మారడానికి దక్షిణ సూడాన్ ప్రజలు యాభై సంవత్సరాలుగా సాగిస్తున్న పోరాటం జనవరి మొదటి రెండు వారాలలో జరిగిన ప్రజాభిప్రాయ సేకరణలో 99 శాతం వోట్లతో విజయం సాధించింది. వలసవాదం నుంచి విముక్తి అయిన వెంటనే సాగిన మొదటి అంతర్యుద్ధాన్ని (1955–72), రెండవ అంతర్యుద్ధాన్ని (1983) దాటి, భయంకరమైన నిర్బంధాన్నీ, ఊచకోతలనూ, సాయుధపోరాటాన్నీ దాటి చివరికి 2005లో ప్రభుత్వం దిగివచ్చి సూడానీస్ ప్రజా విముక్తి సైన్యంతో చేసుకున్న ఒప్పందం ఫలితంగా ఈ ప్రజాభిప్రాయ సేకరణ జరిగింది. మిగిలిన కార్యక్రమాలు కూడ సజావుగా సాగితే ఈ జూలై 9న నైల్ రిపబ్లిక్ లేదా దక్షిణ సూడాన్ ఒక కొత్త దేశం రూపొందనున్నది. ఎప్పటికైనా ప్రజా ఆకాంక్షలు విజయం సాధించకతప్పదని ఈ పరిణామాలు రుజువు చేస్తున్నాయి. ఇది రాస్తున్న సమయానికి అరబ్ ప్రపంచంలోనే అతి శక్తిమంతమైన ఈజిప్ట్‌లో కూడ ప్రజాగ్రహ జ్వాలలు రగుల్కొంటున్నాయనీ, అమెరికా తొత్తుగా ముప్పై సంవత్సరాలుగా పాలిస్తున్న అధ్యక్షుడు హోస్ని ముబారక్ కు వ్యతిరేకంగా రాజధాని కైరో లోనూ, దేశవ్యాప్తంగానూ వేలాది మంది యువకులు ప్రదర్శనలు నిర్వహిస్తున్నారనీ వార్తలు వస్తున్నాయి. చాలమంది వ్యాఖ్యాతలు ఈ అరబ్ ప్రపంచ కదలికలను 1968 ప్రపంచవ్యాప్త కోపోద్రిక్త యువతరం ప్రదర్శనలతో పోలుస్తున్నారు. ఈజిప్ట్‌లో ప్రదర్శనలు టునీషియా ప్రదర్శనలకన్న పెద్ద ఎత్తున సాగుతున్నాయని, ఇక్కడకూడ టునీషియాలో జరిగినట్టే జరగవచ్చునని వ్యాఖ్యాతలు అంటున్నారు. 'ఈజిప్ట్ ఇవాళ అగ్గిపుల్ల గీస్తే పేలిపోయే మందుపాతర లాగ ఉంది' అని ప్రదర్శనకారుల నాయకుడు అమర్ అల్ హాసన్ అన్నాడు. ఆమాటకొస్తే ఇవాళ ప్రపంచంలో అత్యధిక దేశాలు అలాగే ఉన్నాయి. ఇరవై ఒకటో శతాబ్ద ప్రజాగ్రహ ప్రజ్వలనాలు 'నడుమ తడబడి కదలి మునుగక' తీరం క్రమిస్తాయా? నిజంగానే మానవాళికి మంచికాలం రానున్నదా? వీ



- **నడుస్తున్న చరిత్ర** – కథలు – పంజాల జగన్నాథం – పంజాల పబ్లికేషన్స్ – 139 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు : పంజాల జగన్నాథం, 7–2–74/ఎ, మంకమ్మతోట, కరీంనగర్ – 505001, సెల్ : 9948531985; ప్రముఖ పుస్తక షాపులలో
- **దుబ్బ చెలక** – కతలు – ఎలికట్టె శంకర్‌రావు – అమృత ప్రచురణలు – 110 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : అరుణ, 206, సాయి టవర్స్, నాగార్జున కాలనీ, నల్గొండ. సెల్ : 9346359268; డా. నోముల సత్యనారాయణ, రవీంద్రనగర్, నల్గొండ; ప్రముఖ పుస్తక షాపులలో
- **మోహనీలిక** – కవిత్వం – దుర్గాప్రసాద్ అవధానం – స్వర్ణ పబ్లికేషన్స్ – 75 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు : దుర్గాప్రసాద్ అవధానం, ఇ.నెం. 5–12–103/4, శ్రీనివాసకాలనీ, బి.టి.ఎస్., నల్గొండ, తెలంగాణ. ఫోన్ : 08682–231314, సెల్ : 9492608314; విశాలాంధ్ర అన్ని బ్రాంచీలు, నవోదయ, ప్రజాశక్తి, సహచర, దిశ, పాలపిట్ట పుస్తక కేంద్రాలలో
- **చదువుల సారం – 7 – భాషాభ్యాసాలు** – మంచి పుస్తకం – జన విజ్ఞాన వేదిక ప్రచురణ – 155 పేజీలు, 1/8 డెమీ, రు. 75
- **చదువుల సారం – 8 – చదువుల వెలుగులు** – మంచి పుస్తకం – జన విజ్ఞాన వేదిక ప్రచురణ – 168 పేజీలు, 1/8 డెమీ, రు. 85

పై రెండు ప్రతులకు : జన విజ్ఞాన వేదిక ప్రచురణల విభాగం, 162, విజయలక్ష్మి నగర్, నెల్లూరు – 524004; ఫోన్ : 9440503061; మంచి పుస్తకం, 12–13–450, వీధి నెం. 1, తార్నాక, సికింద్రాబాద్ – 500017; ఫోన్: 9490746614; ఇమెయిల్ : info@manchipustakam.in, website : www.manchipustakam.in

- **అక్షర సౌజన్యం** – రేగులపాటి కిషన్‌రావు – విజయలక్ష్మి ప్రచురణలు – 96 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు : శ్రీమతి రేగులపాటి విజయలక్ష్మి, కవితా నిలయం, ఇ.నెం. 10–1–436, సంతోష్‌నగర్, రాంనగర్, కరీంనగర్ – 505 001; సెల్ : 9849246980; విశాలాంధ్ర బుక్ హౌస్, హైదరాబాద్
- **చలో ఛత్తీస్‌గఢ్** – దండకారణ్యంలో జర్నలిస్టు అనుభవాలు – ఎం.ఎం. రహమాన్ – 136 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: ఎం.ఎం. రహమాన్, జవహర్ నవోదయ విద్యాలయ, చొప్పదండి, కరీంనగర్ – 505415; సెల్ : 9553955370, 9848328698
- **టాల్‌స్టాయ్ సాహిత్య పరిచయ వ్యాసాలు** – ఎన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు – శతవర్ధంతి నివాళి 1910–2010 – జనసాహితి ప్రచురణ – 111 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు : ఎన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు, లెక్చరర్, 3ఎ–5–13, రైలే గూడ్స్ షెడ్‌రోడ్డు, పాలకొల్లు – 534260, పశ్చిమ గోదావరి; సెల్ : 9951186021; మైత్రీ బుక్‌హౌస్, జలీల్ వీధి, 28–9–1, కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ – 2; సెల్ : 9848631604; అన్ని ప్రముఖ పుస్తకాల షాపుల్లో
- **విప్లవం గురించి మార్క్స్** – డేవిడ్ మాక్‌లెల్లన్ – తెలుగు అనువాదం : ఇంగువ మల్లికార్జునశర్మ – లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణ – 20 పేజీలు, 1/8 డెమీ, రు. 10
- **హెగెల్** – విలియమ్ కెల్లిరైట్ – తెలుగు అనువాదం : సి. పటేల్ – లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణ – 36 పేజీలు, 1/8 డెమీ, రు. 15, పై రెండు ప్రతులకు : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, డి. రాధాకృష్ణమూర్తి, ఇ.నెం. 5–85–4/బి, పండరీపురం, 1వ లైన్, గుంటూరు – 522 002; సెల్ : 9848877596; విశాలాంధ్ర బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్ హౌస్, మైత్రి, దిశ, సహచర, నవయుగ, మణి బుక్‌స్టాల్



## నారాయణ్‌రావు పవార్ కన్నుమూత

తెలంగాణ సాయుధ పోరాట యోధుడు నారాయణ్ పవార్ (84) డిసెంబర్ 8న కన్నుమూశారు. ఆయన 21 ఏళ్ల ప్రాయంలో నిజాం రాజుల భూస్వామ్య నిరంకుశ పాలనను అంతమొందించడం కోసం, తెలంగాణ విముక్తి కోసం పోరాటం చేశారు. నిజాం రాజుపై బాంబు విసిరిన సాహసికుడాయన. ఆ బాంబు పేలకపోవడంతో నిజాం రాజు తప్పించుకోగలిగాడు. ఆయనకు శిక్ష పడినా, పోలీస్ ఆక్షన్ తదితర పరిణామాల్లో భాగంగా శిక్ష నుంచి బయటపడ్డాడు. ఆయన వరంగల్లో పుట్టారు. ఆయన పూర్వీకులు మహారాష్ట్ర ప్రాంతానికి చెందినవారు. ఆయనది చాలా నిరాంబరమైన, నిజాయితీ, సాహసాలు కలిగిన వ్యక్తిత్వం. జీవితకాలం ఒక మధ్యతరగతి మనిషిగానే జీవించారు.

## వై.వి. కృష్ణారావు కన్నుమూత

సి.పి.ఐ. నాయకుడు వై.వి. కృష్ణారావు (96) డిసెంబర్ 26న హైదరాబాద్‌లోని నాంపల్లి కేర్ హాస్పిటల్‌లో అనారోగ్యంతో చికిత్స పొందుతూ చనిపోయారు. ఆయన పసిప్రాయంలోనే స్వాతంత్రోద్యమంలో పాల్గొన్నారు. బ్రిటిష్ వ్యతిరేక పోరాటంలో భాగంగానే ఆయన కమ్యూనిస్టు పార్టీలో చేరారు. ఆయన 1915 సెప్టెంబర్ 15న కృష్ణా జిల్లా గన్నవరం తాలూకా పెద్ద అవుటపల్లి గ్రామంలో ఒక రైతు కుటుంబంలో పుట్టారు. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటంలో భాగంగా కమ్యూనిస్టు పార్టీ కడప బాధ్యతలు చేపట్టారు. తరువాతి కాలంలో కిసాన్ సభలో చేరి రైతాంగ ఉద్యమంలో భాగం పంచుకున్నారు. ఆలిండియా కిసాన్ సభకు రాష్ట్రంలో కార్యదర్శిగానూ, దేశాధ్యక్షుడిగానూ ఉన్నారు. రైతాంగ సమస్యల పరిష్కారం కోసం కృషి చేశారు. ఇరవై రెండేళ్ల పాటు 'రైతు లోకం' పత్రికకు ప్రధాన సంపాదకుడిగా బాధ్యతలు నిర్వహించారు. విశాలాంధ్ర విజ్ఞాన సమితి అధ్యక్షులుగా ఉన్నారు. ఎన్నో పుస్తకాలు స్వయంగా రాశారు.

## గుడిహాళం రఘునాథం కన్నుమూత

ప్రముఖ కవి, రచయిత, మాజీ పాత్రికేయులు గుడిహాళం రఘునాథం (54) అనారోగ్యంతో హైదరాబాద్‌లోని యశోదా ఆస్పత్రిలో చికిత్స పొందుతూ 28 డిసెంబర్ ఉదయం కన్నుమూసారు. ఆయన కాలేయ సంబంధ వ్యాధితో బాధ పడుతున్నారు. హైదరాబాద్‌లోని ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగు సాహిత్యంలో ఎం.ఎ. చేశారు. వరంగల్‌లోని కాకతీయ విశ్వవిద్యాలయంలో ఎం.ఫిల్. పూర్తి చేశారు. ప్రస్తుతం మెదక్ జిల్లా సదాశివపేట కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేస్తున్నారు. ఆయన మహబూబ్ నగర్ జిల్లా అమరచింతలో 1956 ఫిబ్రవరి 23న జన్మించారు. ఆయన తొలి కవితా సంపుటి 'ఫోర్త్ పర్సన్ సింగ్యులర్'. ఆ తరువాత 'ఒక జననం – ఒక మరణం' అనే కవితా సంపుటిని వెలువరించారు. సాహిత్యంలో కొత్త విలువలను ఆశిస్తూ ఏర్పడిన విపశ్యన కవుల్లో ఆయన ఒకరు.

## కన్నబిరాన్ కన్నుమూత

ప్రముఖ పౌరహక్కుల ఉద్యమ నేత కందాళై గోపాలస్వామి కన్నబిరాన్ (82) 30 డిసెంబర్ 2010న సాయంత్రం మరణించారు. కొంతకాలంగా ఆయన అనారోగ్యంతో బాధపడుతున్నారు. 9 నవంబర్ 1929న తమిళనాడులోని మదురైలో ఆయన జన్మించారు. 1954 చివరిలో మద్రాసు హైకోర్టులో న్యాయవాద వృత్తిలో ప్రవేశించారు. అప్పటి నుంచి ఐదున్నర దశాబ్దాల పాటు పౌర, ప్రజాస్వామిక హక్కు కోసం రాష్ట్రంలోనూ, దేశంలోనూ అలుపెరుగని కృషి చేశారు. రాజ్యాంగంలోని పీఠిక, ఆదేశిక సూత్రాలు, ప్రాథమిక హక్కుల అమలు కోసం పోరాటం చేశారు. ప్రత్యామ్నాయ ఉద్యమాలకు బాసటగా నిలిచారు.

## చంద్రబాబు నిరాహార దీక్ష

తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు ఎన్. చంద్రబాబు నాయుడు డిసెంబర్ 17న రైతు సమస్యలపై హైదరాబాద్‌లోని న్యూ ఎం.ఎల్.ఎ. క్వార్టర్స్‌లో నిరహార దీక్ష చేపట్టారు. డిసెంబర్ 24న ఆయన ఆరోగ్యం క్షీణించడంతో వివిధ జాతీయ పార్టీల నేతల ఒత్తిడి మేరకు ఆయన దీక్ష విరమించారు.

## విద్యార్థులపై కేసుల ఎత్తివేత

ప్రత్యేక తెలంగాణ, సమైక్యాంధ్ర ఉద్యమాల సందర్భంగా విద్యార్థులు, ఉద్యమకారులపై నమోదు చేసిన కేసులన్నిటినీ సూత్రప్రాయంగా ఎత్తివేస్తున్నట్లు రాష్ట్ర ప్రభుత్వం డిసెంబర్ 28న ప్రకటించింది. అధికార కాంగ్రెస్ పార్టీ తెలంగాణ ఎం.పి.ల దీక్షకు స్పందనగా రాష్ట్ర ప్రభుత్వం ఈ నిర్ణయం తీసుకుంది. డిసెంబర్ 27 వరకు 700 కేసులు ఎత్తివేసామని, మిగిలిన 1100 కేసులు కూడా ఎత్తివేసేందుకు నిర్ణయించినట్లు హోంమంత్రి సబితా ఇంద్రారెడ్డి తెలిపారు.

## శ్రీకృష్ణ కమిటీ నివేదిక

శ్రీకృష్ణ కమిటీ సభ్యులు నిర్ణీత గడువుకు ఒక రోజు ముందే అంటే 30 డిసెంబర్ 2010న కేంద్ర హోంమంత్రి పి. చిదంబరంకు తమ నివేదికను అందజేశారు. రెండు సంపుటాల్లో ఆరు వందల పేజీలు ఉన్న నివేదికను హోంమంత్రి అందుకున్నారు. కమిటీ తన నివేదికలో ఆంధ్రప్రదేశ్ భవిష్యత్తును ఉద్దేశించి ఆరు సూచనలు చేసింది. ఆ సూచనలలో మొదటి మూడు సూచనలు ఆచరణీయం కాదని తానే పేర్కొంది. నాల్గవ సూచన కష్టసాధ్యమైంది. ఐదవ సూచన హైదరాబాద్‌తో కూడిన తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేయాలని తన రెండవ ప్రాధాన్యతగా పేర్కొంది. మొదటి ప్రాధాన్యతగా ఆరవ సూచనలో రాష్ట్రం సమైక్యంగా కొనసాగాలని, తెలంగాణకు ప్రాంతీయ మండలి ఏర్పాటు చేయాలని పేర్కొంది. ఈ రిపోర్ట్ నేపథ్యంలో తెలంగాణ ప్రాంతమంతటా నిరసనలు, ధర్నాలు, రాస్తారోకోలు, బంద్‌లు కొనసాగుతూనే ఉన్నాయి. పార్లమెంట్ బడ్జెట్ సమావేశాలలో తెలంగాణ బిల్లు పెట్టాలని ఉద్యమం కొనసాగుతుంది.

## అవినీతే ఘనకీర్తి

అవినీతి నిరోధక శాఖ (ఎ.సి.బి.) ఆధ్వర్యంలో జరిగిన దాడులలో గత ఏడాది కేవలం 81 మంది అవినీతి అధికారుల అక్రమార్జన రు. 88.28 కోట్లుగా తేలింది. ఎ.సి.బి. గుర్తించిన అక్రమ ఆస్తుల విలువ బహిరంగ మార్కెట్‌లో రు. 400 కోట్లకు పై మాటే. వీరిలో నేర నిర్ధారణ అయిన 44 మందిని ఉద్యోగం నుంచి తొలగించారు.

## కొనసాగుతున్న రైతుల ఆత్మహత్యలు

రాష్ట్రంలో ప్రతిరోజూ పదుల సంఖ్యలో రైతుల ఆత్మహత్యలు కొనసాగుతున్నాయి. వరదలు, అకాల వర్షాల తాకిడికి పంట నష్టపోయిన రైతాంగం, అందునా కౌలు రైతులు అప్పుల బాధతో అనారోగ్యం పాలై గుండెపోట్లతోనో, బలవన్మరణాలగానో చనిపోతూనే ఉన్నారు. వీ

*పౌర, ప్రజాస్వామిక హక్కుల కోసం ఐదున్నర దశాబ్దాల పాటు అనితరసాధ్యమైన, సాహసోపేతమైన కృషి చేసిన కె.జి. కన్నబిరాన్ జీవితం, వ్యక్తిత్వం, పోరాటం అందరికీ మార్గదర్శకం అంటున్నారు* **ఎన్.వేణుగోపాల్**

# నిజమైన ప్రజల మనిషి కన్నబిరాన్

కె జి కన్నబిరాన్ లక్షలాది మంది ప్రజల ప్రేమనూ అభిమానాన్నీ చూరగొన్న నిజమైన ప్రజల మనిషి. ఆధునిక తెలుగు సామాజిక జీవితంలో ప్రజల మనిషి అనే విశేషణానికి సంపూర్ణంగా సరిపోయే అతి కొద్ది మందిలో ఆయన ఒకరు. నాలుగు దశాబ్దాలకు పైగా ఆంధ్రప్రదేశ్‌లో గాని, దేశవ్యాప్తంగా గాని ప్రాథమిక హక్కులు కోల్పోయిన ప్రతి మనిషీ, అధికారం చేతిలో, పోలీసుల చేతిలో దౌర్జన్యానికి గురయిన ప్రతి మనిషీ ఆయనను తలచుకుని ఉంటారు, ఆయన సహాయం కోరి ఉంటారు, న్యాయవాదిగానూ, ఉద్యమ కార్యకర్తగానూ, మంచి మనిషిగానూ ఆయన అందించిన సహాయం పొంది ఉంటారు. ఎనభై రెండు సంవత్సరాల సంపన్నమైన, సార్థకమైన నిండు జీవితంలో అరవై సంవత్సరాలకు పైగా ఆయన ప్రజా ఉద్యమాలలో, ప్రజల హక్కుల పరిరక్షణలో, ప్రజాస్వామిక విలువలను పెంపొందించే కృషిలో నిరంతరం పాలుపంచుకున్నారు. సమాజంలో అణగారిన, అణచివేతకు గురవుతున్న, పోరాడుతున్న ప్రజలకూ వర్గాలకూ అలా పెద్దదిక్కుగా నిలబడిన కన్నబిరాన్ 2010 డిసెంబర్ 30న తుదిశ్వాస విడిచారు.

తెలుగు సమాజానికీ, పౌరహక్కుల ఉద్యమానికీ, మొత్తంగా భారత పీడిత ప్రజా ఉద్యమాలకూ కన్నబిరాన్ అందించిన కానుకలు అపారమైనవి, అద్భుతమైనవి. ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘానికి అత్యంత కీలకమైన, నిర్బంధ భరితమైన కాలంలో ఆయన 1978 నుంచి 1993 దాకా పదిహేను సంవత్సరాల పాటు అధ్యక్షుడిగా పనిచేశారు. రాష్ట్రంలోనూ, దేశంలోనూ ట్రేడ్ యూనియన్ల, ఉద్యోగుల, దళితుల, ఆదివాసుల, మత మైనారిటీల, జాతి విముక్తి పోరాటాల, విప్లవోద్యమాల హక్కులను పరిరక్షించే వందలాది కేసులలో 1960ల మధ్య నుంచీ కూడ ఆయన తన న్యాయశాస్త్ర నైపుణ్యాన్ని, వాదనా పటిమను అందజేస్తూ వచ్చారు. నక్సలైట్ న్యాయవాదిగా పేరు తెచ్చుకునేంతగా నక్సలైట్ల కేసులు వాదించడం మాత్రమే కాక, నక్సలైట్ల మీద సాగిన, సాగుతున్న నిర్బంధకాండను ఎదిరించడంలో, ప్రపంచం దృష్టికి తేవడంలో ఆయన అనన్య సాధ్యమైన కృషి చేశారు. డజన్ల కొద్దీ బూటకపు ఎన్‌కౌంటర్ ఘటనల మీద నిజనిర్ధారణ బృందాలలో పాల్గొని ఎన్‌కౌంటర్ కట్టుకథల బూటకత్వాన్ని బహిర్గతం చేశారు. తార్కుండే కమిటీ, జస్టిస్ భార్గవా కమిషన్, జాతీయ మానవహక్కుల సంఘం, మెజిస్ట్రీరియల్ విచారణలు, న్యాయవిచారణలు, జిల్లా కోర్టులు, రాష్ట్రాల హైకోర్టులు, సుప్రీంకోర్టు – ప్రతి న్యాయ వేదిక మీదా ఆయన ఎన్‌కౌంటర్ హత్యల కేసులు వాదించారు. ప్రతి ఎన్‌కౌంటర్ ఘటననూ హత్యకేసుగా నమోదు చేయాలని, ఆత్మరక్షణార్థమే కాల్పులు జరిపామని రుజువు చేసుకునే బాధ్యత పోలీసులదేనని హైకోర్టు తీర్పు రావడానికి ప్రధాన కృషి కన్నబిరాన్‌దే. ఎన్నో లాకప్ మరణాల కేసులను కూడ ఆయన చేపట్టి, పోలీసుల దుర్మార్గాన్ని ప్రజల దృష్టికి తెచ్చారు. ప్రజలమీద ప్రభుత్వాలు, పోలీసులు, పాలకవర్గాలు, ఆధిపత్యశక్తులు చేసే ప్రతి అక్రమాన్నీ, దౌర్జన్యాన్నీ ప్రశ్నించారు. బ్రిటిష్ వలసవాద పాలకులు తయారు చేసిన చట్టాలను 1947 తర్వాత, మరీ ముఖ్యంగా 1950 రాజ్యాంగం తర్వాత యథాతథంగా వాడుకోవడం అప్రజాస్వామికమని, ప్రజావ్యతిరేకమని ఆయన వాదించేవారు. ప్రభుత్వ వ్యతిరేకులందరినీ కుట్రదారులుగా, రాజద్రోహులుగా అభివర్ణించే వలసవాద రాజ్య హింసా విధానం ఇంకానా ఇకపై చెల్లదు అని ఆయన ప్రతిచోటా ఎలుగెత్తారు. భారత రాజ్యాంగం కేవలం పుస్తకం కాదనీ, అది భారత ప్రజలు సాగించిన వలసవాద వ్యతిరేక ఉద్యమ ఆకాంక్షల ఫలితమనీ ఆయన అనేవారు. ఆ ఆకాంక్షలు ప్రవేశికలో, ప్రాథమిక హక్కులలో, ఆదేశిక సూత్రాలలో ఉన్నాయనీ వాటిని కాపాడని ప్రభుత్వాలపై తిరగబడే హక్కు ప్రజలకు ఉందనీ ఆయన అనేవారు. రాజ్యాంగంలోని ప్రవేశికనూ, ప్రాథమిక హక్కులనూ, ఆదేశిక సూత్రాలనూ సంపూర్ణంగా అమలు జరపాలనీ, చట్టబద్ధ పాలనను నెలకొల్పాలనీ, ఏఒక్కరికీ, ముఖ్యంగా అధికారంలో ఉన్నవారికి, శిక్షాతీత హింసా ప్రవృత్తికి అవకాశం లేకుండా చేయాలనీ, ప్రభుత్వ విధానాలను విమర్శించే, ఎదిరించే హక్కు ప్రజలకు

వీక్షణంలో కె.జి.కన్నబిరాన్ రచనలు

**ఆంధ్రప్రదేశ్‌లో హక్కుల అణచివేతకు ప్రతిస్పందనే 'అలిపిరి'** – జనవరి 16-31, 2004, (కె. బాలగోపాల్ (ఎచ్.ఆర్.ఎఫ్.)తో);

**యాభై ఏళ్ల ఆంధ్రప్రదేశ్ – విజయాలు వైఫల్యాలు** – నవంబర్ 2006

**ఆరు దశాబ్దాల అభివృద్ధి** – సెప్టెంబర్, అక్టోబర్ 2007

**విలువలు నశించిన రాజకీయాలు** – ఫిబ్రవరి 2008

**చిరంజీవి – ప్రజాసేవ** – సెప్టెంబర్ 2008

**వాళ్లు నన్ను మార్క్సి అంటారు...** – నవంబర్ 2008

**వరంగల్ 'ఎన్‌కౌంటర్' గురించి** – జనవరి 2009

**ఆదేశిక సూత్రాలే అంతిమ లక్ష్యం** – జూన్ 2010

ఉన్నదని గుర్తించి గౌరవించాలనీ, వ్యక్తిగత ప్రవర్తనలో ప్రజాస్వామిక విలువలను పాటించాలనీ ఆయన జీవితాంతం మాట్లాడారు, వాదించారు, రాశారు, అక్షరాలా ఆ విలువలను పాటిస్తూ జీవించారు.

కన్నబిరాన్ జీవితం చాల వైవిధ్యభరితమైనది, ఎన్నెన్నో రంగాల జీవితానుభవాలు కలగలిసినది. మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబంలో పుట్టి, తల్లి పోషణలో పేదరికం అనుభవించవలసి వచ్చి, చిన్ననాటనే కులాచారాల పట్ల ఏవగింపు కలిగి, సామాజిక న్యాయ ఆకాంక్షలను ఆకళింపు చేసుకున్న వ్యక్తిగా ఆయన జీవితంలో పాటించిన చాల విలువలకు పునాది బాల్య, కౌమార దశలలోనే పడింది. చదువరిగా, రచయితగా, వేలాది మంది క్లైంట్లకు న్యాయసహాయం అందించిన న్యాయవాదిగా, డజనుకుపైగా న్యాయవాదులకు నేరుగానూ, కొన్ని డజన్ల న్యాయవాదులకు పరోక్షంగానూ సీనియర్‌గా, పౌరహక్కుల ఉద్యమకారుడిగా, వక్తగా, అధికారాన్ని ప్రతిఘటించిన సాహసిగా, ప్రజాఉద్యమాల సహచరుడిగా, తాత్వికస్థాయిలో మార్క్సిస్టుగా, ప్రతి అప్రజాస్వామిక ప్రవర్తననూ విమర్శించినవాడిగా ఆయనలో ఎన్ని కోణాలు, పొరల విశాలమైన జీవితం ఉన్నదంటే, ఆ విస్తారమైన జీవితాన్ని ఒక వ్యాసంలో పట్టుకోవడం సాధ్యం కాదు. నిజానికి 500 పేజీలు సాగిన ఆయన ఆత్మకథాత్మక సామాజిక చిత్రం '24 గంటలు' గాని, ఆయన ఇంగ్లిషు వ్యాస సంకలనం 'వేజెస్ ఆఫ్ ఇంప్యునిటీ' గాని, ఆయన జీవితంలో పదో వంతును కూడ పట్టుకోలేకపోయాయి. ఒక్క మాటలో చెప్పాలంటే ఆయన జీవితం 1960ల తర్వాత సామాజిక చరిత్రకు దర్పణం. తెలుగుసీమలో మొత్తంగానూ, దేశవ్యాప్తంగా ప్రజా ఉద్యమాల విషయంలోనూ సాగిన సామాజిక పరిణామాలన్నిటికీ ఆయన సాక్షి, భాగస్వామి, వ్యాఖ్యాత, విమర్శకుడు.

1929 నవంబర్ 9న మదురైలో జన్మించిన కన్నబిరాన్ బాల్యం సికిందరాబాదులోనూ, పాఠశాల విద్య సికిందరాబాదు, నెల్లూరులలోనూ గడిచాయి. ఇంటర్మీడియట్, బి ఎ (ఆనర్స్), ఎల్ ఎల్ బి మద్రాసులో చదువుకున్నారు. మద్రాసు హైకోర్టులో 1954 చివరిలో న్యాయవాద వృత్తిలో ప్రవేశించి 1960లో హైదరాబాద్ కు మారారు. చిన్ననాటి ప్రభావాల వల్ల, సోదరులిద్దరూ కమ్యూనిస్టు రాజకీయాల్లో, ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలలో ఉండడంవల్ల ఆయన హైదరాబాదు న్యాయవాద జీవితం కార్మికవర్గపు కేసులతో, సింగరేణి బొగ్గుగని కార్మికుల కేసులతో ప్రారంభమయింది. భారత-చైనా యుద్ధ సమయంలో చైనాను సమర్థించారనే ఆరోపణతో 1964లో కమ్యూనిస్టు పార్టీ నాయకులలో కొందరిని అరెస్టు చేసినప్పుడు పౌరహక్కుల సంఘం ఏర్పాటు చేయడానికి జరిగిన ప్రయత్నాలలో కన్నబిరాన్ భాగమయ్యారు. కాని కొద్దికాలానికే భారత కమ్యూనిస్టు పార్టీలో చీలిక రావడంతో అసలు ఆ ప్రయత్నాలే ఆగిపోయాయి. తర్వాత 1969-70లలో నక్సల్బరీ పంథాలో సాగుతున్న శ్రీకాకుళ గిరిజనోద్యమంపై భయంకరమైన అణచివేత, ఎన్‌కౌంటర్లు, అరెస్టులు, చిత్రహింసలు మొదలయినప్పుడు, వెంపటాపు సత్యనారాయణ, ఆదిభట్ల కైలాసంతో సహా శ్రీకాకుళం విప్లవకారులమీద పార్వతీపురం కుట్రకేసు, తరిమెల నాగిరెడ్డి, దేవులపల్లి వెంకటేశ్వర రావు తదితరులపై హైదరాబాదు కుట్రకేసు ప్రారంభమయినప్పుడు రాష్ట్రవ్యాప్తంగా ఏర్పడిన డిఫెన్స్ కమిటీల ప్రయత్నాలలో ఆయన భాగమయ్యారు.

ఆ క్రమంలోనే ఆయనే చెప్పుకున్నట్టు ఆయనను విప్లవోద్యమం వైపు నడిపించినవి విప్లవ సాహిత్యం మీద, విప్లవ సాహిత్యకారులమీద వచ్చిన రెండు కేసులు. విప్లవ రచయితల సంఘం ఏర్పడిన రోజున (4 జులై 1970) వెలువడిన మార్చ్, విరసం మొదటి మహాసభల సందర్భంగా (9-10 అక్టోబర్ 1970) వెలువడిన ఝంఝ, లే కవితా సంకలనాలను ప్రభుత్వం నిషేధించినప్పుడు, కన్నబిరాన్ మార్చ్, లే ల నిషేధాన్ని సవాల్ చేస్తూ వాదించారు. రాష్ట్ర హైకోర్టు మార్చ్ పై నిషేధాన్ని ఆమోదిస్తూ, లే పై నిషేధాన్ని కొట్టివేసింది. అంతకు ముందే విరసం నాయకులు జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చెరబండరాజులను ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం కింద నిర్బంధించారు. కన్నబిరాన్ దగ్గర అప్పుడు జూనియర్ గా పనిచేస్తుండిన ఒక న్యాయవాదికి జ్వాలాముఖి బంధువు కావడం వల్ల ఆ కేసు కన్నబిరాన్ చేపట్టారు. అసలు ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం భారత రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధమని, అందువల్ల దానికింద ఎవరినీ నిర్బంధించడానికి వీలులేదని కన్నబిరాన్ వాదించారు. ఆ వాదనల ఫలితంగా జస్టిస్ చిన్నప్ప రెడ్డి, జస్టిస్ ఎ.డి.వి. రెడ్డి 'రాజకీయ విశ్వాసాలు కలిగి ఉన్నందుకు, అవి ప్రకటించినందుకు ఎవరినీ నిర్బంధించడానికి వీలు లేదు' అని సుప్రసిద్ధమైన తీర్పు ఇచ్చారు. అసలు ఈ వాదనల వల్ల పి.డి. చట్టం రద్దయిపోవలసి వచ్చింది. ఆ తర్వాత వరుసలో వచ్చిన అన్ని దమన చట్టాలకూ - ఆంతరంగిక భద్రతా చట్టం, జాతీయ భద్రతా చట్టం, టెర్రరిస్ట్ అండ్ డిస్రప్టివ్ ఆక్టివిటీస్ (ప్రివెన్షన) యాక్ట్ (టాడా), ప్రివెన్షన్ ఆఫ్ టెర్రరిజం యాక్ట్ (పోటా), అన్ లాఫుల్ యాక్టివిటీస్ ప్రివెన్షన్ యాక్ట్ (ఉపా), కల్లోలిత ప్రాంతాల చట్టం, ప్రజా భద్రతా చట్టం, సాయుధదళాల ప్రత్యేక అధికారాల చట్టం, వగైరా అన్నిటికీ - వ్యతిరేకంగా న్యాయస్థానాలలో వాదించిన, సమాజంలో పోరాడిన అతి కొద్ది మందిలో కన్నబిరాన్ ఒకరు.

కౌమారదశ నుంచే విపరీతంగా అధ్యయనం చేసే అలవాటున్న కన్నబిరాన్ న్యాయశాస్త్రం, చట్టం మాత్రమే కాక, కవిత్వం, నవల, రాజకీయార్థశాస్త్రం, తత్వశాస్త్రం, రాజకీయాలు, చరిత్ర, మార్క్సిజం కూడ చదువుకున్నారు. తన అధ్యయనం నుంచి ఆయన కేవలం జ్ఞాపకం మీదనే విపరీతంగా ఉటంకిస్తూ ఉండేవారు. అలాగే, విప్లవ సాహిత్య కేసులతో విప్లవ సాహిత్యాన్ని, విప్లవోద్యమాన్ని కూడ సన్నిహితంగా నిశితంగా అధ్యయనం చేశారు. 1970-75 మధ్య చెరబండరాజు రాసి, కోర్టులలో పాడుతుండిన ఎన్నో పాటలను కన్నబిరాన్ చాల తరచుగా గుర్తు తెచ్చుకుంటూ ఉండేవారు. భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షకు వ్యతిరేకంగా జరిగిన ఆందోళనలోనూ, రెండవసారి ఉరిశిక్ష అమలు ప్రయత్నాన్ని అడ్డుకోవడంలోనూ ఆయనకు వ్యక్తిగత పాత్ర ఉంది. దానితో తెలంగాణలో జరుగుతున్న రైతాంగ విప్లవోద్యమంతో ఆయన సంబంధం మరింత గాఢమయింది. రైతాంగ విప్లవోద్యమ కార్యకర్తలుగా ఉరికంబం ఎక్కవలసి వచ్చిన ఆ ఇద్దరితో ప్రత్యక్ష సంబంధం వల్ల, మరణశిక్ష అమానుషమైనదనే అవగాహన వల్ల ఆయన మరణశిక్షకు వ్యతిరేకంగా చాల కృషి చేశారు.

ఇక ఎమర్జెన్సీలో దేశమే చీకటి కొట్టుగా మారిపోయినప్పుడు, వేలాది మంది జైళ్లలో మగ్గిపోతున్నప్పుడు ఆ ఎమర్జెన్సీని సమర్థించిందన్న కారణంతో సిపిఐతో అప్పటివరకూ ఉన్న సంబంధాన్ని కూడ ఆయన తెంచుకున్నారు. ఒకవైపు రాజకీయ విశ్వాసాలలో అంత దృఢంగా

ఉంటూనే, పౌరహక్కుల ఉల్లంఘనకు గురి అయినవారు ఎవరయినా సరే వారి పౌరహక్కులను పరిరక్షించడం తన బాధ్యత అని ఆయన చాల విశాల దృక్పథంతో అనుకున్నారు. అందుకే ఎమర్జెన్సీలో రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ కార్యకర్తల నుంచి మార్క్సిస్టు లెనినిస్టు పార్టీ కార్యకర్తలదాకా ప్రతి ఒక్కరూ తమ న్యాయవాది కన్నబిరాన్ అని చెప్పే పరిస్థితి వచ్చింది. ఎమర్జెన్సీలో ఆయన ఒంటి చేతిమీద వందలాది రిట్ పిటిషన్లు వేసి ఏదో ఒకస్థాయిలో ఖైదీల హక్కులను కాపాడడానికి ప్రయత్నించారు.

ఎమర్జెన్సీలో ఏకైక ప్రతిపక్ష న్యాయవాదిగా ఆయన చేసిన ఈ కృషి వల్లనే, ఎమర్జెన్సీ అనంతరం ఆయనకు దేశవ్యాప్తంగానే పౌరహక్కుల ఉద్యమ నాయకత్వ బాధ్యతలు వచ్చాయి. ఎమర్జెన్సీలో రాష్ట్రంలో జరిగిన ఎన్‌కౌంటర్ హత్యల నిజానిజాలను నిర్ధారించడానికి జయప్రకాశ్ నారాయణ్ నియమించిన తార్కుండే కమిటీకి ఆయన కార్యదర్శిగా పనిచేశారు. తార్కుండే కమిటీ బూటకపు ఎన్‌కౌంటర్లుగా నిర్ధారించిన కేసులలో నుంచి మూడు కేసులపై విచారణ జరపడానికి జస్టిస్ వశిష్ట భార్గవ నాయకత్వాన న్యాయవిచారణ కమిషన్ ఏర్పడినప్పుడు దాని ముందర వాదనలు వినిపించారు.

ఈలోగా 1978 ఏప్రిల్‌లో వరంగల్‌లో జరిగిన ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం రెండవ మహాసభల్లో ఆయన అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. ఆ తర్వాత పదిహేను సంవత్సరాలలో ఒకవైపు ప్రజా ఉద్యమ విస్తరణనూ, దానిపై కాంగ్రెస్, తెలుగుదేశం ప్రభుత్వాలు సాగించిన భయంకరమైన అణచివేతనూ ఆయన దగ్గరి నుంచి చూశారు. ప్రజా ఉద్యమానికి అండగా నిలిచారు. ప్రజల హక్కులను కాపాడడానికి తన శక్తియుక్తులన్నిటినీ వెచ్చించారు. పాలకుల, పోలీసుల అత్యాచారాలను ఎదుర్కొన్నారు. ఒక దశలో రాష్ట్రంలో నిజమైన ప్రతిపక్షం ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం మాత్రమే అనే అభిప్రాయం కలిగేటంత పెద్ద ఎత్తున ఆయన పనిచేశారు, సంస్థ చేత పనిచేయించారు. గత పది, పదిహేను సంవత్సరాలుగా న్యాయవాద వృత్తిని, ఆఫీసును క్రమక్రమంగా తగ్గిస్తూ వచ్చినా, ఆరోగ్యం సహకరించకపోయినా, పౌరహక్కుల పరిరక్షణ కోసం నిరంతరం తపన పడుతూ వచ్చారు. ప్రజాస్వామ్య విలువలకు ఎక్కడ భంగం వాటిల్లినా, ప్రాథమిక హక్కుల ఉల్లంఘన ఎక్కడ జరిగినా తక్షణమే స్పందించేవారిలో ఆయన మొదట ఉండేవారు. అందువల్లనే దేశవ్యాప్తంగా కూడ ఎన్నో కేసుల్లో ఆయా ప్రజాసమూహాలు, ప్రజాసంస్థలు, ఉద్యమాలు ఆయన సహాయం కోరుతూ వచ్చాయి. ఈశాన్య భారత జాతుల పోరాటాలు, పశ్చిమ బెంగాల్ ఎన్‌కౌంటర్లు, ఉత్తరప్రదేశ్‌లో మానవహక్కుల కమిషన్ ఏర్పాటు, కాశ్మీర్ ప్రజల మీద సైన్యం అత్యాచారాలు, పంజాబ్ యువకులపై ప్రభుత్వ దమనకాండ, ఢిల్లీలో సిక్కుల ఊచకోత, పార్లమెంటు దాడి కేసు పేరుతో అమాయకులపై వేధింపులు, గుజరాత్ మారణకాండ, బొంబాయిలో ముస్లింల మీద అత్యాచారాలు, కర్నాటకలో వీరప్పన్ అనుచరుల పేరుమీద ఆదివాసులపై దాడులు, తమిళనాడులో శ్రీలంక కాందిశీకులపై దాడులు, ఒడిషాలో క్రైస్తవులపై దాడులు – ఆయన స్పందించని పౌరహక్కుల ఉల్లంఘన ఘటనలు దాదాపు లేవనే చెప్పాలి. ఆరోగ్యం సహకరించినంతవరకూ, చివరి నిమిషం దాక కూడ ఆయన పౌరహక్కుల పరిరక్షణ కృషిని సాగిస్తూనే వచ్చారు.

న్యాయవాదిగానైనా, పౌరహక్కుల ఉద్యమకారుడిగానైనా ఆయన సామాజిక జీవితపు మొదలూ తుదీ చూస్తే ఆయన హృదయం అవగతమవుతుంది. మద్రాసు హైకోర్టులో న్యాయవాద వృత్తిలో ప్రవేశించిన తొలిరోజుల్లో 1955–56ల్లోనే ఆయన చేసిన కేసులలో ఒకటి ఆసియా బేగం ది. దేశ విభజన తర్వాత పాకిస్తాన్‌లో మంచి బతుకు ఉంటుందేమోననే ఆశతో వెళ్లి, ఆ ఆశ నిరాశ కాగా వెనక్కి వచ్చిన స్త్రీ ఆమె. తిరిగి వస్తున్నప్పుడు సరిహద్దు దగ్గర అధికారులు ఆమె చేతుల్లో ఒక కాగితం పెట్టారు. ఆ కాగితాన్ని పాస్ పోర్ట్ అంటారని, అది ఆ దేశ పౌరసత్వానికి చిహ్నమనీ ఆమెకు తెలియదు. కాని ఆ ఒక్క కాగితంతో ఆమె పాకిస్తాన్ పౌరురాలయిపోయింది. ఆమె పాకిస్తాన్ పౌరురాలు గనుక వెనక్కి తిప్పి పంపుతామని భారత అధికారులు అన్నారు. అప్పుడే అమలులోకి వచ్చిన భారత పౌరసత్వ చట్టం ప్రకారం ఏ వ్యక్తి దగ్గరయినా విదేశీ పాస్ పోర్టు ఉన్నట్టయితే వారు భారత పౌరులు కానట్టే. ఆ అభాగ్యమహిళ పక్షాన వాదించిన కన్నబిరాన్ ఆమెను వెళ్లగొట్టడానికి అధికారులు చేసిన ప్రయత్నాలను రద్దు చేయించారు. అలాగే, చనిపోవడానికి మూడు రోజుల ముందు, ఒక సెషన్స్ కోర్టు చట్టవ్యతిరేకంగా, రాజ్యాంగస్ఫూర్తికి భిన్నంగా పౌరహక్కుల నాయకుడు డా.బినాయక్ సేన్‌కు యావజ్జీవ శిక్ష విధించినప్పుడు వెంటనే ఖండించారు. అటుకొసన ఒక పేద ముస్లిం మహిళ హక్కుల కోసం నిలబడిన సందర్భానికీ, ఇటు కొసన ఒక ఉన్నత మధ్యతరగతి వైద్యుడు, సామాజిక కార్యకర్త హక్కుల కోసం నిలబడిన సందర్భానికీ మధ్యన ఐదున్నర దశాబ్దాలు గడిచినా కన్నబిరాన్ అనుసరించిన స్ఫూర్తి ఒకటే, లక్ష్యం ఒకటే – మనిషి సగౌరవంగా, హక్కులతో, చట్టబద్ధ పాలనలో, సురక్షితంగా జీవించాలని. అధికారంలో ఉన్నవారు దాన్ని దౌర్జన్యానికీ, శిక్షాతీతమైన, విచారణాతీతమైన నేరస్వభావంతో వాడగూడదని. ప్రజలను హింసకూ, భయానికీ, అభద్రతకూ గురిచేయగూడదని.

నిజానికి ఈ మనిషి కోసం, మనిషి హక్కుల కోసం తపనే కన్నబిరాన్ తాత్విక దృక్పథం. 'ఊరికే జడ్జి చెప్పిన, బెంచి గుమస్తా చెప్పిన వాయిదా తేదీలు, ఐపిసి, సి ఆర్ పిసి సెక్షన్లు ఆ కట్ట విప్పకుండా రాసుకోవడం కాదు. ఆ కట్టలు విప్పి చూడండి. నిలువుగా మలిచిన ఆ కోర్టుకాగితాల కట్ట విప్పిచూస్తే మనుషులు కనబడతారు, వేదనకు గురవుతున్న మనుషులు కనబడతారు, వాళ్లు మీ సహాయం అర్థిస్తూ ఉంటారు' అని ఆయన సహ న్యాయవాదులతో, జూనియర్లతో అంటుండేవారు.

న్యాయస్థానాలకు, ముఖ్యంగా న్యాయమూర్తులకు మనుషుల గురించి, మనుషుల వేదన గురించి తెలియదని కూడ ఆయనకు చాల కోపంగా ఉండేది. కోర్టుధిక్కార నేరారోపణకు భయపడకుండా న్యాయమూర్తులను ఎడాపెడా వాయించిన అతి తక్కువమంది న్యాయవాదులలో ఆయన ఒకరు. ఆ న్యాయమూర్తులకు సమాజం గురించి, మనుషుల గురించి, మార్పు గురించి పాఠాలు చెప్పాలని ఆయన అనుకునేవారు. అందుకే ఆయన కోర్టు వాదనలు అద్భుతమైన, ఉద్వేగభరితమైన ఉపన్యాసాలలా ఉండేవి. బయట బహిరంగసభలలో ఉపన్యాసాలలో సాధారణ ప్రజలకు కోర్టుల గురించీ, చట్టాల గురించీ, మాయ గురించీ చెప్పాలనుకునేవారు గనుక అవి వాదనలలా ఉండేవి.

*న్యాయస్థానాలు రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధంగా, ప్రజా వ్యతిరేకంగా, పాలక వర్గాలకు అనుకూలంగా వలస స్వభావంతో రాజ్యాంగాన్ని ఎలా వ్యాఖ్యానిస్తున్నాయో వివరించారు* **కె.జి. కన్నబిరాన్**

# వలస చట్టాల ప్రభావం

ఇప్పటిదాకా చెబుతున్న కుట్ర కేసుల వ్యవహారం చూస్తే ఇదంతా ఏదో ఆంధ్రప్రదేశ్ సంగతి మాత్రమేనని అనిపిస్తుందేమో. కాని రాజకీయంగా భిన్నాభిప్రాయాలున్న వాళ్ల మీద 1947 నుంచీ కూడా భారత ప్రభుత్వం, అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు తీసుకున్న వైఖరి అదే. భారత ప్రజలమైన మనకు మనం రాజ్యాంగం ద్వారా ప్రాథమిక హక్కులకు హామీ 1950 జనవరిలో ఇచ్చుకున్నాం గాని, అంతకు ముందు నుంచే మన ప్రాథమిక హక్కులను ప్రభుత్వాలు ఉల్లంఘించడం మొదలుపెట్టాయి.

1947 ఆగస్టు 15న మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం రాజకీయ ఖైదీలందరినీ విడుదల చేసింది. కాని అప్పటికి జైలులో ఉన్న ఎ కె గోపాలన్‌ను మాత్రం విడుదల చేయలేదు. ఆగస్టు 14న ఆయన ఒక చెరసాలలో ఏకాంతవాస శిక్షను అనుభవిస్తున్నాడు. ఆ మర్నాడు స్వాతంత్ర్య దినోత్సవాన్ని జైలు ఆవరణలోనే జరుపుకోవాలని ఆయన నిశ్చయించు కున్నాడు. కొందరు తోటి ఖైదీలు వెంటరాగా ఆయన ఆ ఆగస్టు 15 ఉదయం జైలు ఆవరణలోనే జాతీయ పతాకం పట్టుకుని ఊరేగింపు జరిపాడు. మూడో బ్లాకు పైకప్పు మీద జెండా ఎగురేసి జెండా వందనం కూడా జరిపాడు. అక్కడ గుమిగూడిన ఖైదీలను ఉద్దేశించి ఆయన ఓ నాలుగైదు నిమిషాలు ఉపన్యాసం కూడా చేశాడు. ఈ పని చేసినందుకుగాను ఆయనను కాలికట్ అదనపు జిల్లా మెజిస్ట్రేటు ముందు హాజరుపరిచి రాజద్రోహం నేరం ఆరోపించారు. మహాఘనత వహించిన చక్రవర్తికి వ్యతిరేకంగా ప్రజలను రెచ్చగొట్టే రాజద్రోహానికి పాల్పడ్డాడని ఆయన మీద నేరం ఆరోపించారు. అప్పటికి చక్రవర్తి ప్రభుత్వం పడిపోయింది, స్వతంత్ర ప్రభుత్వం అధికారానికి వచ్చింది. కాని మన న్యాయవ్యవస్థకు ఈ మార్పులతో ఏ సంబంధమూ లేదు.

ఆ నేరారోపణకు జవాబు చెబుతూ ఎ కె గోపాలన్ న్యాయస్థానం ముందు చేసిన ప్రకటన చాలా ముఖ్యమైనది. ఎందుకంటే స్వతంత్ర భారత ప్రభుత్వం కూడా వలసవాద పాలనా సంప్రదాయాలనే పాటించబోతున్నదని ఆ ప్రకటన స్పష్టం చేసింది.

"చట్టబద్ధంగా ఏర్పడిన బ్రిటిష్ భారత సామ్రాజ్య చక్రవర్తికి వ్యతిరేకంగా శత్రుత్వ భావాలు రెచ్చగొడుతున్నాననే నేరం మీద విచారణ ఎదుర్కోవడం నాకు చాలా గర్వకారణంగా ఉన్నది. ఈ దేశంలోని స్వేచ్ఛాప్రియులందరూ, స్వాతంత్ర్యోద్యమ ప్రారంభం నుంచీ గాంధీ, నెహ్రూల దాకా నాయకులందరూ ఈ చక్రవర్తి ప్రభుత్వానికి వ్యతిరేకంగా అటువంటి శత్రుత్వ భావనను కల్పించేందుకే ప్రయత్నించారు. ఆ లక్ష్యం కోసం పని చేసినందుకే మహాత్మాగాంధీని భారత శిక్షాస్మృతిలోని సెక్షన్ 124-ఎ కింద రాజద్రోహ నేరం ఆరోపించి విచారించారు.

దానంతటి ఫలితంగానే ఈ రోజున మహాఘనత వహించిన ప్రభుత్వం, బ్రిటిష్ ఇండియా అంతర్ధానమైపోయాయి. నాతోపాటు ఆ నేరం చేసిన నా సహకార్యకర్తలెందరో ఇవాళ మంత్రులుగా, గవర్నర్లుగా ఉన్నారు. సరిగ్గా మనం స్వాతంత్ర్యం సంపాదించిన ఈ సమయంలో నా మీద ఈ నేరం ఆరోపించడంలో కొంచెం అనౌచిత్యం ఉందని నా కనిపిస్తోంది" అని ఎ కె గోపాలన్ అన్నాడు.

ఈ కేసులో ప్రభుత్వం తరఫున కాంగ్రెస్ నాయకుడు, న్యాయవాది కె పి రామున్ని మీనన్ వాదించాడు. మొత్తానికి ఆ కేసు నుంచి ఆయనను 1947 అక్టోబర్ 12న విడుదల చేశారు. కాని రెండు నెలలు తిరగకుండానే డిసెంబర్ 17న ఆయనను మళ్లీ అరెస్టు చేశారు. ఈసారి మరొక చట్టం సాయంతో ఆయనను అరెస్టు చేశారు. ఆ చట్టం పేరు ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం. ఆయనను ఈసారి ఒక జైలు నుంచి మరొక జైలుకు మారుస్తూపోయారు. మన రాజ్యాంగం 1950 జనవరి 26న అమలులోకి వచ్చింది. ఎ కె గోపాలన్ మాత్రం జైలులోనే ఉండిపోయాడు. రాజ్యాంగం ఇచ్చిన అధికారాలతో స్వతంత్రభారత ప్రభుత్వం 1950 ఫిబ్రవరి 26న ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టాన్ని పకడ్బందీగా తీసుకు వచ్చింది. ఎ కె గోపాలన్‌ను ఇప్పుడు ఈ కొత్త చట్టం కింద నిర్బంధించారు.

నిర్బంధపూరిత పాలనా యంత్రాంగం వలసవాదుల

---

మొత్తంగా చెప్పాలంటే కె జి కన్నబిరాన్ (1929 - 2010) జీవితమే ఒక నమూనా, ఒక ఆదర్శం, ఒక పాఠం. నిరాడంబరత్వం, ఎన్ని కష్టాలు ఎదురయినా నమ్మిన విలువల కోసం కట్టుబడి ఉండడం, దౌర్జన్యాన్ని, అధికారాన్ని సాహసికంగా ప్రతిఘటించడం, చేయదలచుకున్న పని అత్యంత సమర్థంగా, నైపుణ్యంతో చేయడం - ఆయన నుంచి ఎవరయినా నేర్చుకోవసిన పాఠాలు. ముఖ్యంగా ఈ దేశంలో అసంఖ్యాక పీడిత ప్రజానీకం అనుభవిస్తున్న దుర్భర దోపిడీ పీడనలు రద్దు కావాలని కోరుకునే వారందరూ కన్నబిరాన్ జీవితాదర్శాన్ని, జీవితాచరణను అధ్యయనం చేయాలి, అనుసరించాలి.

*(రచయిత వీక్షణం సంపాదకులు)*

సంప్రదాయాలను యథాతథంగా కొనసాగించడం మొదలుపెట్టింది. న్యాయస్థానాలు కూడా ఆ వలసవాద సంప్రదాయాన్నే కొనసాగించాయి. రాజ్యాంగం ఏర్పాటు చేసిన పాలనా వ్యవస్థలపై రాజ్యాంగ ప్రభావం ఏమిటో అర్థం చేసుకోవాలంటే 1947 ఆగస్టు 15 తర్వాత కూడా ఎ కె గోపాలన్ జైలులో ఉండవలసి వచ్చిందంటే వాస్తవాన్ని గమనంలో ఉంచుకోవాలి. భారత స్వాతంత్ర్యోద్యమాన్ని అణచడానికి, చేసిన చట్టాలతో సహా బ్రిటిష్ ఇండియాలోని అన్ని చట్టాలూ స్వతంత్ర భారతదేశంలో యథాతథంగా అమలయ్యే చట్టాలయిపోయాయి. అందువల్ల సహజంగానే వలస వాద చట్ట, న్యాయ వ్యవస్థ స్వతంత్ర భారత చట్ట, న్యాయ వ్యవస్థ అయిపోయింది.

రాజ్యాంగంలోని ఉపోద్ఘాతంలో రాసిన ఆదర్శాలను వాస్తవీకరించేందుకు అవసరమైన చట్ట, న్యాయ వ్యవస్థను రూపొందించాలనే ప్రయత్నమే జరగలేదు. బహుశా అటువంటి న్యాయ వ్యవస్థను తయారు చేసి ఉన్నట్లయితే, ప్రభుత్వం తన మౌలిక కర్తవ్యాలను నెరవేర్చేలా న్యాయస్థానాలయినా ప్రయత్నించి ఉండేవి. అటువంటి పని, న్యాయస్థానాలు కల్పించుకుని ప్రభుత్వాల కర్తవ్యాలను గుర్తు చేసే పని 1970లలో జరిగిందిగాని అప్పుడు కూడా ఎక్కువగా జరిగినది వాగాడంబరమే తప్ప నిజమైన న్యాయవ్యవస్థ నిర్మాణం కాదు.

అసలు మొత్తం సుప్రీంకోర్టు చరిత్రలోనే, దేశ పాలనా వ్యవస్థలో మార్పు తేవడం రాజ్యాంగ లక్ష్యమనే వాస్తవాన్ని గుర్తించిన న్యాయమూర్తి ఒకే ఒక్కరున్నారు. రాజ్యాంగం ప్రజలకు ఏమి చేస్తుందో, అందువల్ల అది రాజ్యాంగ, పాలనా వ్యవస్థలకు ఏమి చేయాలో, రాజ్యాంగంలోని ప్రవేశికలో చెప్పిన లక్ష్యాలను ఏ విధంగా అమలులోకి తేవాలో గుర్తించిన ఆ న్యాయమూర్తి జస్టిస్ వివిఎన్ బోస్. ఎస్ కృష్ణన్ వర్సస్ స్టేట్ మద్రాస్ అనే కేసులో ప్రివెంటివ్ డిటెన్షన్ గురించి ఆయన చెప్పిన మాటలు తప్పనిసరిగా గమనించవలసినవి.

"భారత ప్రజలు తమకు తాము స్వతంత్ర జీవన విధానాన్ని ఎంచుకున్నారు. తమ అభిప్రాయాలకు ప్రాతినిధ్యం వహించే పార్లమెంటుకు వారు ఆ జీవన విధానానికి హామీ పడే బాధ్యతను అప్పజెప్పారు. ప్రజలు తమకు తాము ఇచ్చుకున్న స్వేచ్ఛలపైన ఏవయినా పరిమితులు విధించవలసి వస్తే, పార్లమెంటు అతిజాగ్రత్తగా ఆ పరిమితులను నిర్ణయించాలని వారు భావించారు. రాజ్యాంగంలో పొందుపరచిన స్వేచ్ఛలు, హక్కులు ఊహాజనితమైనవని, అర్థరహితమైనవని రాజ్యాంగ నిర్మాతలు భావించి ఉంటారనుకోను. ఆ హక్కులను ఎవరో ఒక వ్యక్తి ఆటబొమ్మలాగ వాడుకుంటారని కూడా వాళ్లు ఊహించి ఉండరు. మన రాజ్యాంగ నిర్మాతలు భారత ప్రజలపైన ఒక నిర్దాక్షిణ్యమైన, నిర్జీవమైన, జడమైన, ఎటుపడితే అటువంచగల ముద్దను రుద్దారని నేననుకోవడంలేదు. వారు ఒక సజీవ రాజ్యాంగాన్ని సృష్టించారు. దానిలో ప్రాణం నింపారు. దానికి ఒక లక్ష్యాన్ని, శక్తిని కల్పించారు. అది స్వతంత్ర పద్ధతిలో అంటే ప్రజాస్వామిక జీవన విధానంలో ఆరోగ్యవంతంగా, దృఢంగా ఎదగాలని వారు సంకల్పించారు.

యుద్ధమో, అత్యవసర పరిస్థితితో వచ్చినప్పుడు తయారయ్యే శాసనాలలో ఆ హడావుడివల్ల భాష, వ్యక్తీకరణలు సక్రమంగా ఉండవని వచ్చే వాదనలు ఈ సందర్భంలో వర్తిస్తాయని నేను అంగీకరించదలచుకోలేదు. నేను ప్రస్తుతం మాట్లాడుతున్నది రాజ్యాంగం గురించి. అది చాలా గంభీరమైన, ఉద్దేశ్యపూర్వకమైన, జాగరూకమైన చర్చ ద్వారా ఆమోదం పొందింది. అందువల్ల ఎప్పుడైనా అస్పష్టతగాని సందేహంగాని ఉంటే, సర్వసత్తాక ప్రజాస్వామిక గణతంత్ర రాజ్యపు స్వతంత్ర జీవన విధానానికి అనుకూలమైన నిర్ణయం తీసుకోవాలని నేననుకుంటాను. అసలు విషయానికొస్తే ఈ రాజ్యాంగాన్ని రచించినవారెవరు? ఎవరి ప్రయోజనాల కోసం ఈ రాజ్యాంగం రూపకల్పన జరిగింది? ఏదో కొద్ది కాలం అధికారంలో ఉండే వారి కొరకు కాదు. న్యాయవాదుల కోసమో, తార్కికుల కోసమో కాదు. రాజ్యాంగం తయారయినది భారతదేశంలోని సాధారణ ప్రజల కొరకు. అందువల్ల ఆ అధికరణాల భాష గురించి శషభిషలకు పోకుండా దాన్ని చాలా మామూలుగా సూటిగా వ్యాఖ్యానించవలసి ఉంటుంది. అంటే వీథుల్లో తిరుగాడే మనిషికి అర్థమయ్యేలా దాన్ని వ్యాఖ్యానించవలసి ఉంటుంది. ఆ రకంగా సాధారణ ప్రజానీకం రాజ్యాంగపు భావాన్ని అర్థం చేసుకోగలరు, దాన్ని పాటించగలరు" అని వివిఎన్ బోస్ అన్నాడు.

నిజానికి మన న్యాయ వ్యవస్థ తన ఆలోచనలను రాజ్యాంగం దగ్గర ప్రారంభించాలని అనుకోవడంలేదు. స్వాతంత్ర్యం తర్వాత, రాజ్యాంగం ఉనికిలోకి వచ్చిన తర్వాత కూడా ఎ కె గోపాలన్ నిర్బంధంలోనే ఉండడం, ఆయన హెబియస్ కార్పస్ రిట్ దరఖాస్తుపై తీర్పు అన్నీ కూడా బ్రిటిష్ వలసవాద సంప్రదాయానికి కొనసాగింపే. ఆ మధ్యలో రాజ్యాంగం అమలులోకి వచ్చిందని, అందువల్ల అసలు న్యాయ వ్యవస్థ పని తీరులోనే తేడా రావలసి ఉంటుందని న్యాయమూర్తులు గుర్తించనే లేదనడానికి ఆయన కేసులో న్యాయమూర్తుల తీర్పులే నిదర్శనం.

ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం, 1950 రాజ్యాంగంలోని 19, 21 అధికరణాలను భంగపరుస్తున్నదని, అందువల్ల దాన్ని రాజ్యాంగంలోని అధికరణం 13(2) కింద కొట్టివేయవచ్చునని, ఆ చట్ట నిబంధనలు అధికరణం 22 స్ఫూర్తికి వ్యతిరేకమని అనేక వాదనలు వచ్చాయి. అసలు ఆ నిర్బంధ ఉత్తర్వులను అధికార దుర్వినియోగం గుర్తించాలని కూడా వాదనలు జరిగాయి.

అసలు ఈ ముందస్తు నిర్బంధం అనేది ఇంగ్లండులో మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో అమలులోకి వచ్చిందని, అది కేవలం యుద్ధ పరిస్థితులవల్ల వచ్చిన చట్టమని కనుక యుద్ధం తర్వాత అది చెల్లనేరదని జస్టిస్ మహాజన్ అభిప్రాయపడ్డారు. భారతదేశంలోనైతే ఈ ముందస్తు నిర్బంధానికి తగిన మూలాలు లేవని ఆయన అన్నాడు. కాని వాస్తవాలు మరొకరకంగా ఉన్నాయి. కారణాలు చూపకుండా మనిషిని నిర్బంధంలో ఉంచడమనే బ్రిటిష్ కాలపు పాలనా పద్ధతి పందొమ్మిదో శతాబ్దపు తొలి రోజుల నుంచీ అమలులో ఉంది. 1818లో అమలులోకి వచ్చిన బెంగాల్ రెగ్యులేషన్, బొంబాయి, మద్రాసు ప్రెసిడెన్సీలలో వచ్చిన అదే మాదిరి చట్టాలు ఏ వ్యక్తినైనా కారణం చూపకుండా, ముందస్తుగా నిర్బంధించే అధికారాన్ని ప్రభుత్వానికి ఇచ్చాయి. రౌలట్ చట్టంలో భాగమైన 1919 అరాచక, విప్లవ నేరాల చట్టం అనేది ఆ దిశలో మరొక అడుగు. ఇవన్నీ వ్యక్తిగత స్వేచ్ఛ మీద నిర్ణయాత్మకమైన దాడులు.

ఆ తర్వాత రౌలట్ కమిటీ నివేదిక ఆధారంగా మూడు బిల్లులను ప్రవేశపెట్టడం జరిగింది. అవి, ఒకటి పత్రికలను అదుపులో పెట్టడానికి ఉద్దేశించినది, రెండవది, రాజకీయ నేరస్తులను న్యాయపీఠం లేకుండానే విచారించడానికి వీలు కల్పించేది, మూడవది తిరుగుబాటు లక్ష్యాలు కలిగి ఉన్నారనే అనుమానం ఉన్న వారికి దేశాంతరవాస, బహిష్కార శిక్షలు విధించడానికి వీలు కల్పించేది. చివరికి 1935 భారత ప్రభుత్వ చట్టం వచ్చే నాటికి, ప్రివెంటివ్ డిటెక్షన్ అనేది శాంతి సమయంలో కూడా ఉపయోగపడే ఆధునిక శాసనం అయిపోయింది. న్యాయశాస్త్ర ప్రపంచంలో, ముందస్తు శిక్షకూ, విచారణ తరువాత శిక్షకూ మధ్య తేడా చెరిగిపోయేంతగా మెరుగుపెట్టడం జరిగింది. ఆ రెండు పదాల ఏకైక లక్ష్యం ఒక సమాజాభివృద్ధికీ, ప్రజల అభివృద్ధికీ అత్యవసరమైన స్వేచ్ఛ మీద ఆంక్షలు విధించడమే అయిపోయింది.

1784 ఈస్టిండియా కంపెనీ చట్టం నాటి నుంచీ కూడా బ్రిటిష్ పాలకులు నేరశిక్షాస్మృతి, చట్టం అనే వాటిని భారత ప్రజానీకాన్ని అదుపులో ఉంచే, అణచి ఉంచే సాధనాలుగానే భావించారు. భారత ప్రజానీకంలో బ్రిటిష్ పాలనపై అసంతృప్తి, ప్రతిఘటన పెరిగినకొద్దీ కొత్త కొత్త చట్టాలు రావడం మొదలైంది.

మన రాజ్యాంగ రూపకల్పనకు కూచున్నప్పుడు మన రాజ్యాంగంలోని మాటలను మన పోరాటాలు నిర్వహించే బదులు, మనం కూడా పాత బ్రిటిష్ వలసవాద నిర్బంధపూరిత పాలనా, న్యాయ వ్యవస్థలను ఔదల దాల్చడానికే ఉత్సాహం చూపించాము. ఒక కార్యనిర్వాహక వర్గానికి దాని పుట్టుక ఇంగ్లిషుదా, భారతీయమైనదా అనే దానితో నిమిత్తంలేదు. దాని స్వభావం ఆ కారణంవల్ల మారిపోదు. దాని పని తీరును నిర్ణయించే మార్గదర్శక సూత్రాలే దాని స్వభావాన్ని నిర్ణయిస్తాయి. ప్రజలు నడిపిన పోరాటాల ఆదర్శాలన్నిటినీ ఆ మార్గదర్శక సూత్రాలలోకి రచించవలసి ఉంటుంది.

ప్రాథమిక హక్కులు, ప్రివెంటివ్ డిటెన్షన్ అనే అంశాల మీద మన రాజ్యాంగ నిర్ణయసభ చర్చలను ఒక్కసారి పరిశీలిస్తే, భారతదేశంలోని వేర్వేరు ప్రాంతాలలో జరిగిన ఘటనల వల్ల, అత్యవసర పరిస్థితులలో, రాజ్యభద్రత ప్రమాదంలో పడిన సందర్భాలలో ప్రజల హక్కులపై తీవ్రమైన ఆంక్షలు విధించాలని అనిపిస్తున్నదని ఆ సభలో నామినేటెడ్ సభ్యుడైన అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ అన్నాడు. వర్గ ద్వేషాన్ని రెచ్చగొట్టేట్టయితే భావ ప్రకటనా స్వేచ్ఛపై కూడా పరిమితులు విధించాలని ఆయన అన్నాడు.

రాజ్యాంగ ముసాయిదాలో ప్రాథమిక హక్కుల అధ్యాయం చర్చించేటప్పుడు రాజ్యాంగ నిర్ణయసభ సభ్యులు అమెరికన్ రాజ్యాంగం నుంచి "చట్ట విహిత క్రమం" అనే మాట సాయం తీసుకున్నారు. ఒక వ్యక్తి జీవితానికిగాని, స్వేచ్ఛకు గాని భంగం కలిగించేటప్పుడు చట్ట విహిత క్రమంలో తప్ప మరొక రకంగా ఆ పని జరగకూడదని వారు అన్నారు. స్వాతంత్ర్యోద్యమ క్రమంలో బ్రిటిష్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన అనేక నిర్బంధ చట్టాల గురించి అవగాహన ఉన్న సభ్యులు ఆ సభలో చాలా మంది ఉన్నారు. గనుక వారి వ్యక్తిగత స్వేచ్ఛ మళ్లీ అటువంటి దాడులకు బలికావద్దని కోరుకున్నారు. సభలో అత్యధిక సభ్యులు ఈ "చట్ట విహిత క్రమం" అనే నిబంధనను చేర్చాలని పట్టుబట్టారు. కె ఎం మున్షీ కూడా ఈ నిబంధన ఉండాలని వాదించారు.

అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ ఒక్కరు మాత్రం "చట్టం నిర్దేశించిన పద్ధతి" అనే వ్యక్తీకరణ ఉండాలని వాదించారు. "చట్ట విహితక్రమం" అనేమాటను స్వార్థపరశక్తులు తమకు అనువుగా వ్యాఖ్యానించవచ్చునని, తమ ప్రయోజనాలు కాపాడుకోవడానికి వాడుకోవచ్చునని ఆయన తన అనుమానాన్ని వ్యక్తం చేశారు. మొత్తానికి జరిగింది అదేననేది వేరే విషయం. అమెరికాలో ఆ మాటను న్యాయవాదులు ఎన్నెన్ని వైపుల వక్రీకరించి ఉపయోగించారో, అది ఎన్ని రకాల వ్యాఖ్యానాలకు దారి తీసిందో వివరించడానికి ఆయన చాలా ప్రయత్నించారు. "భారత సుప్రీంకోర్టు న్యాయమూర్తులు అమెరికన్ న్యాయవ్యవస్థలో జరిగినట్టు కాకుండా, మరీ ముఖ్యంగా తొలిదశలో, భారత పరిస్థితులకు తగినట్టుగా, దేశపు ప్రగతికీ, సౌభాగ్యానికీ తగినట్టుగా వ్యాఖ్యానించగలిగితే ఈ మాట తగినంత సంతృప్తికరంగానే ఉంటుంది" అని ఆయన భావించారు.

అంటే స్వతంత్ర భారత న్యాయవ్యవస్థ అనేది ఒకటి ఆవిర్భవించాలని, ఆవిర్భవించబోతున్నదని ఆయన కోరుకున్నారన్న మాట. ఈ సమస్యను చర్చించేటప్పుడు రాజ్యాంగ నిర్ణయసభ భారత దేశపు భవిష్యత్ ప్రగతిని దృష్టిలో పెట్టుకోవాలని ఆయన అన్నారు. "ఒక నిర్ణయానికి వచ్చే ముందు రాజ్యపు సౌభాగ్యాన్నీ, సుస్థిరతనూ, కనీస స్వేచ్ఛను కాపాడవలసిన అవసరాన్ని, సామాజిక నియంత్రణనూ, వ్యక్తిగత స్వేచ్ఛనూ సమన్వయం చేయవలసిన అవసరాన్ని" దృష్టిలో పెట్టుకోవాలని ఆయన అన్నారు. చట్టవిహితక్రమం అంటే ఏమిటో ముగ్గురో ఐదుగురో నిర్ణయించడం కన్నా, ప్రజా ప్రతినిధులు లేదా అటువంటి ప్రజాప్రతినిధులకు బాధ్యత వహించే కార్యనిర్వాహక వర్గం అభిప్రాయాల ద్వారా నిర్ణయించడం ఎక్కువ ప్రజాస్వామికమని ఆయన అన్నారు.

అయితే ఈ వ్యవస్థలు, యంత్రాంగాలు ఎట్లా పని చేస్తాయోనన్న విషయమై ఇదంతా ఎక్కువగా సైద్ధాంతిక అభిప్రాయమే తప్ప ఆచరణాత్మకమైన వ్యక్తీకరణ కాదు. సరిగ్గా ఈ చర్చ సాగుతున్నప్పుడే, యూరప్‌లో నాజీ, ఫాసిస్టు శక్తులు పెద్ద ఎత్తున మూకుమ్మడిగా, ప్రజాస్వామిక వ్యవస్థల పని తీరును ఎంతగా వక్రీకరించగలవో మనం ప్రత్యక్షంగా చూశాం. అందువల్లనే, "చట్టవిహిత క్రమం" అనాలా అని వాదనలు జరుగుతున్నప్పుడు ఆ చర్చ జరుపుతున్న వారందరి మనసులలోనూ ఒక ఆందోళన ఉండింది. యూరప్‌లో అప్పుడప్పుడే జరిగిన సంఘటనలు వారి మనసులలో తాజాగా ఉన్నాయి. మన జాతీయ విముక్తి కొరకు జరిగిన పోరాటాన్ని అణచి వేయడానికి బ్రిటిష్ పాలకులు అమలు చేసిన దమన నీతి కూడా వారికి ఇంకా గుర్తుంది.

నిజానికి రాజ్యాంగ నిర్ణయసభలో ఒక హక్కుల పత్రం వెలువరించాలనే ఆకాంక్ష చాలా బలంగా ముందుకు వచ్చింది. హెబియస్ కార్పస్ రిట్ ద్వారా న్యాయ స్థానాన్ని ఆశ్రయించే హక్కు పౌరులకు కల్పించాలని, అటువంటి హక్కును అటు కార్యనిర్వాహక వర్గానికి గాని, ఇటు శాసనాధికార వ్యవస్థకుగాని ఇవ్వగూడదని కూడా అభిప్రాయాలు వచ్చాయి.

అధికారంలో ఉన్న రాజకీయ పార్టీ చట్టసభలను పూర్తిగా తన మనుషులతో, తన సమర్థకులతో నింపవచ్చుగదా, తన ఇష్టం వచ్చిన చట్టాలు చేయవచ్చుగదా అనే ప్రశ్న కూడా ఆ చర్చల క్రమంలో వచ్చింది. అటువంటి అవకాశం ఉండవచ్చునని అంబేద్కర్ కూడా అంగీకరించారు.

న్యాయమూర్తులు ముందే ఏర్పరచుకున్న దురభిప్రాయాలు, దురభిమానాలు లేకుండా ప్రవర్తిస్తారని తను అనుకోవడంలేదని కూడా అంబేద్కర్ అన్నారు. "ఇది ముందు నుయ్యి, వెనక గొయ్యి లాంటి పరిస్థితి అందువల్ల నేనేమీ చెప్పను" అని ఆయన అన్నారు.

రాజ్యాంగ నిర్ణయ సభలో చాలా మంది అధికరణం 15 ముసాయిదా (ప్రస్తుత రాజ్యాంగంలోని అధికరణం 21) పార్లమెంటుకు నిరంకుశంగా మనిషిని నిర్బంధంలోకి తీసుకునే అధికారం ఇస్తున్నదని, అందువల్ల ఆ పద్ధతి ఏమిటో నిర్దేశించే మరొక శాసనం కావాలని కోరుకున్నారు. అందువల్లనే ఆ ముసాయిదా అధికరణం 15కు ఎ అనే అదనపు నిబంధన (ప్రస్తుత రాజ్యాంగంలోని అధికరణం 22) చేర్చవలసి వచ్చింది.

ఒక రాజ్యాంగ పత్రంలో ముందస్తు నిర్బంధం గురించిన నిబంధనను ప్రవేశపెట్టడం గురించి అప్పుడే చాలా విమర్శలు వచ్చాయి. బక్షీ టేక్ చంద్ ఈ అధికరణాన్ని అత్యంత అభివృద్ధి నిరోధకమైనదిగా అభివర్ణించారు. నిర్ణీత సాధారణ వ్యవధిలోపల విచారణ జరపకుండా వ్యక్తులను నిర్బంధంలో ఉంచే నిబంధనలను తనలో ఇముడ్చుకున్న లిఖిత రాజ్యాంగం ప్రపంచం మొత్తంలో ఇది ఒక్కటేననీ అందువల్ల ఇది ప్రతీఘాతుకమైనదని ఆయన విమర్శించారు. ఈ నిబంధనను ఆమోదించడమంటే ప్రాథమిక హక్కుల మీద ఉన్న అధ్యాయాన్ని ఒక శిక్షాస్మృతిగా మార్చినట్టే అవుతుందని, అటువంటప్పుడు అది పాత బ్రిటిష్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన డిఫెన్స్ ఆఫ్ ఇండియా రూల్స్ కన్నా ఘోరమైన పని అవుతుందని మహావీర్ త్యాగి అన్నారు. రాజ్యాంగ నిర్ణయసభ సమావేశమైనది ప్రజలకు హక్కులను హామీ ఇవ్వడానికే తప్ప. ప్రజలనుంచి వారి హక్కులను లాగి వేయడానికి కాదని ఆయన అన్నారు.

ఈ రెండు నిబంధనలు వ్యక్తిగత స్వేచ్ఛ మీద గుదిబండలుగా మారిపోయాయి. రాజ్యాంగం అమలులోకి వచ్చిన ఈ యాభై ఏడు సంవత్సరాలుగా మోసుకుంటూ, లాక్కుంటూ రావలసి వస్తోంది. అంబేద్కర్ అనుమానించినట్టుగానే చట్టసభలలో అధికారపార్టీ సమర్థకులు నిండిపోయి శాంతి సమయంలో కూడా ఒక ముందస్తు నిర్బంధ (ప్రివెంటివ్ డిటెన్షన్) చట్టాన్ని ఆమోదింపజేశారు. ఆ చట్టాన్ని వ్యాఖ్యానించే సమయంలో న్యాయస్థానం కూడా రాజ్యాంగ నిర్మాణానికి ఉన్న చరిత్రను విస్మరించింది. రాజ్యాంగాన్ని కేవలం ఒక రాజకీయ పత్రంగా పరిగణించింది. రాజ్యాంగంలోని పదాల అర్థాన్ని వివరించడం మొదలు పెట్టింది.

అందువల్లనే స్వతంత్ర భారతంలో మొదటి ప్రధానకేసు అయిన, 1950లో వచ్చిన ఎ కె గోపాలన్ కేసులో వ్యక్తిగత స్వేచ్ఛ సారాంశం గురించి, వ్యక్తిగత స్వేచ్ఛ అనే వ్యక్తీకరణకు ఏ అర్థం చెప్పాలనే దాని గురించి చర్చ జరగలేదు. మొత్తంగా వ్యక్తిగత స్వేచ్ఛను దాని మీద విధించే ఆంక్షల, పరిమితుల దృష్టి నుంచే నిర్వచించే ప్రయత్నం జరిగింది.

ఎ కె గోపాలన్ కేసులో 1950 ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం రాజ్యాంగబద్ధత గురించి పరిశీలన జరిగినప్పుడు చర్చ జరిగినదీ, బహుశా అప్పటికి పరిష్కృతమైనదీ ఏమంటే ఒక మనిషికి ఉండే ప్రయాణ స్వేచ్ఛ, ఇష్టం వచ్చిన చోటికి వెళ్లగలిగే స్వేచ్ఛ మీద పరిమితులు విధించవచ్చునా లేదా అనేది మాత్రమే. కాని నిజంగా చర్చించి ఉండవలసినది ఏమంటే, స్వాతంత్ర్యోద్యమానికీ వ్యక్తిగత స్వేచ్ఛకూ మధ్య ఉన్న సంబంధం ఏమిటనేది.

స్వాతంత్ర్యసాధన రాజ్యాంగం గురించిన మన దూరదృష్టినీ, అవగాహననూ మసకబార్చింది. అప్పుడప్పుడే పుట్టిన భారత రాజ్యం ఒక వికలాంగ శిశువుగా జన్మించింది. రాజ్యాంగంలోని ప్రవేశికలో స్పష్టమైన వ్యక్తీకరణ పొంది రాజకీయ స్వాతంత్ర్యం ద్వారా మనం సాధించలేకపోయినవేవో మన రాజ్యాంగ ఆదర్శాలుగా రాసుకున్నాం.

అవి సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయం, మానవ గౌరవం, సౌభ్రాతృత్వం. అస్పృశ్యతను, బాల కార్మిక వ్యవస్థను, వెట్టిచాకిరిని రద్దు చేసిన, శిక్షార్హమైన నేరంగా పరిగణించిన ప్రాథమిక హక్కుల అధ్యాయం. మన రాజ్యాంగం అధికరణం 15 కింద బహిరంగ బావులలో, చెరువులలో, భోజనశాలలో, బహిరంగ ప్రదేశాలలో వెలి, అటువంటి అసమానతలను పాటించడాన్ని నిషేధించింది. అత్యల్ప సంఖ్యాక వర్గాలకు తమ జీవితంలోని అన్ని అంశాలలో అవసరమైన హక్కులు కల్పించింది. ఒక సమసమాజాన్ని నెలకొల్పే బాధ్యతను ప్రభుత్వం మీద పెట్టి ఒక మౌలిక లక్ష్యాన్ని కల్పించింది.

ఇదంతా రాజకీయ సమాజానికీ పౌర సమాజానికీ మధ్య ఉన్న అఖాతాన్ని పూడ్చివేసే ఒక బృహత్తర ప్రయత్నం. రాజకీయ సమాజమైన రాజ్యానికీ పౌర సమాజానికీ ఈ ఐక్యతను సాధించే ప్రయత్నాన్ని రాజ్యాంగం నిర్దేశించాలనీ, ఆ రాజ్యాంగ కర్తవ్యాలను రాజ్యం పాటించాలనీ నిర్ణయించడం జరిగింది. రాజ్యాంగం మొత్తంలో రాజ్యాన్ని ఎక్కడా దాని హక్కులు, అధికారాల ద్వారా నిర్వచించడం జరగలేదు. కేవలం దాని పరిమితుల ద్వారా నిర్వచించడం జరిగింది. ఈ పరిమితుల లోపల పని చేయవలసిన రాజ్యంలో చట్టసభలు కూడా భాగమే.

ఒక రాజకీయ సమాజంలో నివసించే మనిషి తనను తాను సామూహిక మానవునిగా భావించుకుంటాడు. కాని సొంత వ్యక్తిత్వంతో ఒంటరి మనిషిగా క్రియాశీలంగా జీవించే పౌర సమాజంలో మనిషి ఇతర మనుషులందరినీ అమానవీయంగా సాధనాలుగా భావిస్తాడు. తనను తాను కూడా ఒక సాధనంగా భావించుకుంటాడు. అతీత శక్తులచేతిలో ఆటబొమ్మగా మారిపోతాడు అని మార్క్స్ ఆన్ ది జ్యూయిష్ క్వశ్చన్ అనే వ్యాసంలో రాశాడు.

ఈ రకమైన అమానవీయతను మార్చడానికే మన ఆదేశిక సూత్రాలు, ప్రాథమిక హక్కులు ఉద్దేశించబడ్డాయి. రాజ్యాంగంలో ఈ నిబంధనలు ఉన్నాయంటే అర్థమేమంటే, ప్రజలు తమ ఏ అధికారాలను రాజ్యాంగం సృష్టించిన వ్యవస్థలకు అప్పగించారో అధికారాలన్నిటినీ వెనక్కి తీసుకునే అధికారం కూడా వారికి ఉంది అని.

రాజ్యాంగంలో అంత స్పష్టంగా ప్రకటితమైన మహత్తర కర్తవ్యంపట్ల న్యాయస్థానాలు అవగాహనను కలిగి ఉండవలసింది. దానికి బదులుగా న్యాయస్థానాలు రాజ్యాంగాన్ని ప్రజలకు వ్యతిరేకంగా నిలబడిన అధికారానికి అనువుగా వ్యాఖ్యానించడం అనే వలసవాద సంప్రదాయానికి కట్టుబడి పోయాయి. అదీ అసలు సమస్య.

*(కె.జి. కన్నబిరాన్ ఆత్మకథాత్మక సామాజిక చిత్రం '24 గంటలు' పుస్తకం నుంచి)*

**మార్కండేయ కట్జూ, జ్ఞాన సుధా మిశ్రాలతో కూడిన సుప్రీంకోర్టు ధర్మాసనం జనవరి 5న భిల్ తెగకు చెందిన నందాబాయిపై జరిగిన అత్యాచారం కేసులో ఇచ్చిన చరిత్రాత్మకమైన, ఆసక్తికరమైన తీర్పు**

# నిజానికి ఈ దేశం ఆదివాసులదే

మహారాష్ట్రలోని 'భిల్' తెగకు చెందిన ఇరవై ఐదు సంవత్సరాల నందాబాయిపై ఆ గ్రామంలోని అగ్రకులస్తులు దాడిచేసి, కొట్టి, ఆమెను వివస్త్రను చేసి ఊరేగించారు. ఆ కేసులో మహారాష్ట్ర హైకోర్టు ఇచ్చిన తీర్పును రద్దు చేస్తూ ఆదివాసులపై దేశంలో అమలవుతున్న అణచివేతను ప్రస్తావిస్తూ సుప్రీంకోర్టు తీర్పునిచ్చింది. ఆ తీర్పులోని ముఖ్యమైన భాగాలు.

భిల్ తెగకు చెందిన ప్రజలు, వాళ్ల వద్ద ధరించడానికి దుస్తులు లేని కారణంగా ఎప్పుడూ చిరిగిన బట్టలు వేసుకుంటారని, నిందితులు అభియోగిస్తున్నారు. ఆదివాసులను మనుష్యులకంటే హీనంగా చూస్తున్న వాళ్ల దృష్టికి ఇది అద్దం పడుతుంది. ఇది ఆధునిక భారతదేశంలో ఏ మాత్రం అంగీకరించడానికి అవకాశం లేని దృష్టికోణం. భిల్లులు బహుశా ఈ దేశంలోని వివిధ ప్రాంతాలలో, నిర్దిష్టంగా దక్షిణ రాజస్థాన్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్‌లలో నివసించిన మూలవాసుల వారసులై ఉంటారు. వాళ్లందరూ ఆదివాసీ ప్రజలు. ఇతర ప్రజా సమూహాల అత్యాచారాలను, అణచివేతలను ఎదుర్కొంటూ కూడా వాళ్లు తమ తెగ సాంప్రదాయాలలో చాలా వాటిని కాపాడుకోగలిగారు.

'భారతదేశంలో మైనారిటీలు, మూలవాసీ ప్రజలు, ప్రజలకు సంబంధించిన ప్రపంచ డైరెక్టరీ'లో 17వ శతాబ్దంలో మహారాష్ట్రలో భిల్లులపై నిర్దాక్షిణ్యమైన ఊచకోత జరిగిందని పేర్కొన్నారు. భిల్ తెగకు చెందిన నేరస్తులు పట్టుబడితే అక్కడికక్కడే చంపేసేవారు. యావత్తు భిల్ సమూహాలను హత్య చేసి నిర్మూలించడం జరిగిందని చరిత్ర చెప్తోంది. ఈ కారణంగా భిల్లులు దుర్గమ అరణ్యాలలోకి, కొండలలోకి వెళ్లిపోయారు.

ఇప్పుడు మనం షెడ్యూల్డ్ తెగలుగా పిలుచుకుంటున్న, భారతదేశ మూలవాసుల వారసులు భిల్లులు. ప్రస్తుతం దేశ జనాభాలో వీరు 8 శాతం ఉన్నారు. షెడ్యూల్డ్ తెగలు మినహా మిగిలిన 92 శాతం మంది భారతీయులు, ఇతర ప్రాంతాల నుంచి వలస వచ్చిన వారి వారసులు. ఉత్తర అమెరికా లాగ భారతదేశం కూడా వలస వచ్చిన ప్రజల దేశం.

అమెరికా, కెనడాలు గత నాలుగైదు దశాబ్దాలుగా వివిధ ఐరోపా దేశాల నుండి వలస వచ్చిన ప్రజలతో కూడిన దేశాలు. భారత దేశం గత పది వేల సంవత్సరాలుగా వలస వచ్చిన ప్రజలతో కూడిన దేశం. వీరిలో ఎక్కువ మంది వాయువ్య ప్రాంతం నుండి, కొంతమంది ఈశాన్య ప్రాంతం నుండి వలస వచ్చిన వాళ్లు. మన దేశాన్ని అర్థం చేసుకోవడంలో ఇది ముఖ్యమైన విషయం కాబట్టి ఈ అంశానికి మరింత వివరణ ఇస్తున్నాం.

ప్రజలు అసౌకర్యంగా ఉన్న ప్రాంతాల నుండి సౌకర్యంగా ఉన్న ప్రాంతాలకు వలసపోతారు. ఇది సహజం. ఆధునిక పరిశ్రమల ఆవిర్భావానికి పూర్వం, ప్రపంచమంతటా వ్యవసాయ సమాజాలు ఉండేవి. సమతల, సారవంతమైన భూమి, సేద్యానికి కావలసినంత నీరు ఉన్న ప్రాంతాలే వ్యవసాయానికి యోగ్యమైన ప్రాంతాలు. ఈ వనరులన్నీ భారతదేశంలో పుష్కలంగా ఉన్న కారణంగా ఇది వలస వచ్చే వారికి స్వర్గంగా ఉండేది. భారతదేశంలో నివసించే వాళ్లు అననుకూలమైన రాతి ప్రాంతాలు, కొండలతో కూడి సంవత్సరంలో ఎక్కువ భాగం మంచుతో కప్పబడి ఉండే అఫ్ఘనిస్తాన్ వంటి ప్రాంతాలకు ఎందుకు వలస వెళతారు? అందుచేత దాదాపుగా అన్ని వలసలు, దురాక్రమణలు బయటి నుండే భారతదేశంలోకి వచ్చాయి. (బ్రిటిష్ పాలకులు నిర్బంధ శ్రమ కూలీలుగా ఇతర ప్రాంతాలకు తరలించిన భారతీయులు, ఉద్యోగావకాశాల కోసం ఈ మధ్యకాలంలో అభివృద్ధి చెందిన దేశాలకు లక్షల సంఖ్యలో వలసపోతున్న వారు దీనికి మినహాయింపు.) భారత దేశం నుండి బయటి ప్రాంతంపై దురాక్రమణ జరిగిందనడానికి బహుశా ఒక్క ఉదాహరణ కూడా ఉండదు.

సమతలమైన, సారవంతమైన భూమి, వందలాది నదులు, అడవులతో కూడి, భాగ్యవంతమైన సహజ వనరులు కలిగిన భారతదేశం, పశు కాపర్లకు, వ్యవసాయ సమాజాలకు స్వర్గం వంటిది. ఈ దేశంలో సౌకర్యవంతమైన జీవితం లభిస్తుంది కాబట్టే ఈ దేశంలోకి వేల సంవత్సరాల నుండి ప్రజలు వలస వచ్చారు. ప్రఖ్యాత ఉర్దూ కవి, ఫిరాక్ గోరఖ్‌పురి ఇలా అన్నారు –

'సింధూ నది దేశంలోకి లోకం నలుమూలల నుంచి బిడారులు తరలివచ్చాయి. భారత దేశం తయారవుతూ వచ్చింది.'

భారతదేశం మూలవాసులెవరు? ద్రావిడులు అని ఒకప్పుడు నమ్మేవారు. అయితే ఈ మధ్యకాలంలో ఈ అభిప్రాయం చాలా వరకు మారింది. ద్రావిడ పూర్వ ఆదివాసీలే ఈ దేశపు మూలవాసులని అందరూ అంగీకరిస్తున్నారు. వారే ఇప్పటి గిరిజనులు, ఆదివాసీల పూర్వీకులు. 'కేంబ్రిడ్జ్ హిస్టరీ ఆఫ్ ఇండియా' వాల్యూం–1లో ప్రాచీన భారతదేశం గురించి ఇలా రాశారు. 'జాతుల శాస్త్ర పరంగా ద్రావిడ అనే పదాన్ని వాడారు అంటే, అది సౌకర్యం కోసం వాడిన పదం మాత్రమేనని, అంతకంటే విశేషం ఏమీ లేదని తప్పనిసరిగా గుర్తుంచుకోవాలి. ద్రావిడ భాషా ప్రజలు మూలవాసులని అనుకోరాదు. ఉత్తర భారతంలోవలె,

దక్షిణ భారతదేశంలో కూడా కొండలు, అడవులలో నివసించే ప్రాచీన తెగల ప్రజలకు, సారవంతమైన ప్రాంతాలలో నివసించే ప్రజలకు మధ్య వైవిధ్యం, భిన్నత్వం ఉంది. ఇది కేవలం సంస్కృతి ఫలితం కాదని, ఈ వైవిధ్యం జాతిపరమైనదనీ జాతుల శాస్త్రవేత్తల అభిప్రాయం. ఉదాహరణకు థర్‌స్టన్ ఇలా అంటున్నారు – 'ద్రావిడ పూర్వ ఆదివాసీలనే గాని, తదనంతర కాలానికి చెందిన నాగరికులైన ద్రావిడులను, అతి ప్రాచీన జాతిగా గుర్తించకూడదు. పొట్టిగా ఉండడం, వెడల్పు ముక్కులు కలిగి ఉండడం వంటి లక్షణాలు గల ద్రావిడ పూర్వులు, ద్రావిడులకు భిన్నమైన వారు. ఈ ద్రావిడ పూర్వులు, జాతిపరంగా, సిలోన్‌కు చెందిన వెద్దాలు, సెలెబస్‌కు చెందిన తాళాలు, సుమత్రాకు చెందిన బాతిన్లతో బంధుత్వం కలిగినవారై ఉంటారని నమ్మడానికి బలమైన ఆధారాలున్నాయి.' (ది మద్రాస్ ప్రెసిడెన్సీ, పుటలు 124, 125)

దీన్ని బట్టి ద్రావిడ భాషలను మాట్లాడే అసలు ప్రజలు, భారత దేశానికి బయటివారని చెప్పడానికి, ఇప్పుడు ద్రావిడులుగా పిలువ బడుతున్నవారు ఒక మిశ్రమ జాతి అని భావించడానికి అవకాశం ఉంది. నివాస యోగ్యమైన ప్రాంతాలలో, ఈ రెండు సమూహాలు మిశ్రమ మయ్యాయి. మూలవాసులు మాత్రం కొత్త వలసదారుల ఆక్రమణల పూర్వం వాళ్లు వెళ్లిపోయిన కొండలలోనే ఉంటున్నారు. ఈ మూల వాసులు సుదీర్ఘ కాలక్రమంలో, తమ ప్రాచీన భాషలను పోగొట్టుకొని, విజేతల భాషలను స్వీకరించారని భావించాలి. ఈ రకమైన భాషా పరిణామ క్రమాన్ని, భారతదేశంలోని ఇతర ప్రాంతాలలో ఇప్పటికీ గమనించవచ్చు. దక్షిణ భారత దేశంలో మాత్రం ఈ క్రమం దాదాపుగా పూర్తి అయిందనిపిస్తోంది.

'ముండా' భాషలు భారతదేశంలో ఉన్న 'ఆస్ట్రిక్' భాషా కుటుంబానికి చెందినవి. వీటికి సంబంధించి మన వద్ద ఉన్న సమాచారాన్ని బట్టి, ద్రావిడ భాషలు అతి పురాతనమైనవనే అభిప్రాయాన్ని మార్చుకోవాలి. ఇప్పుడున్న సమాచారాన్ని బట్టి ఆస్ట్రిక్ భాష అతి పురాతనమైనదని తెలుస్తోంది. కాలక్రమంలో ఒకవైపు ద్రావిడ, ఇండో–యూరోపియన్ భాషలు, మరోవైపు టిబెటన్, చైనీస్ భాషల దాడుల కారణంగా ఆస్ట్రిక్ భాష తన స్వరూపాన్ని కోల్పోయింది. ప్రస్తుతం ముండా భాషలను మాట్లాడే ప్రజలకు, ద్రావిడ భాషలు మాట్లాడే ప్రజలకు మధ్య శారీరక నిర్మాణంలో తేడా లేదని కొందరి అభిప్రాయం. దీన్ని ప్రశ్నించాలి. జాతుల మధ్య సంపర్కం కారణంగా ఇదంతా ఒక చిక్కుముడి లాగా తయారయ్యింది. తెగల విలక్షణత్వాన్ని కాపాడే ఒకే ఒక్క ఆధారంగా భాష మాత్రమే మిగిలింది.

వాయవ్య ప్రాంతం నుండి ఆక్రమణదారులైన ఆర్యులు, ఇండో–యూరోపియన్ భాషలను పరిచయం చేసే నాటికి ఉత్తర భారతదేశంలోని పశ్చిమ ప్రాంతాలలో ద్రావిడ భాషలు విరాజిల్లుతున్నాయని చెప్పడానికి సందేహించాల్సిన అవసరం లేదు. వేదకాలపు, వేద సాహిత్యంలోను, సాంప్రదాయిక సంస్కృతంలోను, ప్రాకృతంలోను, తొలినాటి ప్రాచుర్యం పొందిన మాండలికాలలోను, వీటన్నింటి నుండి రూపొందిన ఆధునిక భాషలలోను, ద్రావిడ భాషా లక్షణాలను చూడవచ్చును. అందుచేత, భాషాపరంగా చూస్తే చారిత్రక క్రమం ఇలా ఉంటుంది – ఆస్ట్రిక్ భాష – ద్రావిడ భాషలు, ఇండో – యూరోపియన్ భాషలు.

ఇండో – ఆర్యన్ భాషలు మాట్లాడే ప్రజలు, ఈ దేశంలోకి రావడానికి పూర్వం ఉత్తర భారతంలో, దక్షిణ భారతంలో కూడా ద్రావిడ భాషలే ప్రధాన స్థానంలో ఉన్నాయనడానికి ఆధారాలున్నాయి. అంత మాత్రాన, ద్రావిడులు ఈ దేశపు మూలవాసులు అనడానికి వీల్లేదు.

గూగుల్‌లో భారతదేశ మూలవాసులు అనే అంశం కింద ఇలా ఉంది. 'ద్రావిడులు ఒక విలక్షణమైన జాతి అని, క్రితం తరానికి చెందిన ఆంత్రపాలజిస్టులు అభిప్రాయపడ్డారు. అయితే, ఆధునిక కాలంలో జరిగిన సమగ్రమైన జెనెటిక్ అధ్యయనాలు అది సరికాదని నిరూపించాయి. 'ముండా' భాషలు మాట్లాడే ప్రజలను భారతదేశ మూలవాసులుగా గుర్తించవచ్చు. వీటికి ఇండో – ఆర్యన్, ద్రవిడ భాషలతో సంబంధం లేదు.'

వీటన్నింటిని బట్టి భారతదేశ మూలవాసులు ద్రావిడులు కాదని, ద్రావిడ పూర్వ 'ముండా' తెగలకు చెందిన వారని గుర్తించబడింది. ప్రస్తుతం జార్ఖండ్, ఛోటానాగపూర్, ఛత్తీస్‌ఘఢ్, ఒడిషా, పశ్చిమ బెంగాల్‌లలో, తమిళనాడులో, నీలగిరులలోని తోడాలు, అండమాన్ దీవులలోని ఆదివాసులు, దేశమంతటా, ముఖ్యంగా అటవీ, కొండ ప్రాంతాలలో నివసిస్తున్న గోండులు, సంతాలులు, భిల్లులు తదితర ఆదివాసులందరు ఈ ముండా తెగల వారసులు. ఇతర వివరాలలోకి వెళ్లాల్సిన అవసరం లేకుండానే ప్రస్తుత భారతదేశ జనాభాలో 92 శాతం మంది వలస వచ్చిన వారి వారసులని తెలుస్తోంది. ఈ దేశంలో ప్రజల మధ్య ఇంత విలక్షణత్వం ఉండడానికి ఇదే ప్రధాన కారణం. అనేకమైన మతాలు, కులాలు, భాషలు, జాతి సమూహాలు, సంస్కృతులు ఉండడానికి భారతదేశం వలస వచ్చినవారి దేశం కావడమే కారణం. శరీర ఆకృతిలో, రంగులో, ఆహార్యపు అలవాట్లలో భిన్నత్వానికి కూడా ఇదే కారణం.

ఇంతటి వైవిధ్యం ఈ దేశంలో ఉంది కాబట్టే, ఇది ఐక్యంగా ఉండాలంటే, అన్ని ప్రజాసమూహాలు, తెగల పట్ల సహనం, సమాన గౌరవభావం ఉండాలి. అందుకోసమే రాజ్యాంగ నిర్మాతలు లౌకిక స్వభావంతో కూడిన రాజ్యాంగాన్ని మనకు అందించారు. భారత రాజ్యాంగం అన్నిరకాల ప్రజాసమూహాలకు సమానమైన హక్కుల నిచ్చింది. అయితే చట్టపరంగా అన్ని సమూహాల మధ్య సమభావాన్ని ప్రదర్శించినంత మాత్రాన, అది ఆచరణలో నిజమైన సమానత్వానికి దారి తీస్తుందని భావించరాదు. చారిత్రకంగా నిర్లక్ష్యం చేయబడిన ప్రజాసమూహాలను పేదరికం నుండి, సామాజిక హీనస్థితి నుండి బయటకు తీసుకురావాలంటే వాటికి ప్రత్యేకమైన రక్షణలు కల్పించాలి. అందుకోసమే రాజ్యాంగంలో ఆర్టికల్ 15 (4), 15 (5), 16 (4), 16 (4ఎ), 4బి తదితర అధికరణాలున్నాయి. నిర్లక్ష్యం చేయబడిన సమూహాలలో, అత్యంత నిరాదరణకు గురియైన వారు ఆదివాసులు (ఎస్.టి.లు). ఇంతకు ముందే చెప్పినట్లు, వీళ్లు భారతదేశ మూలవాసుల వారసులు. వీళ్లు ఒక మూలకు నెట్టివేయబడ్డారు. భయంకరమైన దారిద్ర్యంలో నివసిస్తున్నారు. వేల సంవత్సరాలుగా భయంకరమైన అణచివేతకు, పీడనకు గురవుతున్న ఈ షెడ్యూల్డ్ తెగల ప్రజలకు, ఎలాంటి నష్టం జరగకుండా చూడడం, వాళ్ల ఆర్థిక, సాంఘిక స్థితిని, ఉన్నతీకరించడానికి అవసరమైన సహాయాన్ని చేయడం, ఈ దేశాన్ని ప్రేమించే వారందరి బాధ్యత. ఈ ఆదివాసుల పట్ల మన ప్రజల దృక్పథం

*ఒక సామాన్య పౌరుడు మహమ్మద్ బొవజిజి ఆత్మహననంతో టునీషియాలో బద్దలయిన ప్రజా ఆగ్రహం, తిరుగుబాటు కోరుతున్నవి ఏమిటో వివరిస్తున్నారు* **రాజవరం పార్థసారథి**

# టునీషియా ప్రజా విజయగాథ

**త**న శరీరం మీద తానే పెట్రోలు పోసుకుని తగులబెట్టుకుంటున్నప్పుడు ఆ ఇరవై ఆరేళ్ల యువకుడు ఏం ఆలోచించాడో తెలియదు. పద్దెనిమిది రోజుల పాటు మృత్యువుతో పోరాడుతూ ఆ గాయాల సలుపు తప్ప మరేదయినా అనుభవించాడో లేదో తెలియదు. కాని ఆ మృతదేహం మాత్రం అతని మాతృదేశాన్ని అల్లకల్లోలం చేసింది. ఆ శరీరపు మంటలు ఆ దేశపు యువతరాన్ని రగుల్కొలిపి వీథుల్లోకి లాక్కొచ్చాయి. ఆ యువకుడి మృతి ఎంత విషాదకరమైనదయినా, అది ప్రజాగ్రహాన్ని మేల్కొలిపింది. ప్రజల పేదరికం, యువతరం నిరుద్యోగం, నాయకుల అవినీతి, అధికారుల దుర్మార్గం కలగలిస్తే ఒక సమాజం ఎట్లా విస్ఫోటనం చెందగలదో ఆ దేశం చూపించింది. ఇరవై మూడేళ్ల నియంతృత్వ ప్రభుత్వాన్ని సరిగ్గా పది రోజుల్లో కూల్చేసింది. సామ్రాజ్యవాద దేశాల అండ ఉన్న దేశాధ్యక్షుడు తట్టాబుట్టా సర్దుకుని ప్రాణభయంతో విమానంలో పరుగులు పెట్టేలా చేసింది. ఒక కొత్త ప్రభుత్వం ఏర్పడేలా చేసింది. ఆ ప్రభుత్వాన్ని కూడ ప్రజలు నిలదీసేలా చేసింది. తమ దేశాల ప్రజలలో కూడ ఇటువంటి నిద్రాణమైన ఆగ్రహం ఉండవచ్చుననీ, అది రగుల్కొంటే తమ ఉనికి కూడ ప్రశ్నార్థకం కావచ్చుననీ. తమ పాలనలు కూడ పేకమేడల్లా కూలిపోవచ్చుననీ పొరుగుదేశాల అధినేతలు భయపడడం మొదలుపెట్టారు. ప్రజాశక్తి అప్రతిహతమైనదనే చారిత్రక సత్యాన్ని అతని బలిదానమూ, దాని పర్యవసానాలూ రుజువు చేశాయి.

టునీషియా అనే చిన్నారి దేశం కథ ఇది. ప్రజలకూ పాలకులకూ కూడ పాఠం చెప్పగల గాథ. ఒక చిన్న నిప్పురవ్వ దావానలంగా ఎలా మారగలదో, పెరిగిపోతున్న ప్రజాగ్రహాన్ని ఎంతమాత్రం సంబంధం లేని ఒక చిన్న ఘటన కూడ ఎలా ముట్టించి విస్తరించగలదో ప్రజాపోరాట నాయకులకు కూడ విప్పిచెప్పగల గాథ ఇది.

అలా వంటికి నిప్పంటించుకుని మరణించిన యువకుడి పేరు మహమ్మద్ బొవజిజి. ఒకవైపు సకల సంపదలు ఉన్నా, ప్రజలు కటిక పేదరికంలో బతకవలసి వస్తున్న అన్ని దేశాల లాంటిదే టునీషియా. అటువంటి సగటు పేద కుటుంబమే బొవజిజిది కూడ. తండ్రి మరణించడం, పెద్ద చదువు లేకపోవడం, ఉన్న చదువుకైనా తగిన ఉద్యోగం దొరకకపోవడం, దేశంలో ఎటు చూసినా లంచగొండితనం, అధికారుల దౌర్జన్యం మహమ్మద్ సమస్యలు. అతను చిన్న వయసునుంచే వీథుల్లో చిన్నా చితకా సరుకులమ్మి కుటుంబాన్ని పోషించవలసిన దుస్థితిలో పడ్డాడు. ఆత్మహననం చేసుకునేనాటికి సిద్ బౌజిద్ అనే పట్టణంలో తోపుడు బండిమీద పళ్లూ కూరగాయలూ అమ్ముకుంటూ ఉండేవాడు. అన్ని చోట్ల లాగానే అక్కడ కూడ పోలీసులకు, అధికారులకు పేదల మీద అధికారం చలాయించడం మాత్రమే తెలుసు. ఆ తోపుడు బండికి అనుమతి లేదని వాళ్లు మహమ్మద్ మీద విరుచుకుపడ్డారు. డిసెంబర్ 17న ఆ బండిని పడదోసి కూరగాయలూ పళ్లూ మట్టిపాలు

---

మారాలి. భారతదేశపు మూలవాసులుగా వారికి తగిన గౌరవం మనమందరం ఇవ్వాలి.

మన దేశంలో ఆదివాసీ ప్రజలకు జరిగిన అన్యాయం, మన దేశ చరిత్రలో సిగ్గుపడాల్సిన అన్యాయం. ఈ ఆదివాసులను రాక్షసులని, అసురులని, ఒకటేమిటి అనేక చెడ్డ పేర్లతో మనం పిలిచాం. పెద్ద సంఖ్యలో వాళ్లను చంపేశాం. బతికున్న వాళ్లను, వాళ్ల వారసులను అవమాన పరిచాం. అతి హీనంగా చూశాం. శతాబ్దాల తరబడి వాళ్ల మీద అన్నిరకాల అత్యాచారాలు జరిపాం. వాళ్ల భూముల్ని అక్రమించుకొని, వాళ్లని అడవుల్లోకి, కొండల్లోకి నెట్టివేశాం. వాళ్లు అక్కడ పేదరికంలో, రోగాలతో, చదువులేక దుర్భరమైన జీవితాన్ని గడుపుతున్నారు. వాళ్లని అటవీ, కొండ ప్రాంతాల నుండి కూడా తరిమివేసి, వాళ్ల జీవనాధారమైన అటవీ సంపదను స్వాధీనం చేసుకోవడానికి కొందరు ఇప్పుడు ప్రయత్నిస్తున్నారు.

మహాభారతంలోని ఏకలవ్యుడి కథ, ఆదివాసులకు జరిగిన అన్యాయానికి పెద్ద ఉదాహరణ! తక్కువ కులంలో పుట్టిన కారణంగా ఏకలవ్యుడికి విలువిద్య నేర్పనిరాకరించిన ద్రోణాచార్యుడు క్షత్రియుడైన అర్జునున్ని విజేతగా చేయడం కోసం ఏకలవ్యుడి బొటనవేలును నరికి ఇమ్మని కోరడం సిగ్గుమాలిన చర్య.

ఇంత భయంకరమైన నిర్బంధం, పీడన అమలవుతున్నప్పటికీ మన దేశంలో ఆదివాసీయేతరులకంటే, ఆదివాసులే ఉన్నతమైన నైతిక విలువలను పాటిస్తున్నారు. వాళ్లు మోసం చేయరు. అబద్ధాలాడరు. ఆదివాసీయేతరులు చేసే తప్పుడు పనులేమీ వాళ్లు చేయరు. వాళ్లు నడవడికలో ఆదివాసీయేతరుల కంటే ఉన్నతులు. వారిపట్ల చరిత్ర క్రమంలో అమలైన అన్యాయాన్ని సరిచేయవలసిన సందర్భమిది.

(స్వేచ్ఛానువాదం :
సి.ఎస్.ఆర్. ప్రసాద్, రిటైర్డ్ రాజనీతి శాస్త్ర అధ్యాపకులు) వీ

చేశారు. త్రాసు ఇవ్వడానికి నిరాకరించాడని మహమ్మద్ పై పురపాలక సంఘానికి చెందిన మహిళా అధికారి చెయ్యి చేసుకుంది. తిట్లూ దుర్భాషలూ తన్నులూ సాగిన ఈ దాడి అంతా నిజానికి అనుమతి లేనందుకు కాదు. తోపుడు బండికి అనుమతి అక్కరలేదని స్థానిక చట్టాలు చెపుతాయి. కాని ఆ అధికారులు అడిగిన లంచం – మన భాషలో మామూలు – ఇవ్వడానికి మహమ్మద్ నిరాకరించాడు. అదీ అసలు సంగతి.

నడివీధిలో అందరిముందూ దెబ్బలుతిన్న మహమ్మద్ అవమాన పడ్డాడు. ఏడ్చి మొత్తుకున్నాడు. పై అధికారుల దగ్గరయినా న్యాయం దొరుకుతుందేమోనని, తన పళ్లూ కూరగాయలూ త్రాసూ తిరిగి ఇప్పిస్తారేమోనని నగర అధికారుల దగ్గరికి పరుగెత్తాడు. ఉన్నతాధికారిని కలవబోతే పోలీసులు అడ్డగించారు. ఇక ఎక్కడా న్యాయం దొరకదని, అది దొంగల రాజ్యమని అర్థమయ్యాక మహమ్మద్ బొవజిజికి మిగిలినది మృత్యువు ఒక్కటేననిపించింది. ఏ ఇంటర్నెట్ కేఫ్ నుంచి పంపాడో తెలియదు గాని తల్లికి ఫేస్ బుక్ మీద ఒక సందేశం పంపాడు:

'అమ్మా, వెళిపోతున్నా. నన్ను కోప్పడకమ్మా. నేనెక్కడో దారి తప్పిపోయాను. కాని ఈ దారి నేను ఎంచుకున్నది కాదు. ఎప్పుడన్నా నేను నీ మాట వినకపోయి ఉంటే క్షమించు. నన్ను తప్పుపట్టకు. ఈ కాలాన్ని తప్పుపట్టు. నేనిక తిరిగి రాలేని చోటికి వెళుతున్నా. నేనివాళ చాల ఏడ్చానమ్మా, ఇంక నా కళ్లలో నీళ్లు లేవు. ఈ దిక్కులేని దేశంలో, ఈ వంచన నిండిన ప్రపంచంలో ఎవరినీ తప్పుపట్టలేమమ్మా. నేనింక అలసిపోయాను. అన్నిటినీ వదిలేసి వెళిపోతున్నాను. నా ప్రయాణం మొదలయింది. ఈ ప్రయాణంలోనయినా నేను అన్నీ మరచిపోతానో లేదో తెలియదు.' ఇదీ ఆ సందేశం.

ఆ తర్వాత గ్యాసోలిన్ సంపాదించి ఒక ప్రభుత్వ కార్యాలయం ముందుకు వెళ్లి పట్టపగలు అది మీద పోసుకుని అందరూ చూస్తుండగా నిప్పంటించుకున్నాడు. అధికారులు వెంటనే అతణ్ని ఆస్పత్రికి తరలించారు. అక్కడి నుంచి మరిన్ని సౌకర్యాలున్న రెండు ఆస్పత్రులకు కూడ మార్చారు. ఈ మధ్యలో అతణ్ని వేధించిన అధికారులకు శిక్షలు కూడ విధించారు. స్వయంగా దేశాధ్యక్షుడే ఆస్పత్రికి వచ్చి చికిత్స పొందుతున్న మహమ్మద్ ను చూశాడు. కాని ఎవరేం చేసినా, పద్దెనిమిది రోజుల పాటు చావు బతుకుల మధ్య కొట్టుమిట్టాడిన మహమ్మద్ బొవజిజి జనవరి 4న మరణించాడు. అతని అంతిమయాత్రలో ఐదువేలమంది ప్రజలు పాల్గొన్నారు. పోలీసులు ఆ అంతిమయాత్రమీద ఆంక్షలు విధించారు. అతను తగులబెట్టుకున్నచోటు మీదుగా అంతిమయాత్ర సాగడానికి వీలులేదన్నారు.

'స్వేచ్ఛ చాల ఖరీదయినది. నా సోదరుడు ఆ స్వేచ్ఛకు మూల్యం చెల్లించాడు. ఇప్పుడు అరబ్ ప్రతిఘటనకు చిహ్నంగా మారిపోయాడు' అని మహమ్మద్ సోదరుడు సలీమ్ అన్నట్టు జనవరి 4 సాయంత్రం అంత్యక్రియలు జరిగిన తర్వాతనే మహమ్మద్ బొవజిజి నిజమైన జీవితం ప్రారంభమయింది. టునీషియా దేశవ్యాప్తంగా పోలీసు అత్యాచారాలకు, అధికారుల లంచగొండితనానికి, ఈ అవ్యవస్థను కాపాడుతున్న నియంతృత్వ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఎక్కడికక్కడ ప్రజాందోళనలు ప్రారంభమయ్యాయి. మహమ్మద్ నిలువెత్తు చిత్రపటాలు పట్టుకుని ప్రజాప్రదర్శనలు, ఊరేగింపులు మొదలయ్యాయి. దేశం అట్టుడికి పోయింది. అది కేవలం మహమ్మద్ బొవజిజికి నివాళి మాత్రమే కాదు. ఆ అనామక పళ్ల వ్యాపారి హఠాత్తుగా ఒక నియంతృత్వ వ్యతిరేక చిహ్నమయ్యాడు. నిరుద్యోగాన్ని ప్రశ్నించదలచిన, ప్రభుత్వాన్ని ప్రతిఘటించదలచిన ప్రతి ఒక్కరికీ ఆదర్శమయ్యాడు. దేశం మొత్తాన్నీ ఒక కుదుపు కుదిపిన అతని సంస్మరణ అనే నిప్పురవ్వ టునీషియన్ల స్వేచ్ఛాకాంక్ష, పోరాటస్ఫూర్తి ఎంత విస్తృతమైన కార్చిచ్చో రుజువు చేసింది. ప్రజలు తమ ఆగ్రహ ప్రదర్శనను తమ జాతీయ పుష్పం పేరు మీద మల్లె విప్లవం (జాస్మిన్ రెవల్యూషన్) అని పిలుచుకుంటున్నారు.

ఆ తర్వాత పది రోజుల పాటు సాగిన నిరసన ప్రదర్శనల మీద పోలీసులు, సైనికులు జరిపిన కాల్పుల్లో కనీసం వందమంది మరణించారు. వేలాది మంది గాయపడ్డారు. కోట్ల డాలర్ల ఆస్తి ధ్వంసమయింది. మొదట అధ్యక్షుడు బెన్ అలీ ఈ నిరసనల మీద ఉక్కుపాదం మోపడానికి ప్రయత్నించాడు. నిరసనకారుల డిమాండ్లలో ఏ ఒక్కదానికీ తల ఒగ్గబోనని ప్రకటించాడు. వారం రోజులు గడిచినా ప్రజాప్రదర్శనలు ఆగలేదు సరిగదా ఇంకా పెరిగిపోయాయి. అప్పుడు అధ్యక్షుడే స్వయంగా టివి తెరలమీదికి వచ్చి ప్రజలు తనను అర్థం చేసుకోవాలనీ, తనకు మరొక అవకాశం ఇవ్వాలనీ కోరాడు. ప్రదర్శనకారుల మీద కాల్పుల ఆదేశాలను ఉపసంహరిస్తున్నానన్నాడు. అయినా ప్రజలు తమ ఆందోళన విరమించలేదు. మర్నాడు వేలాది మంది ప్రజలు ఆంతరంగిక భద్రతా మంత్రిత్వశాఖ కార్యాలయం మీద దండెత్తారు. నిజానికి టునీషియాలో ఈ గూఢచారశాఖ అంటే విపరీతమైన భయం ఉంది. రాజధాని టునిస్ నగరంలో టాక్సీ డ్రైవర్లలో ఎనభై శాతం మంది ఈ శాఖకు ఉప్పందించే వేగులేననీ, చీమ చిటుక్కుమన్నా, ఎక్కడ ఎవరు ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలు చేసినా వారి పని అంతేననీ గతంలో పుకార్లుండేవి. కాని ఆ భయానక, దుర్మార్గ శాఖ భవనం మీదనే ప్రజలు దాడి చేశారు. 'మాకు రొట్టె కావాలి, నీళ్లు కావాలి. బెన్ అలీ వద్దు' అనే నినాదాలతో రాజధానీ నగరం మాత్రమే కాదు, దేశమే దద్దరిల్లిపోయింది.

తన అధికారం కాపాడుకునే కార్యక్రమంలో భాగంగా అధ్యక్షుడు మంత్రివర్గ సహచరులను ముగ్గురిని తొలగించాడు. రాజధానిలో ముఖ్యమైన ప్రభుత్వ భవనాలను కాపాడే బాధ్యతను సైన్యానికి అప్పగించాడు. ఆ మర్నాడు ఆంతరంగిక భద్రతా మంత్రిని కూడ తొలగించాడు. దేశమంతా రాత్రి కర్ఫ్యూ విధించాడు. చివరికి జనవరి 14న మంత్రివర్గాన్నీ, పార్లమెంటునూ రద్దుచేశాడు. ఆరు నెలల్లో మళ్లీ ఎన్నికలు జరుపుతానని వాగ్దానం చేశాడు. కొన్ని గంటలు గడవకముందే దేశంలో అత్యవసర పరిస్థితి విధించాడు. మరొక రెండు గంటల్లోనే కుటుంబంతో సహా దేశం వదిలి పారిపోయాడు. మొదట ఫ్రాన్స్ లో ఆశ్రయం తీసుకోవడానికి ప్రయత్నించగా, టునీషియా ప్రజల ఆగ్రహానికి జడిసి ఫ్రాన్స్ తిరస్కరించింది. ఆ తర్వాత బెన్ అలీ కుటుంబం సౌదీ అరేబియాలో ఆశ్రయం పొందింది.

వెంటనే అప్పటివరకూ ప్రధానిగా ఉన్న గన్నౌచీ అధ్యక్షుడిగా 'జాతీయ ఐక్యతా' మధ్యంతర ప్రభుత్వం ఏర్పడింది. ఐనా ప్రజాగ్రహం

చల్లారలేదు. బెన్ అలీ పారిపోయినంత మాత్రాన సరిపోదనీ, అతని పాలన అవశేషాలన్నీ రద్దు కావలసిందేననీ ప్రజలు డిమాండ్ చేస్తున్నారు. పాత బెన్ అలీ మంత్రివర్గంలో భాగస్తులే ఎక్కువ మంది ఉన్న కొత్త మంత్రివర్గం అనేక రాజకీయ సంస్కరణలను ప్రకటించింది. రాజకీయ పార్టీలు స్వేచ్ఛగా పనిచేసుకోవచ్చునని ప్రకటించింది. గత ప్రభుత్వం రాజకీయ, సామాజిక కార్యకర్తలపై విధించిన ఆంక్షలను రద్దుచేసింది. గత పాలకపార్టీకి చెందిన భవనాలను, ఆస్తులను జాతీయం చేసింది. మల్లె విప్లవపు అమరులందరికీ గౌరవసూచకంగా మూడు రోజుల విషాదదినాలు ప్రకటించింది. కాని ప్రజలు ఈ పైపై మెరుగులలో ఏ ఒక్కదాన్నీ అంగీకరించడం లేదు. ఆ అమరులను చంపినవారే మళ్లీ గద్దెనెక్కి ఆ అమరులకు నివాళి ప్రకటించడమేమిటని నిలదీస్తున్నారు. ఈ నిరసన ఆందోళన ఎంత విస్తృతమైనదంటే అందులో పాల్గొనని ప్రాంతం, వర్గం లేదు. చివరికి పోలీసులు కూడ తమ విధులను బహిష్కరిస్తున్నారు. తప్పనిసరిగా పనిచేయవలసిన ట్రాఫిక్ పోలీసులు మాత్రమే తమ విధులు నిర్వహిస్తున్నప్పటికీ, వారు కూడ అమరుల స్మృతి సూచకంగా భుజాలకు ఎర్రపట్టీలు కట్టుకుని పనిచేస్తున్నారు. కొత్త మధ్యంతర ప్రభుత్వాన్ని కూడ రద్దు చేయాలని ప్రదర్శకులందరూ డిమాండ్ చేస్తున్నారు. 'దేశ సంపదను దోచుకుతిన్నది మీరే. మా ఈ విప్లవాన్ని మాత్రం మీరు దోచుకోవడానికి వీలు లేదు. ప్రభుత్వం వైదొలగవలసిందే. అమరుల నెత్తుటి ధారవోతకు మేం ద్రోహం చేయం' అని ప్రజలు నినదిస్తున్నారు.

ఎన్నో నగరాల్లో, ప్రాంతాల్లో తాత్కాలిక విప్లవ, ప్రజాస్వామిక పాలనా సమితులు ఏర్పడ్డాయి. దేశవ్యాప్తంగా పేరున్న నిజాయితీ పరులతో, గత ప్రభుత్వంతో ఎటువంటి సంబంధం లేనివారితో ఒక మధ్యంతర ప్రభుత్వం ఏర్పడాలనీ, దాని నాయకత్వంలో కొత్త రాజ్యాంగ రచన, ఎన్నికల నియమావళి ఏర్పాటు జరగాలని ఒక రాష్ట్రంలో ఏర్పడిన 'ప్రజా విప్లవ పరిరక్షణ సమితి' కోరింది. స్వేచ్ఛ కోసం, ఆత్మగౌరవం కోసం సాగిన ప్రజా విప్లవ క్రమంలో పాత ప్రభుత్వం, పాత ప్రజా ప్రతినిధుల సభ తమ సాధికారతను కోల్పోయాయని, కనుక వాటిని రద్దు చేయాలని ఆ సమితి కోరింది. గత ప్రభుత్వం అన్యాయం మీద, నిరంకుశత్వం మీద, అవినీతి మీద, నిరుద్యోగం మీద, అపార దేశ సంపదలను కొల్లగొట్టడం మీద ఆధారపడి ఒక చీకటి రాజ్యాన్ని నెలకొల్పిందనీ, ప్రజలను అన్ని రకాల అణచివేతలకు, దోపిడీకి గురిచేసిందనీ, అందువల్ల గత ప్రభుత్వంతో సంబంధం ఉన్నవాళ్లెవరినీ మళ్లీ ఎన్నికలలో పాల్గొనకుండా నిషేధించాలని కూడ ఆ సమితి కోరింది.

ప్రభుత్వరంగ ప్రచార సాధనం లా ప్రెస్ అనే పత్రిక కార్యాలయం లో పాత సంపాదకుడిని తొలగించి, రెండు కొత్త సంపాదక సమితులను ఎన్నుకున్నారు. రాజకీయ కారణాలతో గతంలో తొలగించిన జర్నలిస్టును జర్నలిస్టు సంఘపు నాయకుడిగా పునర్నియమించారు. పాత అధ్యక్షుడి బంధువులకు చెందిన కంపెనీలలో, మంత్రిత్వశాఖలలో సమ్మెలు, కార్మిక ప్రదర్శనలు మొదలయ్యాయి. దేశంలోని ప్రధాన బీమా సంస్థ నుంచీ, ప్రధాన చమురు పంపిణీ సంస్థ నుంచీ, బాంక్ డి టునీసి నుంచీ, పన్నుల శాఖ నుంచీ, జాతీయ వ్యవసాయ బ్యాంకు నుంచీ, టునీసీ టెలికాం సంస్థ నుంచీ ప్రధాన కార్యనిర్వహణాధికారులను వెళ్లగొట్టారు. పాత అధ్యక్షుడి బంధువులయిన ఈ అధికారులు ఈ సంస్థలనుంచి ముఖ్యమైన కాగితాలు తీసుకుపోకుండా కార్మికులు, సిబ్బంది కాపలాలు కాస్తున్నారు.

పారిశ్రామిక, వ్యాపార సంస్థల మీద ఈ విప్లవ ప్రభావం ఎంతగా ఉన్నదంటే, టునీషియన్ వాణిజ్య పత్రికలు 'చట్టం పట్ల గౌరవం లేకుండా పోతున్నద'ని వాపోతున్నాయి. 'ఆంతరంగిక భద్రతా మంత్రిత్వశాఖ ఏం చేస్తున్నది' అని ప్రశ్నిస్తున్నాయి. 'గౌరవనీయ వ్యాపారవేత్తలను ఇలా మోకరిల్లేలా చేస్తారా' అనీ, 'క్రమశిక్షణ' అవసరమనీ రాస్తున్నాయి.

ఆకస్మిక ఘటనగా, గెంతుగా, గుణాత్మక మార్పుగా కనిపిస్తున్నప్పటికీ, ఈ పరిణామానికి సుదీర్ఘ గతం ఉంది. ఆఫ్రికా ఖండానికి ఉత్తర కొసన మధ్యధరా సముద్ర తీరంలో లిబియా, అల్జీరియాలు సరిహద్దుగా ఒక కోటికి పైగా జనాభాతో ఉన్న టునీషియాకు చమురు నిల్వలున్న దేశంగా, పర్యాటక కేంద్రంగా చాల ప్రాముఖ్యత ఉంది. పెట్రోలియం, సహజవాయువు, వ్యవసాయోత్పత్తులు ప్రధాన వనరులు కాగా, పదమూడు వందల కిలోమీటర్ల సముద్రతీరం వల్ల పర్యాటకరంగం కూడ ఆదాయవనరుగా ఉంది. పేరుకు ఆఫ్రికా దేశమైనా, ముస్లిం జనాభావల్ల, ప్రాంతీయ సాన్నిహిత్యం వల్ల అది పశ్చిమాసియాలోని అరబ్ దేశాలకే దగ్గర. అలాగే మధ్యధరా సముద్రం అవతలి ఒడ్డున ఉన్న యూరప్ దేశాల వల్ల, ముఖ్యంగా ఎంతోకాలం వలసగా పాలన సాగించి, ఇప్పటికీ రాజకీయాలను, ఆర్థిక వ్యవస్థను ప్రభావితం చేస్తున్న ఫ్రాన్స్ వల్ల టునీషియాకు యూరపియన్ యూనియన్ తోనూ దగ్గరి సంబంధం ఉంది. ఫ్రాన్స్, అమెరికాలతో సహా ఎన్నో సామ్రాజ్యవాద ప్రభుత్వాలు బెన్ అలీకి ఈ రెండు దశాబ్దాలుగా మద్దతు ఇస్తూ ఉన్నాయి.

పేరుకు గణతంత్ర రాజ్యమైనా అధ్యక్షుడు జైన్ ఎల్ అబీదిన్ బెన్ అలీ ఇరవై మూడు సంవత్సరాలుగా నిరంకుశ పాలన సాగిస్తున్నాడు. అతని నాయకత్వంలోని కాన్‌స్టిట్యూషనల్ డెమొక్రటిక్ రాలీ (ఆర్ సి డి) అనే పార్టీ పట్ల ప్రజలలో ఎంతో అసంతృప్తి, వ్యతిరేకత ఉన్నప్పటికీ, అది దాదాపు ప్రతి ఎన్నికలలోనూ ఘన విజయాలు సాధిస్తూ వస్తోందంటే ఆ ఎన్నికల తతంగం ఎంత బూటకంగా జరుగుతోందో అర్థమవుతుంది. ఆ పార్టీకి 2009 సార్వత్రిక ఎన్నికలలో 89.6 శాతం వోట్లు వచ్చాయి. ఆ ఎన్నికలను పర్యవేక్షించడానికి వెళ్లిన స్వతంత్ర విదేశీ విలేకరులను విమానాశ్రయం నుంచే వెనక్కి పంపించేసిన ఘనత ఆ ప్రభుత్వానిది.

ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ ప్రజాస్వామ్యం ఎలా పనిచేస్తోందో 2008లో జాబితా తయారు చేసిన ఎకనమిస్ట్ పత్రిక ఆ 167 దేశాల జాబితాలో టునీషియాను 141వ స్థానంలో పెట్టింది. అదేసంవత్సరం పత్రికాస్వేచ్ఛ పరిస్థితి గురించి తయారయిన మరొక 173 దేశాల జాబితాలో టునీషియా 143వ స్థానంలో ఉంది. దేశంలో ఇంటర్నెట్ ప్రవేశం మీద ప్రభుత్వం తీవ్రమైన ఆంక్షలు విధించింది. రిపోర్టర్స్ వితౌట్ బార్డర్స్ సంస్థ టునీషియాను ఇంటర్నెట్ శత్రువుల జాబితాలో చేర్చింది. గత ఇరవై సంవత్సరాలలో దేశంలో ప్రజల హక్కుల గురించి మాట్లాడిన ఎందరో వ్యక్తులు జైలుపాలయ్యారు. లేదా విదేశాలకు శరణార్థులుగా వెళ్లారు. దేశంలో ఒక్క పౌరహక్కుల సంస్థను కూడ ప్రభుత్వం పనిచేయనివ్వలేదు.

ఇలా కనీస మానవ హక్కులన్నిటిలోనూ అట్టడుగు స్థానాన ఉన్న టునీషియా అవినీతిలో, కుంభకోణాలలో, విదేశాలకు సంపద తరలింపులో మాత్రం అగ్రస్థానంలో ఉంది. దేశంలోని ప్రధాన పారిశ్రామిక, వ్యాపార సంస్థలన్నీ అధ్యక్షుడి భార్యకు సమీప బంధువుల చేతిలో ఉన్నాయి. అధ్యక్షుడి భార్య దేశదేశాలు తిరిగి విలాసవస్తువులు కొంటుందని ప్రతీతి. ప్రభుత్వానికి చెందిన ఒక విమానాన్ని ఇలా ఆమె తన సొంత సరదాలకోసం మిలాన్, పారిస్, జెనీవా లాంటి నగరాలకు తీసుకువెళ్లి కోట్ల డాలర్ల విలాస వస్తువులు కొనడం పత్రికలకెక్కింది. చివరికి దేశంనుంచి అధ్యక్ష కుటుంబం పారిపోవడానికి కొద్ది రోజుల ముందు, అంటే దేశంలో అల్లకల్లోల స్థితి ఉన్నప్పుడే ఆమె దేశ ఖజానా నుంచి ఒక టన్నున్నర (పదిహేనువందల కిలోల) బంగారాన్ని తన ఇంటికి తీసుకుపోయిందనీ, దేశం నుంచి పారిపోయేటప్పుడు ఆ బంగారాన్ని కూడ ఎత్తుకుపోయారనీ వార్తలు వస్తున్నాయి. టునీషియాలో ప్రజాస్వామ్యం పేరుతో దొంగలస్వామ్యం సాగుతున్నదనే విమర్శలు ఎంతో కాలంగా సాగుతున్నాయి.

ఇలా విపరీతమైన అవినీతితో, దేశ సంపదను కొల్లగొడుతూ, ఆ కొల్లగొట్టిన సంపదతో అతిభయంకరమైన నిర్బంధ పాలనను నడుపుతూ ప్రజలను భయపెడుతూ బెన్ అలీ, అతని పార్టీ, అతని ఆశ్రితులు దేశాన్ని చీకటిరాజ్యంగా నడుపుతూ వచ్చారు. ఆ చీకటి రాజ్యాన్ని తుదముట్టించే ప్రయాణం మహమ్మద్ బొవజిజి అంతిమయాత్రతో మొదలయింది.

నిజానికి ఈ టునీషియా గత విషాద గాథ, వర్తమాన ప్రజా విజయగాథ చాల ఆసక్తికరమైన అంశాలను వెలికితీస్తున్నాయి. రెండో ప్రపంచయుద్ధం తర్వాత వలస పాలనలనుంచి స్వతంత్రమై, దేశీయ దోపిడీదారుల చేత చిక్కిన అన్ని దేశాలలోనూ కొద్దిగా అటూ ఇటూగా ఇటువంటి పరిణామాలే జరిగాయి, జరుగుతున్నాయి. అక్కడిలాగే అన్ని దేశాలలోనూ ప్రజలలో అసంతృప్తి, ఆగ్రహం పేరుకుపోతూనే ఉన్నాయి. పేదరికం, ఆకలి, దుఃఖం, నిరుద్యోగం, అవినీతి, దేశ సంపదలను పిడికెడు మంది పాలకులు దోపిడీ చేయడం, సొంత బొక్కసాలు నింపుకోవడం, ప్రశ్నించిన ప్రజల మీద దుర్మార్గమైన అణచివేతను అమలు జరపడం, ఆ పాలకులకు అగ్రరాజ్యాల మద్దతు ఉండడం – ఏ దేశంలో చూసినా ఇదే కథ. పేర్లు, అంకెలు, వివరాలు మాత్రం మారుతాయి తప్ప 1940ల తర్వాత వలస పాలన రద్దయిందని ప్రకటించుకున్న అన్ని దేశాలలోనూ కనబడుతున్న దృశ్యం ఇదే. మహమ్మద్ బొవజిజి ఆత్మహననంతో టునీషియా సమాజం రగుల్కొన్నట్టుగా దాదాపు ప్రతిదేశంలోనూ ఇటువంటి ఆకస్మిక, సంచలనాత్మక ఘటనలు, పరిణామాలు కూడ జరుగుతూనే ఉన్నాయి. టునీషియాతో పోలిస్తే ఆయా దేశాలు విస్తీర్ణంలోనూ, జనాభాలోనూ, ప్రజాసమూహాల వైవిధ్యంలోనూ భిన్నమైనవి కావచ్చు. అందువల్ల ఆ ప్రజా ఆగ్రహ ప్రకటనలు, వాటి విస్తృతి వేరువేరుగా ఉండవచ్చు. టునీషియాలో జరిగినట్టే ప్రతిచోటా జరగకపోవచ్చు.

కాని అన్నిచోట్లా ఇంత విస్తృతమైన ప్రజా అసంతృప్తి, ఆగ్రహం ఉన్నాయనేది వాస్తవం. సరైన నాయకత్వం ఉంటే, ఏదైనా ముట్టించే సంఘటన జరిగితే ఈ ఆగ్రహం ప్రభుత్వాలను కూలదోయగల మహాగ్ని జ్వాలలుగా ఎగుస్తుందనేది కూడ వాస్తవం. ఆ ప్రజా అసంతృప్తిని సమీకరించి, సంఘటితం చేసి, ప్రణాళిక ప్రకారం నడిపించి, వ్యవస్థను మార్చి, దోపిడీ పీడనలను అంతం చేసి, కొత్త సాంఘిక రాజకీయార్థిక వ్యవస్థను నెలకొల్పడం అన్ని దేశాల ప్రజల ముందర, ప్రజాస్వామిక, విప్లవ శక్తుల ముందర ఉన్న కర్తవ్యం. ఈ కర్తవ్యాన్ని నెరవేర్చడానికి ఒక నిర్మాణయుతమైన రాజకీయ శక్తి కావాలి. ఆ రాజకీయ శక్తి ఈ ప్రజాందోళనలను సృజనాత్మకంగా అర్థం చేసుకుని, వాటిలో ప్రవేశించి, నాయకత్వం వహించి, మార్గ నిర్దేశనం చేసి, యథాస్థితిని కూలదోసి, నూతన సమాజ నిర్మాణానికి ఉపయోగించుకోవాలి. ఇవాళ టునీషియాలో అటువంటి పరిణామం జరుగుతుందో లేదో తెలియదు. ప్రస్తుత సంధి దశలో ప్రజలు, వారికి నిజంగా నాయకత్వాన్ని అందించవలసిన శక్తులు చొరవను కోల్పోతే ఈ విప్లవం మధ్యలో దారి తప్పిపోతుంది. మరొక రూపంలో, కొత్త పేర్లతో దోపిడీ పీడనల రాజ్యం కొనసాగుతుంది. విప్లవంగా పేరు పెట్టుకుని మొదలయినది వ్యవస్థ మార్పుగా కాక, ప్రభుత్వం మార్పుగా ఆగిపోతుంది. ఇప్పటికే టునీషియా ప్రజాగ్రహజ్వాలల్లో తమ పేలాలు వేయించుకు తినడానికి సామ్రాజ్యవాదశక్తులు, మతఛాందసశక్తులు, కుహనా ఉదార ప్రజాస్వామిక వాదులు, పొరుగుదేశాల నేతలు, బహుళజాతిసంస్థలు ప్రయత్నిస్తున్నాయి. ఆ అవరోధాలన్నిటినీ దాటుకుని ఈ మల్లె విప్లవం నిజంగా ప్రజలకు సువాసనలు వెదజల్లగలుగుతుందా కాలమే చెప్పాలి.

టునీషియా పరిణామాలు ప్రపంచ వ్యాప్తంగా ప్రజానుకూల శక్తులకు ఒక పాఠం నేర్పుతున్నాయి. ఆ పాఠం ఏమంటే, ఇవాళ ప్రజలు విప్లవానికి సిద్ధంగా ఉన్నారు. ఇవాళ ప్రజా అసంతృప్తి విస్ఫోటక స్థితిలో ఉన్నది. అది ఎంత చిన్న అగ్గిరవ్వకైనా అంటుకుని పేలిపోయేలా ఉన్నది. ఎంత బలహీనమైన గాలివరకకైనా దావానలంలా విస్తరించడానికి సిద్ధంగా ఉన్నది. ఈ ప్రజాగ్రహపు జానకితాడును ముట్టించడం ఎట్లా, ఆ పేలుడును నిర్మాణయుతంగా, తక్కువ విధ్వంసకరంగా జరపడం ఎట్లా, విస్ఫోటన అనంతర నూతన సమాజ నిర్మాణానికి రంగం సిద్ధం చేయడం ఎట్లా అనేవే ఇవాళ ప్రపంచ ప్రజానుకూల శక్తుల ముందున్న ప్రశ్నలు. ఈ ప్రశ్నలకు జవాబులను కనుక్కునే ఆచరణే ఇరవై ఒకటో శతాబ్ది ప్రజా సంచలనాలను సామాజిక పరివర్తనా విప్లవాలుగా మార్చగలుగుతుంది.

*(రచయిత పాత్రికేయులు)*

వీ

వీక్షణం పత్రికను ప్రతి నెల 29-30 తేదీల్లో పోస్టు చేస్తాం. పత్రిక 7వ తేదీలోగా అందకపోతే మాకు తెలియపర్చండి.
చందా రెన్యువల్ చేసుకున్న వారికే పత్రికను పంపించడం జరుగుతుంది.
కార్యాలయం ఫోన్ : 040 - 66843495 (ఉ. 10.30 నుండి సా. 5.30 లోపు)
**చందా మనీ ఆర్డర్ ద్వారా పంపేవారు వారి చిరునామాతో పాటు ఫోన్ నంబర్ తప్పకుండా రాయండి.**

*ఆరు దశాబ్దాలుగా తమకు ఎస్.టి. హోదా కల్పించాలంటూ గుజ్జర్లు రక్తమోడుస్తున్నారనీ, పాలకుల అవకాశవాద రాజకీయాలతో ఆ సమస్య జటిలమవుతోందనీ అంటున్నారు* **నుగునుతుల వెంకటరమణ**

# మళ్లీ మొదలైన గుజ్జర్ల ఆందోళన

తరతరాలుగా ఆర్థికంగా, సామాజికంగా వెనుకబడిన వర్గాల అభివృద్ధికి ప్రత్యేకావకాశాలు కల్పించడం కోసం రాజ్యాంగంలో పొందుపరిచిన వెసులుబాటును సద్వినియోగం చేసుకునే విషయంలో వివిధ వర్గాల మధ్య పోటీ పెరుగుతున్నది. కొన్ని ప్రాంతాలలో కులాల మధ్య ఘర్షణలు జరుగుతున్నాయి. రాజస్థాన్‌లో గత ఆరు దశాబ్దాలుగా సాగుతున్న గుజ్జర్ల ఉద్యమం కూడా ఇలాంటిదే. తమను ఎస్.టి.లుగా గుర్తించాలని వారు చేపట్టిన ఉద్యమం మే 2007, జూన్ 2008లో ఉగ్రరూపం దాల్చింది. ఈ రెండు సంవత్సరాల్లో రెండు సార్లు ఉప్పెనలా వెల్లువెత్తిన ఉద్యమంపై పోలీసులు జరిపిన కాల్పుల్లో 75 మంది పైగా గుజ్జర్లు మరణించారు. కొత్తగా అధికారంలోకి వచ్చిన అశోక్ గెహ్లాట్ ప్రభుత్వం గుజ్జర్ల ఉద్యమం ఫలితంగా 2009లో వారికి ప్రత్యేక కోటా కింద కల్పించిన 5 శాతం రిజర్వేషన్లను నిలిపివేస్తూ హైకోర్టు స్టే విధించింది. ఆ తర్వాత డిసెంబర్ 2010లో రద్దు చేస్తూ తీర్పునివ్వడంతో గుజ్జర్లు మళ్లీ ఉద్యమ బాట పట్టారు. తాజా ఆందోళనతో ప్రభుత్వం ఓ మెట్టు దిగిరాక తప్పలేదు.

అలవికాని హామీలను ఇవ్వడం నేరం. ఇచ్చిన హామీలను అమలు చేయకపోవడం అన్యాయం. గుజ్జర్లను ఎస్.టి. జాబితాలో చేర్చుతామంటూ ఇలాగే 2004 అసెంబ్లీ ఎన్నికల ప్రచారంలో బి.జె.పి. వాగ్దానం చేసింది. వసుంధర రాజే స్వయంగా ప్రచార సభలలో ఈ హామీని అనేకసార్లు వెల్లడించారు. ఎన్నికలకు చాలా ముందుగానే, ఎన్.డి.ఎ. మంత్రిమండలిలో సభ్యురాలిగా ఉన్న కాలంలోనే వసుంధర గుజ్జర్ల కోర్కెను సమర్థించారు. కానీ అధికారంలోకి రాగానే ఈ సమస్యను పరిష్కరించాల్సిన బాధ్యతను విస్మరించారు. మాదిగలు కోరుతున్న వర్గీకరణకు రాజ్యాంగ సవరణ అవసరమైనట్టే, గుజ్జర్లను ఎస్.టి. జాబితాలోకి చేర్చడానికైనా, లేదా వారికి ప్రత్యేక రిజర్వేషన్లు కల్పించాలన్న కూడా రాజ్యాంగాన్ని సవరించవలసిందే. ఈ మేరకు రాజస్థాన్ ప్రభుత్వం కేంద్రానికి సిఫారసు చేయాలి. ఈ వ్యవహారాన్ని పరిశీలించి అవసరమైన చర్యలు తీసుకునేందుకు వసుంధర రాజే 2006లో నియమించిన మంత్రివర్గ ఉపసంఘం 2007 నాటికి ఒకే ఒక్కసారి సమావేశం కావడం పాలకుల చిత్తశుద్ధికి తార్కాణం.

ప్రభుత్వ నిర్లక్ష్యంపై ఆగ్రహం చెందిన గుజ్జర్లు 29 మే 2007న శాంతియుతంగా ఆందోళన ప్రారంభించడానికి దౌసాకు వేల సంఖ్యలో తరలి వచ్చారు. అలా వచ్చిన వారిపై ముందస్తు హెచ్చరికలు లేకుండా పోలీసులు కాల్పులు జరపడంతో ఒకరు కాదు ఇద్దరు కాదు, ఏకంగా 19 మంది చనిపోయారు. రాజస్థాన్‌లోని దౌసాలో ప్రారంభమైన వారి నిరసన క్రమంగా ఉత్తరాదిన ఇతర ప్రాంతాలకు పాకింది. దేశ రాజధాని ఢిల్లీ వీథులన్నీ గుజ్జర్ల ఆందోళనతో స్తంభించిపోయాయి. ఈ ఉద్యమం హింసాత్మకంగా మారి ఢిల్లీకి చేరితే కాని కేంద్ర ప్రభుత్వానికి, సుప్రీంకోర్టుకు జరుగుతున్నదేమిటో అర్థం కాలేదు. బస్సుల దగ్ధం, ప్రైవేట్ ఆస్తుల ధ్వంసం, రహదార్లపై రాకపోకలు గంటల తరబడి ఆగిపోవడంతో నాలుగైదు రోజులపాటు ప్రేక్షకపాత్ర వహించిన కేంద్రం రంగంలోకి దిగింది. సుప్రీంకోర్టు కూడా కలగ చేసుకుని గుజ్జర్ల హింసాకాండను ఎందుకు అడ్డుకోలేదని రాజస్థాన్, పంజాబ్, ఉత్తరప్రదేశ్, హర్యానా పోలీసు అధికారులను ప్రశ్నించింది. టెలివిజన్ ఛానెళ్లలో హింసాకాండ స్పష్టంగా కనిపిస్తుంటే పోలీసులు ఏమి చేస్తున్నారని నిలదీసింది. జరిగిన సంఘటనల్ని దేశానికి సిగ్గుచేటుగా అభివర్ణించింది. గత ఏడాది పోటెత్తిన గుజ్జర్ల ఆందోళన సందర్భంగా జరిగిన పోలీసుల కాల్పుల్లో దాదాపు 27 మంది మరణించారు. పరిస్థితి చేయిదాటిపోతుండడంతో స్పందించిన రాజస్థాన్ ముఖ్యమంత్రి వసుంధర రాజే, గుజ్జర్ అర్క్షాషన్ సంఘర్షణ సమితి నేత కిరోరి సింగ్ భైంస్లాతో ఎస్.టి. హోదా కల్పించే విషయమై అధ్యయనం చేయడానికి త్రిసభ్య కమిటీ వేస్తున్నట్లు తెలిపారు. దీనిపై మూడు నెలలోగా నిర్ణయం తీసుకొంటానని హామీ ఇవ్వడంతో గుజ్జర్లు తమ ఆందోళన విరమించుకున్నారు. ఇదంతా 2007 సంగతి.

సంవత్సరం గడిచింది. అయినా కమిటీ అధ్యయనం ముందుకు సాగలేదు. గుజ్జర్లను ప్రభుత్వమూ మరిచిపోయింది. దింతో తమ హక్కుల సాధన కోసం వారు మళ్లీ ఉద్యుక్తులు కావాల్సి వచ్చింది. అలా తిరిగి ఈ ఏడాది మే 24న గుజ్జర్ అర్క్షాషన్ సంఘర్షణ సమితి ఆందోళనకు పిలుపునివ్వడంతో భరత్‌పూర్ జిల్లాలో వారం రోజులపాటు ఆందోళనను అణిచివేయడానికి పోలీసులు జరిపిన కాల్పుల్లో 35 మంది గుజ్జర్లు చనిపోయారు. ఆందోళన జరుగుతున్న ప్రాంతాలకు అన్నపానీయాల సరఫరా నిలిపివేశారు. ఉద్యమంపై ఉక్కుపాదం మోపుతామని, సైన్యంతో అణచివేస్తామని కేంద్ర హోంశాఖ మంత్రి శివరాజ్ పాటిల్ హెచ్చరించారు. రాజస్థాన్‌తో పాటు గుజ్జర్లు ఉన్న మిగతా రాష్ట్రాల ముఖ్యమంత్రులతో ఓ సమావేశం ఏర్పాటు చేయాలని ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి రాజే ప్రధానికి విజ్ఞప్తి చేశారు. వారికి 6 శాతం రిజర్వేషన్లు కల్పించాలని ఆమె సిఫారసు చేశారు. అయితే ఆ సిఫారసును కేంద్రం అటకెక్కించింది. సమస్య అలాగే ఉండిపోయింది.

2009 జూలైలో విద్యా, ఉద్యోగ రంగాల్లో గుజ్జర్లకు 5 శాతం ప్రత్యేక రిజర్వేషన్లు కల్పిస్తూ రాజస్థాన్ ప్రభుత్వం ప్రత్యేక ఆర్డినెన్స్ జారీ చేసింది. ఈ ఆర్డినెన్స్‌పై 13 అక్టోబర్ 2009న రాజస్థాన్ హైకోర్టు స్టే విధించింది. సుప్రీంకోర్టు మార్గదర్శకాలకు విరుద్ధంగా రాష్ట్ర ప్రభుత్వం యాభై శాతానికి మించి రిజర్వేషన్లు కల్పించిందని ఈ సందర్భంగా హైకోర్టు వ్యాఖ్యానించింది. 22 డిసెంబర్ 2010న రాజస్థాన్ ప్రభుత్వం గుజ్జర్లతోపాటు ఆర్థికంగా వెనుకబడిన వర్గాలకు 5+14 శాతం రిజర్వేషన్లను రద్దు చేస్తూ హైకోర్టు

తుది తీర్పు వెలువరించింది. ఈ తీర్పు రావడానికి ఐదు రోజుల ముందే 18 డిసెంబర్ నుంచి గుజ్జర్లు మళ్లీ ఆందోళన బాటపట్టారు.

ఇటీవల ప్రకటించిన ఎనభై వేల ఉద్యోగాల భర్తీలో తమకు ఐదు శాతం రిజర్వేషన్లు కల్పించాలని డిమాండ్ చేశారు. భరత్‌పూర్ జిల్లాలోని పిలుకపుర వద్ద ఢిల్లీ, ముంబై రైల్వే ట్రాక్‌పై 10 డిసెంబర్‌న వారు బైటాయించడంతో రవాణా వ్యవస్థ స్తంభించిపోయింది. రైల్వేకు క్రిస్టమస్, న్యూ ఇయర్ సందర్భంగా రావాల్సిన సుమారు పదిహేను వందల కోట్ల రూపాయల ఆదాయాన్ని వీరి ఆందోళన ఫలితంగా కోల్పోవాల్సి వచ్చింది. జాతీయ రహదారులు, రైల్వే ట్రాక్‌లపైనే గుజ్జర్లు కుటుంబ సమేతంగా రోజుల తరబడి బైటాయించడంతో జనజీవనం స్తంభించింది. దీంతో స్పందించిన రాష్ట్ర ప్రభుత్వం గుజ్జర్ల ప్రతినిధులను చర్చలకు ఆహ్వానించింది. చర్చలకు వెళ్లిన వారు విద్యా, ఉద్యోగ అవకాశాల్లో 5 శాతం రిజర్వేషన్ కల్పించాలని, ఆందోళనకారులపై కేసులు ఎత్తివేయాలని, పోలీసు కాల్పుల్లో మరణించిన వారి పిల్లలకు ఉద్యోగాలు ఇవ్వాలని, గుజ్జర్లు నివసించే ప్రాంతాల అభివృద్ధిపై ప్రత్యేక దృష్టి సారించాలనే డిమాండ్‌తో సహా పది డిమాండ్లను ప్రభుత్వం ముందు పెట్టారు. వారి ఆందోళనకు ప్రభుత్వం దిగిరాక తప్పలేదు. ప్రభుత్వ ఉద్యోగాల్లో గుజ్జర్లకు 1 శాతం రిజర్వేషన్‌ను తక్షణమే అమలు చేస్తామని, మిగతా 4 శాతం రిజర్వేషన్ కోటాపై అధ్యయన కమిటీ నివేదిక వచ్చాక నిర్ణయం తీసుకుంటామని తెలిపారు. దీంతో వారు ఆందోళనను తాత్కాలికంగా విరమించారు.

**గుజ్జర్ల ఉద్యమంలో చారిత్రక ఘట్టాలు**

3 సెప్టెంబర్ 2006 : విద్యా, ఉద్యోగాల్లో ప్రత్యేక రిజర్వేషన్ల కోసం రాజస్థాన్‌లోని హిండ్వాన్ రైల్వేస్టేషన్‌లో గుజ్జర్ల ఆందోళన

3 అక్టోబర్ 2006 : రిజర్వేషన్ల సాధనకై పోరాడేందుకు గుజ్జర్ టైగర్ ఫోర్స్ అనే సంస్థ ఆవిర్భావం

29 మే 2007 : పటోలి వద్ద నిర్వహించిన చక్కాజామ్ హింసాత్మకం. ఓ పోలీస్‌తో సహా ఐదుగురు గుజ్జర్ల మృతి.

23 జూన్ 2007 : రిజర్వేషన్ల కోసం పుష్కర్‌లో మహాపంచాయత్ నిర్వహించిన గుజ్జర్లు.

27 సెప్టెంబర్ 2007 :పాల అమ్మకాలను నిలిపివేసిన గుజ్జర్లు.

2 అక్టోబర్ 2007 : భరత్‌పూర్ జైల్ భరో ఆందోళనకు పిలుపునిచ్చిన గుజ్జర్ల నేత కల్నల్ కిరోరి సింగ్ భైంస్లా.

5 అక్టోబర్ 2007 : దుమారియా – ఫతేష్‌సింగుపుర మధ్య రైల్వే ట్రాక్‌ను తొలగించిన గుజ్జర్లు.

2 మార్చ్ 2008 : ఖేడ్లీలో మహా పంచాయిత్ నిర్వహణ

23 మార్చ్ 2008 : పీలుపురలో రైలురోకో నిర్వహించి రైళ్ల రాకపోకలను స్తంభింపజేసిన గుజ్జర్లు. వేర్వేరు ప్రాంతాల్లో జరిపిన పోలీసు కాల్పుల్లో 16 మంది గుజ్జర్లు చనిపోయారు. దౌసా జిల్లాలోని సికింద్రలో జరిపిన పోలీసు కాల్పుల్లో 20 మంది మరణించారు.

24 మే 2008 : గుజ్జర్ల నేత భైంస్లాను చర్చలకు ఆహ్వానించిన రాజస్థాన్ ప్రభుత్వం.

9 జూన్ 2008 : ప్రభుత్వ ప్రతినిధులకు, గుజ్జర్ల ప్రతినిధులకు మధ్య బయినాలో తొలిసారిగా చర్చలు.

13, 14 జూన్ 2008 : జైపూర్‌లో కొనసాగిన రెండు, మూడో రౌండ్ చర్చలు.

16, 17 జూన్ 2008 : ఈ తేదీల్లో జరిగిన నాలుగు, ఐదో దఫా చర్చల్లో పాల్గొన్న కల్నల్ భైంస్లా.

## యుద్ధ వీరులు గుజ్జర్లు

1857లో జరిగిన ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో గుజ్జర్లు అసమాన ధైర్యసాహసాలు ప్రదర్శించి వలస పాలకుల వెన్నులో వణుకు పుట్టించారు. దీంతో వలసపాలకులు గుజ్జర్ వారియర్ తెగను 'గుర్తించిన నేరస్త తెగ'లలో ఒకటిగా చేర్చారు. 1871లో రూపొందించిన ఈ 'నోటిఫైడ్ క్రిమినల్ ట్రైబల్ యాక్ట్' ప్రకారం గుజ్జర్ల సామాజిక హోదాను పాత రీతిలోనే ఖరారు చేశారు. స్వాతంత్ర్యానంతరం ఈ చట్టం పరిధిలోని తెగల్ని డీనోటిఫై చేసి ఎస్.టి. జాబితాలో చేర్చినప్పుడు గుజ్జర్ల విషయంలో మాత్రం అప్పటి హోంమంత్రి వల్లభ్‌భాయ్ పటేల్ అభ్యంతరం వ్యక్తం చేశారు. గుజ్జర్లను ఎస్.టి. జాబితాలో చేర్చితే వారికి యుద్ధవీరుల హోదా పోతుందనేది ఆయన అభ్యంతరం. 1993లో వీరిని ఒ.బి.సి. జాబితాలో చేర్చారు. 1950 నుంచి 1993 వరకు వారు తమను ఎస్.టి. జాబితాలో చేర్చాలని పదే పదే డిమాండ్ చేస్తూనే ఉన్నారు. 1971లో మరికొన్ని (ఆంధ్రలో ఎరుకల తెగకు అప్పుడే ఎస్.టి. హోదా కల్పించారు) తెగల్ని డీనోటిఫై చేసి ఎస్.టి.ల్లో చేర్చుతున్నప్పుడు, 1981 జనాభా గణన సమయంలో, 1984లో శివచరణ్ మాథుర్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు సైతం వీరిని ఒ.బి.సి.లుగానే గుర్తించాలని అక్కడి ఎస్.టి. జనాభాలో మెజారిటీగా ఉన్న మీనాలు ఒత్తిడి చేశారు. తమను ఎస్.టి.ల్లో చేర్చాలన్న గుజ్జర్ల డిమాండ్‌ను పట్టించుకోకుండా, వారు భయపడుతున్నట్లుగానే 1993లో వారిని ఒ.బి.సి. జాబితాలో చేర్చారు. 2003లో అశోక్ గెహ్లాట్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు గుజ్జర్లు తమ డిమాండ్‌ను మళ్లీ లేవదీశారు. అయితే అధికారం రాష్ట్రానికి లేదనీ, కేంద్ర ప్రభుత్వం వద్దకు వెళ్లమని ఆయన తన బాధ్యత నుంచి తప్పించుకున్నారు. ఈ నేపథ్యంలో గుజ్జర్లను ఎస్.టి. జాబితాలో చేర్చుతామని 2003 అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా వసుంధరా రాజే హామీ ఇచ్చారు. గుజ్జర్ల రాకుమారి, రాజపుట్ కోడలు అని వరుస కూడా కలుపుకొని ఆమె విజయసోపానాలను అధిరోహించారు. అయితే అధికారంలోకి వచ్చిన తరువాత మీనాల ఒత్తిడితో గుజ్జర్లకు ఎస్.టి. హోదా ఇచ్చే హామీని నెరవేర్చే బాధ్యతను దాటవేస్తూ వచ్చారు. గుజ్జర్లను ఎస్.టి. జాబితాలో చేర్చడం పట్ల మీనాలు అడ్డుపడడానికి కారణం వారు తమతో పోటీకొస్తారనే భయంతో కాక, ఇతర చిన్న చితక తెగలను మీనాలకు వ్యతిరేకంగా కూడగట్టి తమ గుత్తాధిపత్యాన్ని దెబ్బతీస్తారనే భయం.

22 ఆగస్ట్ 2008 : గుజ్జర్లు, గాడియా, లూహార్స్, రేబరిస్, బంజారాలకు ఐదు శాతం రిజర్వేషన్లు, ఆర్థికంగా వెనకబడిన వర్గాలకు 14 శాతం రిజర్వేషన్లు కల్పిస్తూ అసెంబ్లీలో బిల్లు ప్రవేశపెట్టాలని మహా పంచాయత్‌కు పిలుపునిచ్చిన గుజ్జర్లు.

10 జూన్ 2009 : మహారవర్ మహాపంచాయత్ నిర్వహించి, రిజర్వేషన్ల బిల్లు పెట్టాలని ప్రభుత్వానికి అల్టిమేటం ఇచ్చిన గుజ్జర్లు.

26 జూలై 2009 : టోడాభీమ్‌లోని పెంచాలలో భైంస్లా ఆధ్వర్యంలో మహాపంచాయత్.

జూలై 2009 : విద్యా, ఉద్యోగ రంగాల్లో గుజ్జర్లకు 5 శాతం ప్రత్యేక రిజర్వేషన్లు కల్పిస్తూ ఆర్డినెన్స్ జారీ చేసిన రాజస్థాన్ ప్రభుత్వం.

13 అక్టోబర్ 2009 : గుజ్జర్లకు రిజర్వేషన్లు కల్పించడంపై స్టే విధించిన రాజస్థాన్ హైకోర్టు. సుప్రీంకోర్టు మార్గదర్శకాలకు విరుద్ధంగా రాష్ట్ర ప్రభుత్వం 50 శాతానికి మించి రిజర్వేషన్లు కల్పించిందని వ్యాఖ్య.

26 మార్చ్ 2010 : ప్రత్యేక రిజర్వేషన్లపై హైకోర్టు తుది తీర్పు వెలువరించే వరకూ ప్రభుత్వం ప్రకటించిన 80,000 ఉద్యోగాలను భర్తీ చేయొద్దంటూ పుష్కర్ మహాపడావ్ కార్యక్రమం నిర్వహించిన గుజ్జర్ల నేత కిరోరిసింగ్ భైంస్లా.

*డా. బినాయక్‌సేన్‌కు యావజ్జీవ శిక్ష విధించడం ప్రజాస్వామిక వాదుల నోరు మూయించడానికేనని, పీడిత వర్గాలు ఐక్య పోరాటాల ద్వారా రాజ్యాన్ని ఎదుర్కోవాలని అంటున్నారు* **చిమ్మె జాన్ బర్నబాస్**

# బినాయక్‌సేన్‌కు శిక్ష దేనికి సూచన?

ఛత్తీస్‌ఘడ్ రాష్ట్ర రాజధాని రాయపూర్‌లోని రెండవ సెషన్స్ అదనపు జిల్లా న్యాయమూర్తి, ఆ రాష్ట్ర పి.యు.సి.ఎల్. అధ్యక్షుడు, ప్రముఖ చిన్నపిల్లల వైద్యుడు అయిన డా. బినాయక్‌సేన్‌కు 24 డిసెంబర్ 2010న యావజ్జీవ శిక్ష విధించడం అనేది, ప్రపంచవ్యాప్తంగా ఉన్న వివిధ హక్కుల సంఘాల, పీడిత వర్గ పక్ష ప్రజా పోరాటాలు నడిపే శక్తులందరికీ ఒక మింగుడుపడని విషయం. పదహారు సంవత్సరాలుగా న్యాయవాద వృత్తిలో ఉన్న నేను, వ్యక్తిగా, ఈ దేశపౌరునిగా, ఈ న్యాయ వ్యవస్థ స్వరూప, స్వభావాలను, న్యాయమూర్తుల విజ్ఞత గురించి, ఈ లేఖలో మీకు వివరించదలిచాను.

వివిధ ప్రజా పోరాటాలలో నేరారోపణలు ఎదుర్కొనే ప్రతి వ్యక్తికీ కోర్టులలో కేసుల విచారణను ఎదుర్కొంటున్న ప్రతీ పౌరునికీ న్యాయమూర్తులు వివిధ కేసుల పట్ల ఎలా వ్యవహరిస్తారనే ధోరణులను కూడా తెలుసుకోవాలి. న్యాయమూర్తులు ఈ మధ్య కాలంలో, అంటే దాదాపు పది పదిహేను సంవత్సరాల మధ్యకాలంలో ప్రజా పోరాటాలలో పాల్గొనే ప్రజాసంఘాల నాయకులు, వారి ఉద్యమాలు రాజ్యాంగపరిధిలో జరుగుతున్నవనే సత్యాన్ని పూర్తిగా మరచిపోయారు. ఇప్పుడున్న న్యాయాధీశుల్లో, దాదాపుగా 50-70 శాతం మంది ఈ రకమైన స్వభావాన్ని కలిగి ఉన్నారు. ఒక్క ఛత్తీస్‌ఘడ్‌లోనే కాదు, దేశవ్యాప్తంగా ఇదే స్వభావాన్ని కలిగి ఉన్నారు. ఇది రాజ్యాంగం కల్పించిన ప్రాథమిక హక్కుల భావన (ఆర్టికల్ 14-32) ఉల్లంఘన కిందకు వస్తుందని వారికి తెలియనిది కాదు. హక్కుల ఉద్యమకారులకు శిక్షలు వేయడం ద్వారా, ఆ న్యాయమూర్తులే ప్రజల, పౌర, ప్రజాస్వామిక హక్కులను ఉల్లంఘించినట్లు.

ఈ మధ్యకాలంలో న్యాయమూర్తుల్లో యాభై శాతం మంది అవినీతికి పాల్పడేవారే అనేది న్యాయవాద వృత్తుల్లో ఉన్న వారందరికీ తెలిసిన విషయమే. ఎ.ఐ.ఎ.డి.ఎం.కె. ప్రభుత్వ హయాంలో తమిళనాడులో హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా చేసిన పి.డి. దినకరన్ మూడు వందల ఎకరాల బినామీ పొలం సంపాదించాడు. దీనిపై కర్ణాటక రాష్ట్ర హైకోర్టు న్యాయవాద మిత్రులందరూ ఇప్పటికీ పోరాడుతున్నారు. ఇటీవలే రిటైరయి, ప్రస్తుత జాతీయ మానవ హక్కుల కమిషన్ (ఎన్.ఎచ్.ఆర్.సి.) చైర్మన్ కె.జి. బాలకృష్ణనన్ తమ్ముని పేరు మీద, కూతురు, అల్లుడు పేరు మీద బయటపడిన బినామీ ఆస్తుల గురించి బయటపడింది. అంతకుముందు ఛీఫ్ జస్టిస్‌గా పనిచేసిన వై.కె. సభర్వాల్ (సుప్రీంకోర్టు చీఫ్ జస్టిస్ రిటైర్డ్) కుమారుడు ఢిల్లీలో కాంప్లెక్స్ నిర్మాణంపై వివాదం. ఈ విధంగా ఎన్నైనా చెప్పుకోవచ్చు. కానీ బినాయక్ సేన్‌కి శిక్ష విధించడం వలన రాయపూర్ రెండవ అదనపు జిల్లా న్యాయమూర్తి కొన్ని ప్రభావాలకు లోనయినట్లు స్పష్టమవుతున్నది.

1) ఆ రాష్ట్ర పోలీసు యంత్రాంగం తనపై బనాయించినది అక్రమ కేసు అని, ఒక డాక్టర్‌గా, ఒక హక్కుల కార్యకర్తగా దేశ వ్యాప్తంగా గుర్తింపు పొందిన మేధావిగా, ఆయన సమర్పించిన లిఖిత వాదనలు ఆ న్యాయమూర్తి అంగీకరించకపోవడం, ఆయనలో ఉన్న అమానవీయ విలువలను తెలియజేస్తుంది.

2) సామ్రాజ్యవాద ప్రపంచీకరణలో భాగమైన విషసంస్కృతికి, పాలకులు, పెట్టుబడిదారీ వర్గాలకు దాసోహమైన పోలీసు వ్యవస్థ చేసిన నేరారోపణలను ఆ న్యాయమూర్తి సమర్థించడం, ఆయనకున్న విచక్షణాధికారాలు మరిచిపోయినట్లు మనకు కనబడుతోంది.

3) కోర్టులలో న్యాయం జరుగుతుందనే భావన భారతదేశంలో సామాన్య ప్రజానీకానికి ఇప్పటికీ ఉంది. అయితే న్యాయతత్వ శాస్త్రం బోధిస్తున్న సహజ న్యాయంకు రాయపూర్ రెండవ అదనపు న్యాయమూర్తి విరుద్ధంగా ప్రవర్తించినట్లు అర్థమవుతుంది.

4) న్యాయమూర్తులు, నేడున్న పరిస్థితుల్లో ఆదివాసులు, దళితులు, బడుగు బలహీనవర్గాల ప్రజలు ఆర్థిక స్వావలంబన కోసం, తమ జీవన మెరుగుదల కోసం తమ అస్తిత్వాన్ని ఈ దేశ రాజ్యాంగ పరిధిలోనే, రాజ్యాంగం కల్పించిన, పౌర, ప్రజాస్వామిక హక్కుల పరిధిలోనే

---

5 మే 2010 : సుప్రీంకోర్టు మార్గదర్శకాలకు లోబడి ప్రత్యేక వెనుకబడిన తరగతుల కింద గుజ్జర్లకు ఉద్యోగాల భర్తీలో 1 శాతం రిజర్వేషన్ వర్తింపజేసేందుకు అంగీకరించిన రాజస్థాన్ ప్రభుత్వం. మిగతా 4 శాతం రిజర్వేషన్ల అమలు అంశాన్ని కోర్టు తీర్పు వచ్చే వరకూ వేచి చూడాలని నిర్ణయం.

18 డిసెంబర్ 2010 : కోర్టు తీర్పు వస్తుందనగా మళ్లీ ఆందోళన బాట పట్టిన గుజ్జర్లు.

22 డిసెంబర్ 2010 : రాజస్థాన్ ప్రభుత్వం గుజ్జర్లతోపాటు ఆర్థికంగా వెనుకబడిన వర్గాలు 5+14 శాతం రిజర్వేషన్లు రద్దు చేస్తూ తీర్పునిచ్చిన హైకోర్టు.

5 జనవరి 2011 : పదిహేడు రోజుల ఉద్యమం అనంతరం ప్రభుత్వం పలు డిమాండ్లకు అంగీకరించడంతో తాత్కాలికంగా ఆందోళనకు తెర దించిన గుజ్జర్లు.

(రచయిత పాత్రికేయులు)

## డా. బినాయక్‌సేన్ సహచరి ప్రొ. ఇలీనా సేన్ లేఖ

మిత్రులారా,

భారతదేశం ఒక సోషలిస్టు, ప్రజాస్వామ్య, రిపబ్లిక్‌గా మారి అరవై ఒక్క సంవత్సరాలు నిండిన సందర్భంగా ఆ రాజ్యాంగ స్ఫూర్తి ప్రతిరోజూ ఎట్లా భగ్నం అవుతున్నదో మనం నిలువెల్లా చూస్తూ దిగ్భ్రాంతి చెందుతున్నాం. ప్రజల ప్రజాస్వామిక హక్కులు హరించ బడుతున్నాయి. రాజ్యాంగ నిర్మాతల సోషలిస్టు స్వప్నం ఉత్తరించ బడుతుంది.

డా. బినాయక్‌సేన్ కేసులో విధించిన శిక్షలనూ, నిర్బంధాన్నీ వ్యతిరేకిస్తూ మాట్లాడుతున్నప్పుడు ఈ విశాల నేపథ్యాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. దేశంలో రోజురోజుకూ నిత్య జీవిత వ్యవహారంగా మనం చూస్తున్న మహా అన్యాయాలను వ్యతిరేకించడంలో ఇది భాగమే.

అందువల్ల ఇవాళ మనం ఆయన విడుదలను కోరుతున్నామంటే, ఆకలిగొన్న వారందరి తరఫునా, సరైన ఆహారంగానీ, సరైన జీవనోపాధిగానీ లేని వారందరి తరఫునా మన గళాలను ఎత్తుతున్నామన్న మాట. అంతేకాదు, ప్రజల ప్రజాస్వామిక హక్కులనూ, ప్రాథమిక స్వేచ్ఛలనూ ఎత్తిపడుతూ సాధికారికమైన కృషి చేసినందుకు అణచివేతకు గురవుతున్న, చంపివేయబడుతున్న, హింసలకూ, అవమానాలకూ గురవుతున్న, అదృశ్యం చేయబడుతున్న, బెదిరింపులను ఎదుర్కొంటున్న, నిరంకుశంగా నిర్బంధానికీ, తప్పుడు నేరారోపణలకూ, నిఘాలకూ గురవుతున్న వాళ్లందరి కోసం మాట్లాడుతున్నామన్న మాట. నేను అధ్యాపకురాలిగా పనిచేస్తున్న మహారాష్ట్రలోని వార్ధాలో నా మీద కూడా ఇటువంటి వేధింపులు గత రెండు రోజులుగా అనుభవిస్తున్నాను.

శిక్ష పడిన తరువాత డా. బినాయక్‌సేన్ ఇప్పటికి నెలరోజులుగా జైలులో ఉన్నారు. ఆ శిక్షను తాత్కాలికంగానైనా పక్కనపెట్టే విచారణ ఇంకా సాగుతోంది. అయితే, ఇది మనకు మాత్రమే పరీక్షా సమయం కాదు. మన రాజకీయం, న్యాయవ్యవస్థలే ఇవాళ పరీక్షను ఎదుర్కొంటున్నాయి. వాటికి జవాబుదారీతనం, హేతుబద్ధత, న్యాయ దృక్పథం, సమానత్వ దృక్పథం ఉన్నాయా లేవా ఇప్పుడు పరీక్ష జరుగుతోంది.

చివరిగా, నేనూ, బినాయక్ తల్లీ, కూతుళ్లూ, సోదరులూ, ఆయన స్నేహితులందరూ అనుభవించిన ఈ ఉద్వేగభరిత కష్టకాలంలో మాకు చేయూతనందించిన మీ అందరికీ నా కృతజ్ఞతలు.

ఫైజ్ అహ్మద్ ఫైజ్ కవిత ఇప్పుడు గుర్తు చేయాలని నాకనిపిస్తోంది.

'మాట్లాడు నీ పెదాలింకా స్వేచ్ఛగానే ఉన్నాయి
మాట్లాడు నీ నాలుక ఇంకా నీదే
మాట్లాడు నీ బలమైన శరీరం ఇంకా నీదే
నీ ఆత్మ ఇంకా నీదే కనుక మాట్లాడు
ఒక్కసారి కమ్మరి కొలిమి చూడు
ఎగసే జ్వాలలు ఇనుమునే మెత్తన చేస్తున్నాయి
అవి ఒక్కొక్క తాళాన్ని పగలగొడుతూ
ప్రతి సంకెలను తుత్తునియలు చేస్తున్నాయి
మాట్లాడు కాలం మించిపోతోంది
నీ దేహమూ, మాటలూ అంతమయ్యే లోపల మాట్లాడు
మాట్లాడు ఇంకా నిజం బతికే ఉంది
మాట్లాడు నువ్వేం మాట్లాడవలసి ఉందో అది మాట్లాడు'
ఎప్పటికైనా గెలుపు మనదే.

**– ప్రొఫెసర్ ఇలీనాసేన్**
మహాత్మాగాంధీ అంతర్రాష్ట్రీయ హిందీ విశ్వవిద్యాలయ్,
వార్ధా, మహారాష్ట్ర. 26 జనవరి 2011

జరుగుతున్న పోరాటాలను సమర్థించే సాహసం కూడా చేయలేక పోతున్నారు. కనీసం న్యాయవ్యవస్థ పరిధిలోనైనా, స్పందించడం లేదంటే రాజ్య స్వభావానికి ఆ న్యాయమూర్తులు ఏ విధంగా అనుకూలంగా ఉంటున్నారో అర్థమవుతున్నది.

5) ప్రస్తుతం ఉన్న మెజారిటీ న్యాయమూర్తులు పోలీసు అధికారుల సాన్నిహిత్యంతోనే జీవిస్తున్నారు. వీరి అవసరాలను వారు తీరుస్తున్నారు. వారి కోర్కెలను వీరు మన్నిస్తున్నారు. ఒక మెజిస్ట్రేట్ స్థాయి నుంచీ, హైకోర్టు స్థాయి వరకూ, ఏదో ఒక స్థాయి పోలీసు ఉన్నతాధికారితో వారు సన్నిహితాన్ని ప్రదర్శిస్తుంటారు. న్యాయవాదులుగా, ఈ దేశంలోని ప్రజానీకానికి మనం తెలియజెప్పాలి. న్యాయవాదులుగా మనమే భయపడుతూ జీవిస్తే, అరవై మూడు సంవత్సరాల రాజ్యాంగ చరిత్రను, ఈ దేశ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను మనమే తుంగలో తొక్కే వారమవుతాం. ఈ దేశంలోని అవినీతి న్యాయ వ్యవస్థను ప్రశ్నించాలి – ఎదుర్కొనాలి – ప్రతిఘటించాలి – పోరాడాలి. రాజ్యాంగం కల్పించిన పౌర, ప్రజాస్వామిక హక్కుల పరిరక్షణలో ముందుండి కలిసికట్టుగా మనవంతు కర్తవ్యంగా పీడిత వర్గ ప్రజా పోరాటాలను నిర్మించాలి.

6) చాలామంది న్యాయమూర్తులు దళిత వ్యతిరేకత (కుల వివక్షత) భావన కలిగి ఉన్నారు. కొంతమంది హిందూ ఛాందస భావన (మైనారిటీ మతాలైన ముస్లిం, క్రైస్తవ వ్యతిరేకత) కలిగి ఉన్నారు. వీరిపట్ల జాగరూకతతో, అప్రమత్తంగా వ్యవహరించాలి. సమన్యాయ భావన (రూల్ ఆఫ్ లా) ను కొందరు న్యాయమూర్తులు తుంగలో తొక్కుతూ ఉంటారు.

రూల్ ఆఫ్ లా అంటే వారిష్టం వచ్చినట్లు ప్రవర్తించడమనే భావన కూడా చాలా మంది న్యాయమూర్తులలో ఉంది. ఇప్పటికీ అనేకమంది విద్యావంతుల్లో, న్యాయవాద వర్గాల్లో న్యాయమూర్తులంటే ఏదో తెలియని భయం, అభద్రత, ఒక దైవ సమానులుగా వారిని పూజించాలనే భావన, తపన వేధిస్తుంటాయి. మొదట అది పోవాలి. 'భారత ప్రజలమైన మేము' అని రాజ్యాంగ పీఠికలో మనం రాసుకున్న రాజ్యాంగం ఆత్మ (డా. అంబేద్కర్ రాజ్యాంగ పీఠికను రాజ్యాంగం 'ఆత్మ' అన్నాడు ఆనాటి ఆవిష్కరణ సభలో) ను మనం పరిరక్షించుకోవాలి. లేకుంటే బినాయక్‌సేన్ మాదిరిగా ఆంధ్రప్రదేశ్‌లో కూడా అదే పరిస్థితి రావచ్చు. కాబట్టి రాజ్యాంగ విలువల పరిరక్షణ కోసం, రాజ్యాంగహక్కుల పరిరక్షణ కోసం, దేశంలో జరుగుతున్న అన్ని పీడితవర్గ, ఆదివాసీ ప్రజా పోరాటాలను గౌరవిద్దాం. వారికి మన మద్దతును తెలియజేద్దాం. బినాయక్‌సేన్ తదితరులను శిక్షించిన న్యాయస్థానాలకూ, న్యాయ మూర్తులకూ గుణపాఠం నేర్పిద్దాం. భారతదేశంలో బలమైన హక్కుల ఉద్యమాన్ని నిర్మించడం ద్వారానే ఇది సాధ్యమవుతుందని నా ప్రగాఢ విశ్వాసం.

*(రచయిత ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ రాష్ట్ర కమిటీ సభ్యులు)* ✦

*పేదరికం, నిరక్షరాస్యతలను ఆసరాగా చేసుకొని, ప్రజల మౌలిక సమస్యలను పరిష్కరించకుండా, మతోన్మాదాన్ని రెచ్చగొట్టి, రాజ్యాధికారం చేపట్టాలనుకుంటున్న సంఘపరివార్ దుర్మార్గాలను వివరిస్తున్నారు* **ఎ. నర్సింహారెడ్డి**

# మనువాద రాజ్యస్థాపనకే హిందుత్వ ఉగ్రవాదం

**జా**తీయత, దేశభక్తి, సచ్ఛీలత మొదలయిన నినాదాలతో దేశ రాజకీయాలలోకి చొరబడిన సంఘ్‌పరివార్ శక్తుల మానసికస్థితిని, వారి భావజాలాన్ని అర్థం చేసుకోవాలంటే గత రెండు దశాబ్దాలుగా వారు కొనసాగించిన అకృత్యాలను పునశ్చరణ చేసుకోవడం అవసరం. దేశంలోని పలు ప్రాంతాల్లో మైనారిటీలపై, మహిళలపై, దళితులపై, ఆదివాసీలపై వారు కొనసాగించిన కొన్ని ఘటనలను పరిశీలించడం ఈ వ్యాస ఉద్దేశ్యం. సైనికాధికారులు, పోలీసులు, బ్యూరోక్రాట్స్ హిందూత్వ శక్తులతో మమేకమవుతున్న తీరు, రాజ్యం ఉదాసీనతను అర్థం చేసికొని మునుముందు అటువంటి ఘటనలు సంభవిస్తే మనం చేష్టలుడిగి కూర్చోకుండా ఉండాలంటే మనమేమి చేయాలో ఆలోచించాలి. లౌకిక, ప్రజాస్వామ్య విలువలను కాపాడుకోవాలంటే హిందుత్వ శక్తుల ఘోరాలను ప్రతిఘటించాలి. రాజ్య స్వభావాన్ని బట్టబయలు చేయాలి. పలు ప్రాంతాల్లో జరిగిన పేలుళ్లకు సూత్రధారి అయిన అసీమానంద వెల్లడించిన అంశాల వెలుగులో సంఘ్‌పరివార్ భావాలను, లక్ష్యాలను అర్థం చేసుకుందాం.

అజ్మీర్ (రాజస్థాన్), మక్కా మసీదు (హైదరాబాద్), మాలెగాంవ్ (మహారాష్ట్ర), మొదాసా (గుజరాత్) లలో జన సమ్మర్దంలో బాంబులు పేల్చి వందలాది మంది మరణానికి కారకులై, వందలాది మంది తీవ్రంగా గాయాల పాలవడానికి 'అభినవ భారత్' అనే హిందూత్వ సంస్థ కారణమనే అనుమానంతో గత కొంతకాలంగా అది నిఘా శాఖల విచారణ నెదుర్కొంటోంది. మక్కామసీదు (హైదరాబాద్) 2007లో జరిగిన పేలుళ్లకు సూత్రధారునిగా గుర్తించిన అసీమానంద (నబిసర్కార్) ను ఇటీవలనే పోలీసులు అరెస్ట్ చేశారు. మెజిస్ట్రేట్‌కు ఆయన సమర్పించిన వాంగ్మూలంలో 2007లో లాహోర్ - ఢిల్లీల మధ్య నడుస్తున్న సంఝౌతా ఎక్స్‌ప్రెస్ రైలుకు సంభవించిన పేలుళ్ల ఘటన వెనుక పరారీలో ఉన్న హిందుత్వ ఉగ్రవాదులైన రాంచంద్ర కల్సంగ్రా, సందీప్ డాంగేలకు సంబంధముందని పేర్కొన్నాడు. గుజరాత్‌లోని వల్సాద్‌లో రితేశ్వర్ ఇంటి వద్ద జూన్ 2006లో రితేశ్వర్, సాధ్వీ ప్రజ్ఞ, సునీల్ జోషి వంటి సంఘ్ పరివార్ సభ్యులతో తాను సమావేశమయ్యానని మెజిస్ట్రేట్ ముందు 2010 డిశంబర్ 18న అసీమానంద వెల్లడించాడు. 'బాంబ్ కా జవాబ్ బాంబ్ సే దేనా చాహియే' (బాంబులకు జవాబు బాంబులతోనే ఇవ్వాలి) అని అక్కడ ఉన్న ప్రతీవారు అంగీకరించారని తెలిపాడు.

ఆర్ఎస్ఎస్ నిందితుల వద్ద దొరికిన టేపులలోని సమాచారాన్ని బట్టి ఆ టేపుల్లో ప్రస్తావించబడ్డ 8 మంది అధికారుల్లో కనీసం నలుగురు గూఢచర్యం చేసినవారని స్పష్టమవుతుంది. పురోహిత్, ఉపాధ్యాయలు కాకుండా సర్వీసులో ఉన్న ఇద్దరు బ్రిగేడియర్లు, ముగ్గురు కల్నల్‌లు, ఇద్దరు మేజర్లు ఇందులో ఉన్నారు. వీరిలో ఒకే ఒక్క కల్నల్ మాత్రమే జాతీయ దర్యాప్తు సంస్థ (నేషనల్ ఇన్వెస్టిగేషన్ ఏజెన్సీ) ద్వారా దర్యాప్తు నెదుర్కొంటున్నారు. మిగిలిన వారిపై యింకా దర్యాప్తు ప్రారంభం కాలేదు. తామందరం ఒకే పడవలో ఉన్నామని, అంతేకాదు, భారత సైన్యం ప్రధానాధికారిగా పనిచేసిన జనరల్ జె.జె.సింగ్ కూడా 2007 సెప్టెంబర్ వరకు కార్యకలాపాలల్లో తనతోనే ఉన్నాడని లెఫ్టినెంట్ కల్నల్ పురోహిత్ ఆ టేపుల్లో చెప్పటం జరిగింది.

పురోహిత్ తెలియజేసిన మరో విషయం మరీ ఘోరమైనది. మన భారతీయ కెప్టెన్లు నలుగురిలో ఒకరు శిక్షణ నిమిత్తం ఇజ్రాయిల్ సందర్శించి ఇజ్రాయిల్ ప్రభుత్వాన్ని 4 అంశాలలో సహకరించాలని కోరారు. 1) నిరంతరంగా ఆయుధాలు సరఫరా చేయాలి, తగిన శిక్షణ ఇవ్వాలి. 2) టెల్అవీవ్‌లో కాషాయ జెండా ఎగిరే సంఘ్‌పరివార్ కార్యాలయం ఏర్పాటు. 3) రాజకీయ ఆశ్రయం ఇవ్వాలి. 4) హిందూ రాజ్య స్థాపనకు సాగుతున్న లక్ష్యాని కనుగుణంగా ఐక్యరాజ్య సమితిలో మద్దతునివ్వాలి. ఈ నాలుగు అంశాలపై చాలా సానుకూలంగా ఇజ్రాయిల్ స్పందించిందనీ, ఆయుధాలను, రాజకీయ ఆశ్రయాన్ని ఇవ్వడానికి వాగ్దానం చేసిందని పురోహిత్ ఈ టేపుల్లో పేర్కొన్నాడు. తెహల్కా పత్రిక హిందూత్వ ఉగ్రవాదానికున్న నెట్‌వర్క్ గురించి ఆందోళనకరమైన అంశాలను బయట పెట్టింది. ప్రధానంగా భారత సైనికదళంపై దీని ప్రభావాన్ని తెలియజేయడమే గాక భారత సైన్యంలో ఉన్న అత్యంత ప్రమాదకరమైన అతిపెద్ద గొలుసులో పురోహిత్ ఒక చిన్న లింకు మాత్రమేనా అన్న ప్రశ్నను తెహల్కా ముందుకు తెచ్చింది.

భారత ప్రభుత్వం, ఈ దేశ మీడియా భారతదేశంలో సంభవిస్తున్న తీవ్రవాద సంఘటనలన్నిటికీ పాకిస్తాన్ గూఢచారి సంస్థలే కారణమంటున్నట్లు, పాకిస్తాన్ క్రీడాకారులకు బాలీవుడ్‌లోని తారలకు మధ్య జరుగుతున్న ప్రేమాయణాలకు కూడా ఈ సంస్థలే కారణమంటా యేమో. ఈ ఆరోపణలలోని అవాస్తవాల గురించి వదిలేద్దాం. ఎందుకంటే దాని వలన పాకిస్తానే నిందలపాలయింది. భారతదేశంలోని ఈ సమస్యలకు కారణాలన్నీ దేశీయమైనవేనని అన్ని వేళలా పాకిస్తాన్ చెబుతూనే ఉన్నది. ఇప్పుడు తీవ్రవాద ఘటనల్లో హిందుత్వ మిలిటెంట్ల గురించిన వాస్తవాలు బయట పడిన తర్వాత 'చాటుగా నక్కిన పిల్లి నలుగురి కంటా పడిందని' మాత్రం చెప్పగలం.

ఆర్.ఎస్.ఎస్. కార్యకర్త, అనేక ఘటనలకు సూత్రధారి అయిన సునీల్ జోషిని గుర్తు తెలియని వ్యక్తులు హత్య చేశారు. జోషి హత్య గురించి తెలియగానే విచక్షణ మరిచిన హిందుత్వ తీవ్రవాదులు ప్రతీకార

చర్యకు ఒడిగట్టారు. జోషి హత్యతో సంబంధం లేని, ఆయన ఊరు పేరు తెలియని ఒక ముస్లిం కుటుంబాన్ని బలి తీసుకున్నారు. డిసెంబర్ 30, 2007న సుతార్ ఖేడా గ్రామానికి చెందిన 65 ఏళ్ల రషీద్ షా ను కాల్చి చంపారు. ఆయన 27 సంవత్సరాల కొడుకు జలీల్ షాను సజీవంగా దహనం చేశారు. జోషి హత్య జరిగిన మరుసటి రోజు బంద్‌కు పిలుపునిచ్చిన మతోన్మాదులు ఈ అఘాయిత్యానికి ఒడిగట్టారు. అనేక దాడులకు సూత్రధారి, ఆర్ఎస్ఎస్ మాజీ ప్రచారక్ సునీల్ జోషీ ద్వారా రహస్యాలు వెలుగులోకి వస్తాయని ఆయన సహచరులే హత్య చేసినట్లు మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఇటీవలనే ప్రకటించింది.

మాలెగాంవ్ పేలుళ్ల నిందితురాలు సాధ్వి ప్రజ్ఞా ఠాకూర్ అమాయకురాలని, మహారాష్ట్ర ప్రభుత్వం ఆమెను నిరాధారమైన ఆరోపణలతో వేధిస్తోందని రాజ్‌నాథ్‌సింగ్ ఆరోపించారు. అయితే ముంబై దాడులు ఆర్ఎస్ఎస్. - మొస్సాద్-సిబిఐ సంయుక్త కుట్రగా దిగ్విజయ్‌సింగ్ అభివర్ణించారు. హేమంత్ కర్కరే పరిశోధనలో, అభినవ్ భారత్, మాజీ ఎబివిపి కార్యకర్త సాధ్వి ప్రజ్ఞాఠాకూర్ సింగ్, సైనికాధికారి పురోహిత్, ఆర్.ఎస్.ఎస్. కార్యకర్త సునిల్‌జోషి, ఇంద్రేష్, స్వామి అసీమానందలు పేలుళ్లకు సూత్రధారులుగా పేర్కొన్నాడు. కేసులన్నీ ఇప్పటికీ ఎన్ఐఎ విచారణలో ఉన్నాయి. కొంతమంది పోలీస్ అధికారులు, సైనికాధికారులు, బ్యూరోక్రాట్స్, సంఘ్ పరివార్ నాయకులు బహిరంగంగా హిందుత్వ ఉగ్రవాదుల చర్యలను సమర్థిస్తూ, అన్ని సంఘటనలకు ముస్లింలను బాధ్యులుగా పేర్కొనే ప్రకటనలు విచారణ అధికారులను పక్కదారి పట్టించే విధంగా ఉన్నాయి.

మహారాష్ట్ర మాలెగాంవ్‌లో పేలుళ్లకు కారకులుగా హిందుత్వ తీవ్రవాదులను మొదటిసారి అరెస్ట్ చేసిన పోలీస్ అధికారి హేమంత్ కర్కరే సంఘ్ పరివార్, శివసేన బెదిరింపులతో పాటు ఫోన్ ద్వారా హిందుత్వ ఉగ్రవాదుల బెదిరింపులను ఎదుర్కొన్నాడు. ఆయన హిందుత్వ ఉగ్రవాదులకు భారత సైనిక, పోలీస్ అధికారులతో సంబంధాలున్నట్లు కూడా పేర్కొన్నాడు. ఆయన ముంబాయి దాడుల్లో (26 నవంబర్ 2008) అనుమానాస్పదంగా చనిపోయాడు.

భిన్న సంస్కృతులు, భాషలు, మతాలు, ఆచారాలకు నిలయం భారతదేశం. మతాలు, భాషలు వేరైనా ప్రజలు వందల ఏళ్లుగా శాంతియుతంగా సహజీవనం చేశారు. అన్యాయం, వివక్ష, పేదరికం, నిరుద్యోగం, సాంఘికార్థిక అసమానతలు, అసమాన పంపిణీ, అధికార కేంద్రీకరణ, పాలకుల నియంతృత్వ ఆధిపత్య వైఖరులు సమాజంలో చోటు చేసుకున్న అశాంతికి, అసహనానికి ప్రధాన కారణం. అయితే పాలకులు, పార్టీలు ప్రజల సమస్యలు పరిష్కరించడానికి బదులు రకరకాల ఆశలు చూపుతూ మతతత్వాన్ని రెచ్చగొడుతూ ప్రజల నుండి ఓట్లు రాబట్టుకొని అధికార అందలానికెక్కడానికి చేస్తున్న కుతంత్రాల్లో భాగంగానే మతాలకు, కులాలకు మధ్య ఘర్షణలు సృష్టించి అసలు సమస్యను పక్కదారి పట్టిస్తున్నారు. నిజానికి మతం వేరు, మతతత్వం వేరు. మతం సంస్కృతిలో భాగం. మత విశ్వాసాలు, ఆచారాలు, సంప్రదాయాలు వ్యక్తిగతమైనవి. అయితే ఒకే మతస్తులందరికీ స్వమతాభిమానం ఉంటుంది. మతతత్వం మత ఛాందసత్వానికి, విద్వేషానికి మూలం. మతతత్వంలోని సాంస్కృతికాంశాలు భూస్వామ్య సమాజపు మత, కుల వ్యవస్థలో ఉండగా, వలస పాలకులు తమ 'విభజించి పాలించు' విధానాల ద్వారా రాజకీయ భావజాలాన్ని పెంచి పెద్దచేశారు. ఈ విభజన మతతత్వానికి, భిన్న మతాల మధ్య విద్వేషానికి స్వాతంత్ర్య ఉద్యమ కాలంలోనే మన దేశంలో బీజాలు పడ్డాయి. దీని పరాకాష్ట దేశ విభజన సందర్భంలో మనం చవిచూశాం. మతతత్వానికి శాస్త్రీయ పునాది లేదు. హిందూ మతతత్వం సమాజంలోని వర్గ అంతరాలను, కుల వివక్షను, లింగ వివక్షను చూడ నిరాకరిస్తుంది. హిందూమతంలో స్త్రీలు, పురుషులు, అన్ని వర్గాలు, అన్ని కులాలు ఒక్కటేనని, వీరందరి రాజకీయ ఆర్థిక సాంస్కృతిక ప్రయోజనాలు ఒక్కటేనని హిందూ మతతత్వం భావిస్తుంది. హిందువుల ప్రయోజనాలకు, సంక్షేమానికి భిన్నంగా ముస్లింలకు వైరుధ్యంతో కూడిన ప్రయోజనాలు ఉంటాయని భావించడం హిందూ మతతత్వానికి పునాది. ఈ విధమైన అవగాహన ఆయా మతస్తులలో కలిగే తప్పుడు చైతన్యం వల్ల ఏర్పడుతుందని సామాజిక శాస్త్రవేత్తలు సిద్ధాంతీకరించారు.

పేదరికం, పీడన, నిరక్షరాస్యత, అణచివేత అన్ని మతస్తుల ప్రజలకుండే సాధారణ సమస్యలు. ముస్లింల పేదరికం ఒక విధంగాను, సిక్కుల పేదరికం ఒక విధంగాను, అదే పేదరికం హిందువులకు మరోవిధంగా ఉండదు. ప్రజా సమస్యలకు మత వాసనలుండవు. కాని మతతత్వ వాదులు ప్రజా సమస్యలకు కారణం ఇతర మతస్తుల వల్ల ఉత్పన్నమైనట్లు తప్పుడు ప్రచారం చేస్తారు. ఇది మత ద్వేషాన్ని పెంచుతుంది. దీన్ని మతతత్వవాదులు తమ స్వప్రయోజనాలు నెరవేర్చుకోవడానికి వాడుకుంటారు. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే, వివిధ మతాలలోని ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి అందరూ సమిష్టిగా ఉద్యమించాలన్న ఆలోచనకు మతతత్వవాదులు అవకాశమివ్వరు. ఈ విధంగా పేద ప్రజలను విభజించి తమ రాజకీయ పబ్బం గడుపుకుంటారు. ఈ విధంగా మెజారిటీ మతతత్వం మైనారిటీ మతతత్వానికి ఊతమిస్తుందని జవహర్‌లాల్ నెహ్రూ ఏనాడో హెచ్చరించాడు. నిజానికి మైనారిటీ మతతత్వం భయం వల్ల, అభద్రత వల్ల కలుగుతుందని సామాజిక పరిశోధకులు చెప్తూవున్నారు.

అధికారం కోసం అవసరమైన ఓట్లను రాబట్టుకొని మతతత్వ రాజకీయాల ద్వారా అధికారాన్ని కైవసం చేసుకోవాలనే లక్ష్యంతో 1980 దశకం నుండి బి.జె.పి. పావులు కదిపింది. భారతీయ జనతాపార్టీ హిందువులు లక్ష్యంగా 'రామజన్మభూమి' నినాదాన్ని చేపట్టింది. దేశమంతటా తిరిగి విస్తృతంగా ప్రచారం చేసింది. ఆర్ఎస్ఎస్ అనుబంధ హిందుత్వ సంస్థలన్నీ భారీ సంఖ్యలో పాల్గొన్నాయి. హిందువుల్లో ముస్లిం వ్యతిరేక భావజాలాన్ని పెంపొందించాయి. పార్లమెంట్‌లో కేవలం రెండు సీట్లున్న బి.జె.పి. 1989 పార్లమెంట్ ఎన్నికల్లో ఏకంగా 90 సీట్లను కైవసం చేసుకుంది. 'రామజన్మభూమి' నినాదం కురిపించిన ఓట్లతో తన్మయత్వం చెందిన బి.జె.పి. మరింత రాజకీయ లబ్ధిపొందడానికి అయోధ్యలో వివాదాస్పద స్థలంలో రామాలయాన్ని నిర్మించాలని అద్వానీ 1991లో దేశవ్యాప్తంగా రథయాత్రను చేపట్టాడు. హిందుత్వ సంస్థలన్నీ అద్వానీ వెన్నంటి కదిలాయి. అన్ని రాష్ట్రాల్లో పర్యటించి హిందుత్వ భావజాలాన్ని ప్రచారం చేశాడు. విద్వేషపూరిత ప్రసంగాలతో హిందూ ముస్లింల మధ్య వైషమ్యాలు పెరిగి ఘర్షణలు తలెత్తాయి. ఫలితంగా 300 ప్రాంతాల్లో మతకల్లోలాలు సంభవించాయి. ఈ ఘాతుకాలకు సుమారు 1300 మంది మృతిచెందారు. అల్లర్ల నివారణకు వి.పి.సింగ్ ప్రభుత్వం అద్వానీని అరెస్ట్ చేయించింది. దాంతో ఆగ్రహించిన బి.జె.పి. కాంగ్రెస్‌తో చేతులు కలిపి వి.పి.సింగ్ ప్రభుత్వాన్ని కూలదోసింది.

పార్లమెంట్‌కు 1991లో మధ్యంతర ఎన్నికలు జరిగాయి. అద్వానీ రథయాత్ర దేశమంతటా రక్తపాతాన్ని సృష్టించింది. ముస్లిం మైనారిటీలు ఎంతోమంది హత్యలకు గురయ్యారు. ఈ నరమేధంలో

బి.జె.పి.కి ఓట్ల పంట పండింది. ఉత్తరప్రదేశ్‌లో కల్యాణ్‌సింగ్ ముఖ్యమంత్రి అయ్యాడు. డిసెంబర్ 1992లో బాబ్రీ మసీదును నేలమట్టం చేశారు. బాబ్రీ విధ్వంసం దేశాన్ని అగ్నిగుండంగా మార్చింది. పేట్రేగిన హిందూత్వ ఉగ్రవాదులు ముందస్తు వ్యూహం ప్రకారం బొంబాయి, సోలాపూర్ తదితర ప్రాంతాలలో వేలాదిమంది ముస్లింలను ఊచకోత కోశారు. మహిళలపై సామూహిక అత్యాచారాలకు పాల్పడ్డారు, గృహ దహనాలు చేశారు. కేంద్ర ప్రభుత్వం బాబ్రీ విధ్వంసంపై జస్టిస్ లిబర్‌హాన్ కమిషన్ వేసి చేతులు దులుపుకుంది. ఈ వివాదం ముస్లిం ప్రజల ఆగ్రహానికి, అశాంతికి కారణభూతంగా మిగిలింది. మరోవైపు ప్రధాని రాజీవ్‌గాంధీ 1986లో రామమందిరం తాళాలు తెరిపించడం, 1989లో శిలాన్యాసానికి అనుమతించడం, చివరిగా 1992 డిసెంబర్ 6న బాబ్రీ మసీదు కూల్చివేతను నిలువరించలేకపోవడం ద్వారా కేంద్రం లోని కాంగ్రెస్ ప్రభుత్వం మతతత్వం పట్ల తన ఉదాసీనతను చాటుకుంది.

భారతదేశంలోని ముస్లింలను ద్వితీయశ్రేణి పౌరులుగా చిత్రించడానికి హిందు మతతత్వవాదులు ప్రయత్నించి, సామాన్య ప్రజానీకంలో ఈ భావాన్ని పెంచడంలో ఓ మేరకు కృతకృత్యులయ్యారు. ముస్లింలంటేనే దేశద్రోహులనీ, పాకిస్తాన్ భక్తులనీ ప్రచారానికి పూనుకొన్నారు. యావత్తు ముస్లిం ప్రజానీకాన్ని తీవ్రవాదులుగా ముద్ర వేయడానికి సిద్ధపడ్డారు. అందువల్లనే దేశంలో ఎక్కడ పేలుళ్లు జరిగినా పోలీసులు, హిందూత్వ ఉగ్రవాదులు, మీడియా వెంటనే ఇది ముస్లిం తీవ్రవాదుల పని అని ఎలాంటి ప్రాథమిక దర్యాప్తు జరుపకుండానే ఒక నిర్ధారణకు రావడం జరుగుతోంది. అలాగే ముస్లిం యువకులను అకారణంగా అరెస్ట్ చేసి, పోలీస్‌స్టేషన్‌లో హింసించి, బెయిల్ నిరాకరిస్తూ, తప్పుడు కేసుల్లో జైలు శిక్షకు గురించే సంఘటనలు ఎన్నో ఉన్నాయి.

2002 ఫిబ్రవరి 27న అయోధ్య నుండి తిరిగి వస్తున్న కొందరు భక్తులు రైల్వేస్టేషన్‌లో ఒక బాలికపై అత్యాచారం చేశారు. అదే రోజు గోద్రాలో గుర్తు తెలియని దుండగులు రైలు బోగీని దగ్ధం చేశారు. ఈ ఘోర ఉదంతంలో 56 మంది ప్రాణాలు కోల్పోయారు. పాకిస్థాన్‌కు చెందిన ఐ.ఎస్.ఐ. ఇస్లామిక్ తీవ్రవాదులే ఇందుకు కారణమని సంఘ్‌పరివార్ నాయకులు ఆరోపించారు. అయితే పోలీసుల దర్యాప్తులో ఫోరెన్సిక్ నివేదిక వేరొక రకంగా తెలిపింది. ఈ మొత్తం ఉదంతమంతా ఒక మిస్టరీగా ఉంది. గోద్రా దుర్ఘటన జరిగిన వెనువెంటనే గుజరాత్‌లో నరేంద్రమోడీ నాయకత్వంలో కాషాయ ముష్కరులు నరమేధం సృష్టించారు. ఆర్ఎస్ఎస్, భజరంగ్‌దళ్, శివసేన, బిజెపి హిందూత్వ ఉగ్రవాద మూకలు 72 గంటల పాటు అమాయక మైనారిటీ ప్రజల్ని ఊచకోత కోశారు. సజీవ దహనాలు, లూటీలు, మహిళలపై అత్యాచారాలు జరిపారు. మైనారిటీలకు చెందిన ఇళ్లు, షాపులు, ఫ్యాక్టరీలు, వాహనాలు విధ్వంసాలు గావించారు. ఫలితంగా వందల కోట్ల ఆస్తినష్టం జరగడమే కాకుండా లక్షలాదిమంది స్వదేశంలోనే శరణార్థులై శిబిరాల్లో తల దాచుకోవాల్సి వచ్చింది. గుజరాత్‌లో ముస్లిం జాతి హత్యాకాండకు సంబంధించిన ఎన్నో వాస్తవాలను తెహల్కా పత్రిక బయట పెట్టింది. అయినా ఎవరికీ శిక్ష పడలేదు. సుమారు 2000 మంది పిల్లలు, వృద్ధులు, అమాయకులు హత్యకు గురయ్యారు. గుజరాత్ నరమేధంపై విశ్వ హిందుపరిషత్ గుజరాత్ రాష్ట్ర అధ్యక్షుడు కేశవరాం కాశీరాం శాస్త్రి రీడిఫ్.కాం కు ఇచ్చిన ఇంటర్వ్యూలో తానే అన్ని ఒప్పేసుకున్నాడు. 'అవును, మావాళ్లే చేశారు' అన్నాడు. 'కొంచెం అతి చేస్తే చేసి ఉండవచ్చు. కానీ మా వాళ్లు కదా, వాళ్లను తప్పెట్లా పడతాం?' అన్నాడు. 'ఇది దొమ్మీ కాదు, హత్యా కాండ కాదు, తిరుగులేని ఉప్పెన, ఎవరూ ఆపలేని ఉప్పెన' అన్నాడు. 'పోలీసులు కూడా హిందువులే కాబట్టి మావాళ్లు చేస్తుంటే చేసుకోనీలే అని ఊరుకున్నారు' అన్నాడు.

1993 ముంబాయి అల్లర్ల సందర్భంగా 900 మంది హతులయ్యారు. దాదాపు 4000 కోట్ల రూపాయల ఆస్తినష్టం సంభవించింది. ఈ నరమేధానికి శివసేన - ఆర్ఎస్ఎస్ - బి.జె.పి. నాయకులదే బాధ్యతంటూ జస్టిస్ శ్రీకృష్ణ నివేదిక పేర్కొంది. 1969 అహ్మదాబాద్ అల్లర్లపై విచారణ నిర్వహించిన జస్టిస్ పి. జగన్మోహనరెడ్డి కమిషన్, 1970 జలగాంవ్-మహద్-భీవాండి ఘటనల్ని విచారించిన జస్టిస్ విద్యావతి కమిషన్, జంషెడ్‌పూర్ 1979 ఘటనలపై విచారించిన జస్టిస్ నారాయణ్ కమిషన్, 1982 కన్యాకుమారి ఘటనలపై విచారించిన జస్టిస్ పి. వేణుగోపాల్ కమిషన్, 1986 నాసిక్, ఉదయపూర్ ఘటనలపై విచారించిన జస్టిస్ ఎఎస్ మప్లాంకర్ కమిషన్లు గతంలో జరిగిన అల్లర్లకు సంఘ్ పరివార్ నాయకులే కారకులంటూ పేర్కొన్నాయి.

హైదరాబాద్‌లో 2007 మే 18న మక్కా మసీదులో శుక్రవారం ప్రార్థనల సమయంలో సెల్ ఫోన్‌కు అనుసంధానం చేసిన పైప్ బాంబు పేలింది. ఐఎస్ఐ తీవ్రవాదులని అనుమానించి పలువురు ముస్లిం యువకులను పోలీసులు అదుపులోకి తీసుకొని విచారణ జరిపారు. అయితే మాలెగాంవ్ పేలుళ్ల కేసులో విచారణ జరిపిన నాటి మహారాష్ట్ర యాంటీ టెర్రరిస్టు స్క్వాడ్ చీఫ్ హేమంత కర్కరే ఆనాడే మాలెగాంవ్, అజ్మీర్ దర్గాతోపాటు, మక్కా పేలుళ్లకూ హిందూత్వ ఉగ్రవాదులే కారణమని గుర్తించారు. ఈ కోణంలో దర్యాప్తు జరిపిన సిబిఐ 'అభినవ్ భారత్' అనే సంస్థకు చెందిన లోకేశ్ శర్మ, దేవేంద్ర గుప్తాలతో పాటు స్వామి అసీమానందను అరెస్ట్ చేసింది. వీరితో పాటు సందీప్ డాంగే, సునిల్ జోషి, రాంచంద్ర కల్సంగ్రాలకు సంబంధం ఉందని గుర్తించింది. వీరికి ఆర్ఎస్ఎస్ నాయకుడు ఇంద్రేష్ కుమార్‌తో సంబంధాలు ఉన్నట్లు వెల్లడైనందున ఆయనను సిబిఐ గత డిసెంబర్ 23న ప్రశ్నించింది. గత నాలుగేళ్లుగా ఆయన ఆర్ఎస్ఎస్ జాతీయ వర్కింగ్ కమిటీ సభ్యునిగా ఉన్నారు. సిబిఐ కార్యాలయానికి రాగానే ఆయన ముందే సిద్ధం చేసుకున్న ఓ పత్రం విలేకరులకు చదివి వినిపించారు. తనపై సిబిఐ చేస్తున్న విచారణ కాంగ్రెస్ కుట్ర అని ఇంద్రేష్ ఆరోపించారు. గత కొంతకాలంగా తన, ఆర్ఎస్ఎస్ ప్రతిష్టను మంటగలిపేందుకు కాంగ్రెస్ పార్టీలోని కొందరు నాయకులు ప్రయత్నిస్తున్నారన్నారు. మక్కామసీదు బాంబు పేలుళ్లకు సంబంధించి ఆర్ఎస్ఎస్ పూర్వ వాలంటీర్ సునీల్ జోషి, దేవేంద్రగుప్తలకు ప్రమేయమున్నట్లు సాక్ష్యాధారాలు వెలుగులోకి వచ్చాయి. గత సంవత్సరం మే మాసంలో దేవేంద్రగుప్తను అరెస్ట్ చేశారు. బెంగాల్‌లో కొన్న రెండు 'సిమ్' కార్డులు రెండు బాంబులను పేల్చడానికి ఉపయోగించినట్లు ఆధారాలు దొరికాయి. వాస్తవాలు బయటపడ్డ తర్వాతనైనా సంఘటనలను నిష్పక్షపాతంగా, హేతుబద్ధంగా ఆలోచించకుండా అన్నింటికి ముస్లింలనే దోషులుగా భావించే వారికి కనువిప్పు కలగాలి.

దేశంలో బాంబు పేలుళ్ల ద్వారా హింసాకాండకు పాల్పడుతున్న హిందూత్వ ఉగ్రవాద సంస్థలకు చెందిన అసీమానంద మెజిస్ట్రేట్ ముందు వెల్లడించిన అంశాలు ప్రజాస్వామికవాదులను తీవ్ర ఆందోళనకు గురిచేశాయి. ఆయన వెల్లడించిన అంశాల ద్వారా మాలెగాంవ్, అజ్మీర్, మక్కా మసీదు పేలుడు ఘటనల వెనుక హిందూత్వ తీవ్రవాదుల హస్తం ఉందని మరోసారి రుజువైంది. సంఝౌతా ఎక్స్‌ప్రెస్ పేలుడు ఘటనకు పాల్పడి 68 మంది ప్రాణాలు తీసిందీ హిందూ ఉగ్రవాద సంస్థలేనని

అంగీకరించడం జరిగింది. హిందూ మతానికి సంబంధించి తప్పుడు సమాచారం చెబుతున్నారంటూ నిరసన వ్యక్తం చేసిన సంఘ్ పరివార్ ఇప్పుడు ఈ విధ్వంసకర శక్తులు తమలోనే ఉన్నాయన్న వాస్తవాన్ని అంగీకరిస్తోందని ఆర్ఎస్ఎస్ చీఫ్ మోహన్ భగవత్ పేర్కొనడం ఇందుకు ప్రత్యక్ష ఉదాహరణ.

2002లో గుజరాత్‌లో జరిగిన మారణకాండను సమర్థిస్తూ ఇటువంటి ప్రయోగాలను దేశమంతటా అమలు చేస్తామని ప్రవీణ్ తొగాడియా, మేధావులుగా గుర్తింపు ఉన్న అరుణ్ జైట్లీ, జస్వంత్ సింగ్, పెద్ద మనుషులుగా కనిపించే సుష్మా స్వరాజ్, వెంకయ్య నాయుడు వంటి వారు పేర్కొనడం జరిగింది. ఒడిషాకు సంబంధించిన బజరంగ్ దళ్ రాష్ట్ర కన్వీనర్ సుభాష్ చౌహాన్ ఒక సామాజిక శాస్త్రవేత్తతో మాట్లాడుతూ 'భారతదేశంలో ఒడిషా రెండవ హిందూ రాష్ట్రం' అన్నాడు. క్రిస్టియన్ మైనారిటీలపై ఒడిషాలోని కంధమాల్ జిల్లాలో 2007 ఆగస్ట్‌లో, సెప్టెంబర్‌లో, కర్ణాటకలో హిందూత్వ ముష్కరులు దాడులు చేశారు. ఒడిషాలోని కంధమాల్‌లో ఈ దాడులు, హత్యాకాండ, విధ్వంసం ఆగస్ట్ 23న లక్ష్మణానంద హత్యతో ప్రారంభమైనాయి. లక్ష్మణానంద ఒక హత్య కేసులో నిందితుడై ఉత్తరప్రదేశ్‌లోని హరిద్వార్‌లో సాధువుగా మారి, విశ్వహిందు పరిషత్ ప్రోత్సాహంతో వనవాసి కళ్యాణ్ ఆశ్రమాలను నిర్వహించడానికి 1969లో కంధమాల్ జిల్లాకు వచ్చాడు. క్రైస్తవులను బలవంతం చేస్తూ, వేధింపులకు గురిచేస్తూ, వారిని తిరిగి హిందూ మతంలోకి చేర్చేందుకు మత రాజకీయాలు నడుపుతున్నందున, విచ్ఛిన్నకర 'ఫాసిస్టు మతతత్వ' చర్యలకు పాల్పడుతున్నందున తామే అతడ్ని చంపామని మావోయిస్టు పార్టీ ప్రకటించింది. ఆగస్ట్ 22న లక్ష్మణానంద హత్య జరిగితే, అతడి శవాన్ని రెండు రోజులు జిల్లా అంతా తిప్పారు. ఈ శవయాత్రలో గుజరాత్ నుంచి వచ్చిన తొగాడియా పాల్గొని రెచ్చగొట్టే ప్రసంగాలు చేశాడు. భజరంగ్‌దళ్, విశ్వ హిందూ పరిషత్ మూకలు సెప్టెంబర్ చివరి వరకు రాష్ట్ర వ్యాప్తంగా అతని హత్య వెనుక క్రైస్తవ కుట్ర ఉందని ఆరోపిస్తూ క్రైస్తవ నన్‌ల మీద అత్యాచారాలు, గృహ దహనాలు, చర్చీల విధ్వంసం, మానవ దహనం లాంటి అఘాయిత్యాలు కొనసాగించాయి. 1999 జనవరిలో ఆస్ట్రేలియాకు చెందిన క్రైస్తవ మత బోధకుడు గ్రహం స్టెయిన్స్, ఆయన ఇద్దరు కుమారుల్ని కాషాయ ముష్కరులు సజీవ దహనం చేశారు.

ఈ దుర్మార్గం వెనుక హిందూత్వ ఉగ్రవాదుల కనిపించని సాంస్కృతిక వ్యూహం కూడా ఉంది. ఆదివాసీలను సాంస్కృతీకరించే ప్రయత్నాలు చాలాకాలం కిందే మొదలుపెట్టిన సంఘ్‌పరివార్ కంధమాల్‌లోని ఆదివాసీల తెగల మధ్య (కుయి-పాన) క్రైస్తవ 'మతావలంబన'ను సాకు చేసుకొని ఒకరిపై ఒకరిని ఉసిగొల్పింది. కుయి తెగ వాళ్లు ఆదివాసీలు, పాన తెగ వాళ్లు దళితులు. చారిత్రకంగా చూస్తే కుయిలు స్థానికులు, పానాలు స్థానికేతరులు. వీళ్లలో చాలామంది క్రైస్తవ మతాన్ని స్వీకరించారు. వీళ్లు పక్క పక్క ఇళ్లలోనే సహ జీవనం చేస్తున్నారు. కుయిలకంటే పానాలు విద్యాపరంగా, ఆర్థికంగా కొంత మంచి స్థితిలో ఉన్నారు. తెగల మధ్య అసమ అభివృద్ధిని, స్థానిక స్థానికేతర సమస్యను మత ఆవరణలోకి తీసుకొచ్చి సంఘ్ పరివార్ ఎంత విధ్వంసం సృష్టించగలదో ఒడిషా ఘటనలు రుజువు చేశాయి.

మన దేశంలోని దళితులు, ఆదివాసీలు హిందువులు ఎలా అవుతారు? చాతుర్వర్ణ వ్యవస్థకు వెలుపల ఉన్న పంచములది, అసలు వర్ణవ్యవస్థతో సంబంధమే లేని ఆదివాసీలది హిందూ మతం ఎలా అవుతుంది? పురోహిత బ్రాహ్మణవర్గం ఆ సామాజిక వర్గాల కుటుంబాలలో జరిగే ఏ తంతుకైనా వెళ్లడానికి నిరాకరిస్తారు. ఈ విధంగా హిందూ మతానికి దూరం చేయబడ్డ దళితులు, ఆదివాసీలు అస్పృశ్యత పాటించని క్రైస్తవంలో, ఇస్లాంలో చేరాం అంటున్నారు. నిచ్చెన మెట్ల వర్గ-కుల వ్యవస్థలో బ్రాహ్మణులు మాత్రమే హిందువులు, మిగతా వర్ణాల వారికి మతం భ్రమ, కులం నిజం.

మత దురహంకారానికి 'సాంస్కృతిక జాతీయవాదం' ముసుగు తగిలించి సంఘ్ పరివార్ శక్తులు ప్రజల మెదళ్లలో విష బీజాలు నాటుతున్నాయి. సరస్వతి శిశు మందిర్‌ల పేరుతో విద్యార్థుల్లో, వనవాసి కళ్యాణ్ ఆశ్రమ్ పేరుతో ఆదివాసీల్లోనూ ఆర్.ఎస్.ఎస్., భజరంగ్‌దళ్, హిందువాహిని, విశ్వహిందూ పరిషత్, దుర్గావాహినీల పేరుతో యువతలో మతోన్మాద బీజాలు నాటుతున్నారు. దీనికి వ్యతిరేకంగా ప్రజాస్వామిక, లౌకిక భావాల ప్రచారం, సాహిత్య సాంస్కృతిక రంగాలలో జరుగవలసినంత కృషి జరగడం లేదు. ఒక వ్యక్తి ప్రజాస్వామిక లౌకిక భావాలు కలిగి ఉండడం వేరు, దానికనుగుణంగా జీవించడం వేరు. అంటే ప్రజాస్వామ్యాన్ని, లౌకికవాదాన్ని కేవలం ఒక సిద్ధాంతంగా లేదా విలువగా కాక జీవన విధానంగా మలుచుకోగలిగినపుడే మనం ఇతరులను ప్రభావితం చేయగలం, చైతన్యీకరించగలం. ఇదంతా కొందరు వ్యక్తులు, కొన్ని సంస్థలు విడివిడిగా సాధించగలిగేది కాదు. ప్రజాస్వామిక, లౌకిక శక్తులు సంఘటితమై కార్యాచరణకు పూనుకోవడం ద్వారానే ఇది సాధ్యమవుతుంది.

మహారాష్ట్ర, గుజరాత్, కర్ణాటక, ఒడిషా వంటి చోట్ల మైనారిటీలపై దాడులు హిందూత్వ శక్తులకు రాజకీయ ప్రయోజనాన్ని చేకూర్చాయి. ఆ కారణంగానే అదే పద్ధతిలో దేశమంతటా 'సాంస్కృతిక జాతీయవాదం' ముసుగులో మైనారిటీ మతస్తులపై దాడులు చేస్తూ, ముస్లింలను, క్రైస్తవులను శత్రువులుగా ప్రకటిస్తూ, వాటి కార్యకలాపాలపై, వ్యక్తులపై భావజాల సంబంధమైన, భౌతిక దాడులకు దిగుతున్నాయి. ఈ క్రమంలో మైనారిటీలకు వ్యతిరేకంగా హిందువులను ఏకం చేసి తమ రాజకీయ ఆధిపత్యాన్ని సుస్థిరం చేసుకోవాలని తపన పడుతున్నాయి. మత తత్వ శక్తులు అధికారంలోకి వస్తే అది అంతిమంగా బ్రాహ్మణీయ రాజకీయ నియంతృత్వంగా (ఫాసిస్టు రాజ్యంగా) మారిపోతుంది. ఇక వైవిధ్యానికి ఏమాత్రం అవకాశం ఉండదు. వీరికి ఏ ప్రజాస్వామిక వ్యవస్థ మీద నమ్మకం కూడా లేదు. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అభివృద్ధి నమూనాకు ఈ శక్తులు వ్యతిరేకం కాదు కదా, దళారీలుగా కూడా ఉపయోగపడుతున్నాయి. సంఘ్ పరివార్ శక్తులకు విదేశీ ఆయుధాలు, నిధులు, శిక్షణ కూడా అందుతున్నాయని నిఘా సంస్థలు తెలియజేస్తున్నాయి.

సంస్కృతిని, మతాన్ని జత చేసి, 'సాంస్కృతిక జాతీయవాదం' పేరిట బ్రాహ్మణీయ సంస్కృతిని ప్రజల చేత ఆమోదింపచేయడానికి జరుగుతున్న కుటిల ప్రయత్నాలను ఓడించాల్సిన కర్తవ్యం బుద్ధి జీవులందరి మీద ఉన్నది. సంఘ్ పరివార్ శక్తులు కోరుకున్నట్లుగా దేశమంతటా వర్గం, కులం, మతం, ప్రాంతం వంటి అంశాలతో సంబంధం లేకుండా 'ఏకరూప సంస్కృతి' ఉండడం సాధ్యమా? వారు చెబుతున్నట్లు వివిధ ప్రజా సమూహాల సామాజిక వర్గాల సాంస్కృతిక బహుళతత్వాన్ని చిదిమివేసి ఫాసిస్టు సమాజాన్ని రూపొందించడం వాంఛనీయమా? లౌకిక, ప్రజాస్వామిక వాదులు ఆలోచించాలి.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

*రాష్ట్ర విభజనతో తెలంగాణలోని ప్రజల సమస్యలు పరిష్కారం అవుతాయా అని ప్రశ్నిసూ, పెద్ద రాష్ట్రమే బలమైన శక్తిగా ఉండగలదని అంటున్నారు* **వి. హనుమంతరావు**

# శ్రీకృష్ణ కమిటీ నివేదిక - ఒక పరిశీలన

**రా**ష్ట్ర విభజన కోసం పరిశీలనకు కేంద్రం ఏర్పాటు చేసిన జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ నివేదిక వచ్చింది. కాని తెలంగాణ రాలేదు. తక్కువ మందికి ఖేదం, ఎక్కువమందికి మోదం. ఇదేమీ అనుకోని పరిస్థితి ఏమీకాదు. ఒకరు ఏడుస్తారు, మరొకరు నవ్వుతారని అంతా అనుకొన్నదే. ఇప్పుడిది కేంద్రం మెడకు చుట్టుకుంది. విడవమంటే పాముకు కోపం, విడవనంటే కప్పకి కోపం. నివేదిక తుది తీర్పు ఏమీ కాదు. తీర్పు ఇవ్వాల్సింది కేంద్రం. ఈ నెలాఖరుకు అఖిలపక్షం సమావేశాన్ని ఏర్పాటు చేసింది కేంద్రం. వట్టి చేతుల్తో రాకుండా ప్రభుత్వం తన నిర్ణయంతో ఆ సభకు రావాలని కొన్ని ప్రతిపక్షాలు డిమాండ్ చేస్తున్నాయి. కాని ప్రభుత్వం ఆ పని చేయదు, చేయబోదు అని అనిపిస్తుంది.

నివేదికపై అన్ని పార్టీల అభిప్రాయాలు తెలుసుకోకుండా ప్రభుత్వం నిర్ణయం తీసుకుంటే మా అభిప్రాయాలు తెలుసుకోకుండానే నిర్ణయం తీసేసుకుంటారా అని మీరే విమర్శిస్తారని ప్రభుత్వం అంటుంది. నిర్ణయం తీసుకోకపోతే, సమస్య తేల్చకుండా తాత్సారం చేస్తున్నామని మీరే మళ్లీ విమర్శిస్తారని ప్రభుత్వం ప్రతిపక్షాలను ఇరుకున పెట్టడానికి ప్రయత్నిస్తోంది. దేశమంతా సమస్యల కుంపట్లు వెలిగించుకొన్న కేంద్రం తెలంగాణ సమస్యకు ఎంత ప్రాధాన్యత ఇస్తుంది?

తెలంగాణ ఇస్తే, ఆంధ్ర, రాయలసీమ, ఉత్తరాంధ్ర ప్రాంతాలు భగ్గుమంటాయి. అంతేకాదు, దేశంలోని అరడజను రాష్ట్రాల్లో వేర్పాటు కావాలని ఆందోళనకు శ్రీకారం చుడతారు. అంత రిస్కు ప్రభుత్వం తీసుకొంటుందా? కొత్త రాష్ట్రాలేర్పడితే, వాటి రాజధాని నగర ఏర్పాట్లకు కోట్లు కేటాయించాల్సి వస్తుంది. రాష్ట్రాల సంఖ్య పెరిగే కొద్దీ పరిపాలనా సంబంధమైన సమస్యలు, సమన్వయం, నిధుల కొరత ఎదుర్కొంటాయి. ఉదాహరణకు ప్రత్యేక తెలంగాణ వాదుల ప్రధాన కోర్కె వ్యవసాయానికి నీటి సౌకర్యం. భౌగోళిక పరిస్థితుల దృష్ట్యా నీరు కేటాయించినా, లిఫ్ట్ ఇరిగేషన్ ద్వారా తప్ప, పొలాల్లో పంటనీరు పారదు. లిఫ్ట్ చేయాలంటే విద్యుచ్ఛక్తి అవసరం. ఇప్పటికే రాష్ట్రం విద్యుత్ రంగంలో పీకల్లోతు మునిగి ఉంది. ఇలాంటి సమస్యలు కొత్తగా రాష్ట్రాలు ఏర్పడితే ఎదుర్కోవాల్సి వస్తుంది. ఆ సమస్య పరిష్కారానికి మళ్లీ కమిటీలు, రిపోర్టులు ఇలా సాగుతుంది.

విడివడే రాష్ట్రాల మధ్య సరిహద్దు వివాదాలేర్పడుతాయి. ఆ సరిహద్దులో ఖనిజ సంపద ఉంటే అసలు రాష్ట్రం, కొసరు రాష్ట్రం మధ్య వివాదాలేర్పడతాయి. ఆర్థికంగా బలహీన, చిన్న రాష్ట్రాలేర్పడితే 'సహాయం' ఏరవేసి, రంగప్రవేశం చేయడానికి ప్రపంచబ్యాంక్ రెడిగా ఉంది. ఆంధ్రప్రదేశ్ లాంటి ధనవంతమైన రాష్ట్రాన్నే నిధుల కొరత సమస్యలు పరిష్కరిస్తామని సహాయం అందిస్తామంటూ రాష్ట్రాన్ని వంద లక్షల కోట్ల రూపాయల రుణ భారంలోకి నెట్టగా లేనిది, చిన్న రాష్ట్రాలు దానికా లెక్కా. లటుక్కున పట్టుకొని గుటుక్కున మింగేస్తుంది. రేపు తెలంగాణ ఏర్పడితే చంద్రశేఖరరావు కూడా ప్రపంచబ్యాంక్ ముందు క్యూలో నిలబడాల్సిందే. ఇదేమిటంటే చంద్రబాబు, వై.ఎస్., రోశయ్యలు అప్పు తెచ్చుకోగా, నేను ఆ పనే చేస్తున్నానంటాడు. కొత్త రాష్ట్రం అంతకు ముందున్న రాష్ట్రంలో తన వాటాగా వచ్చే రుణానికి, మరికొంత రుణ భారం తోడవుతుంది. బ్యాంకు రుణం అంటే యూజర్ ఛార్జీల భారం అదనంగా ప్రజలు చెల్లించాల్సి వస్తుంది. తెలంగాణ ప్రజలు ఈ విషయాన్ని గ్రహించాలి. ప్రత్యేక తెలంగాణ అంటే అదనపు యూజర్ ఛార్జీలు. పారా హుషార్.

పార్లమెంట్‌లో బిల్లు ప్రవేశపెట్టాలని, లేకపోతే అంతే సంగతులని కె.సి.ఆర్. హెచ్చరించారు. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం ఇవ్వడానికి కేంద్రం అంగీకరించిందే అనుకొందాం. బిల్లు అంటే రాజ్యాంగం సవరించాలి. మొదట, ఆంధ్రప్రదేశ్ శాసనసభ తీర్మానం చేయాలి. వివిధ రాష్ట్రాల శాసనసభలు చర్చించాలి. అలా చర్చకు పెడితే కొన్నింటిలో విభజన కోరుతున్న ప్రాంతాలున్నట్లయితే, అవి రాజ్యాంగ సవరణ బిల్లును చర్చించడానికి వెనుకాడతాయి. తెలంగాణలో కాంగ్రెస్ శాసనసభ పార్లమెంట్ సభ్యులు జై తెలంగాణ అన్నట్లే, ఆ రాష్ట్రాల్లో కూడా అలాంటి పరిస్థితులుత్పన్నమవుతాయి. అసలే రాష్ట్రం తర్వాత రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ చుక్కలు చూస్తోంది. ఆ నేపథ్యంలో ప్రత్యేక తెలంగాణను అంగీకరించే పరిస్థితి ఉందంటారా?

చిన్న పిల్లలు ఎంతో ముద్దొస్తారు. చిన్న రాష్ట్రాలు కావు. కేంద్రంలో బి.జె.పి. పాలించిన కాలంలో పెద్ద రాష్ట్రాలను విభజించగా, పదేళ్ల తరువాత అలా ఏర్పడిన చిన్న రాష్ట్రాల తీరుతెన్నులు ఎట్లా ఉన్నాయని 2004 నుంచి 2008 వరకు ఏ స్థాయిలో ఉన్నాయో అని ఇండియా టుడే వారపత్రిక సమాచారాన్ని తన ప్రతినిధుల ద్వారా సేకరించి ప్రచురించింది. ఆ పట్టికను ఈ సందర్భంలో పరిశీలించవచ్చు.

గత రెండేళ్లుగా తెరాస నాయకత్వం తెరవెనుక నుండి విద్యార్థులను రంగంలోకి దించి విధ్వంసాన్ని సృష్టించిన ఫలితంగా పారిశ్రామికవేత్తలు ఆందోళన వెలిబుచ్చుతూ వచ్చారు. ఇక్కడ పరిశ్రమలను స్థాపించదలచుకున్న కొంతమంది ఇతర రాష్ట్రాలకు తరలిపోయారు. కొంతమంది అన్ని అనుమతులు పొంది కూడా వేచి చూడడం జరుగుతోంది. ఇటీవల పారిశ్రామికవేత్తల సంస్థ ఫాప్సీ నగర పోలీస్ కమిషనర్ ఖాన్‌ను ఆహ్వానించి తమ భయాందోళనలను ఆయనతో పంచుకున్నారు. ఒక ప్రభుత్వాధికారిగా సెక్యూరిటీ

పకడ్బందీగా ఉందని భరోసా ఇచ్చినా, పారిశ్రామికవేత్తలకు వారి భయాలు వారికున్నాయి. తెలంగాణ నాయకులు కొంతమంది పారిశ్రామికవేత్తల మీద ఒత్తిడి తీసుకొనివచ్చి దండిగా వసూళ్లు చేస్తున్నారనే వార్తలు వినిపిస్తున్నాయి. కొన్ని చోట్ల పరిశ్రమల మీద దాడులు జరిపి విధ్వంసానికి పూనుకొన్న వార్తలూ వినిపిస్తున్నాయి. తెలంగాణ వచ్చినా, రాకపోయినా, హైదరాబాద్ నగరం క్షేమంగా ఉండాలి, అభివృద్ధి చెందాలి. కాగా విధ్వంసానికి పూనుకోవడం తానెక్కిన కొమ్మను తానే నరుకున్నట్లవుతుంది. రాష్ట్రం రెండు ముక్కలైనా, నాలుగు ముక్కలైనా, హైదరాబాద్ నగర అభివృద్ధిని నిరోధించడం – హైదరాబాద్ రాజధానిగా తెలంగాణ ఏర్పడితే, ఆ రాష్ట్ర పాలకులకు మిగిలేది స్మశాన నగరమే.

ఇంకో విషయం, రోశయ్య ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు 2010 నవంబర్‌లో ఇపుడు గుజరాత్‌లో జరిగిన తీరులో ఒక సమ్మేళనం జరపాలని నిర్ణయించి, ఫిబ్రవరికి వాయిదా వేసి, తిరిగి సెప్టెంబర్‌లో జరుగుతుందని అంటున్నారు. ఇప్పటిలాగే విధ్వంసం, ఆందోళన కొనసాగితే మళ్లీ వాయిదా వేయాల్సి వస్తుంది. నష్టపడేది హైదరాబాద్. ఇక్కడ ఒక విషయం గుర్తుచేయాలి. 1969లో చెన్నారెడ్డి ప్రత్యేక రాష్ట్ర ఆందోళన ప్రారంభించి, విద్యార్థులను రెచ్చగొట్టిన ఫలితంగా ఉస్మానియా నుంచి ఉద్యోగాలకు గాని, ఇంకా పెద్ద చదువులకు గాని అప్లికేషన్ పెడితే, వెనకా ముందూ చూడకుండా చెత్తబుట్టలో పారేయమని అనధికారికంగా హుకూంలు జారి అయ్యాయి. ముఖ్యంగా విద్యార్థులు ఈ విషయాన్ని గుర్తుంచుకోవాలి. అలాగే లక్షల మంది ఉన్నత విద్యనభ్యసించినా నైపుణ్యం గలవారు కరువవుతున్నారని పారిశ్రామికవేత్తలు వాపోతున్నారు. ప్రణాళికా సంఘం ప్రకారమే దేశంలో శ్రమజీవుల్లో కేవలం రెండు శాతమే నైపుణ్యం గలవారున్నారు. కొరియాలో 96 శాతం, జర్మనీలో 75 శాతం, జపాన్‌లో 80 శాతం, ఇంగ్లండ్‌లో 68 శాతం ఉన్నారు. నైపుణ్యతగల వారికే ఉద్యోగాలు లభిస్తున్నాయి. ప్రస్తుత ధోరణి చూస్తుంటే మన విద్యార్థుల నైపుణ్యత కార్లు తగలబెట్టడం, దౌర్జన్యాలు, ధర్నాలకే పరిమితమైంది. వారే రేపు నాయకులవుతారు.

శ్రీ కృష్ణ కమిటీ నివేదిక మీద ప్రభుత్వ నిర్ణయం ఏదైనా కావచ్చు. కాని రాష్ట్ర ప్రజలకు మూడు ప్రాంతాల్లో వివిధ రంగాలు ఏ స్థాయిలో ఉన్నాయో అధికారిక గణాంకాలు తెలుసుకొనే అవకాశం లభించింది. పాలకులెంతసేపూ వాగ్దానాలు చేయడం, మూడు పూవులు, ఆరు కాయలుగా వర్ధిల్లుతున్నదని డబ్బా కొట్టుకోవడం, సబ్ టీక్ హై అని ఉపన్యాసాలివ్వడమే గాని, వాస్తవంగా ఏం జరుగుతోంది. వివిధ రంగాల్లో మూడు ప్రాంతాలు ఏ స్థాయిలో ఉన్నాయో మొదటిసారిగా తెలుసుకునే అవకాశం కలిగింది. లేకపోతే ఏ ప్రాంత నాయకులు వారి వారి ప్రాంతాలకు అనుకూలంగా గణాంకాలను ఇంటర్‌ప్రెట్ చేసుకోవడం జరుగుతూ వచ్చింది. గ్లాసు సగం నిండిందని చెప్పవచ్చు. సగం ఖాళీగా ఉందనీ చెప్పవచ్చు. చెన్నారెడ్డి ఉద్యమం నడిపేనాటి వరకు రాష్ట్ర అర్థ గణాంక శాఖ ప్రతీ విషయంలోనూ మూడు ప్రాంతాల గణాంకాలను విడివిడిగా ఇచ్చేది. ఆ తర్వాత 23 జిల్లాల గణాంకాలను జిల్లాల వారిగా ఇవ్వడమే గాని ప్రాంతాలుగా ఇవ్వడం మానేసింది. రాష్ట్రం విడిపోకుండా ప్రస్తుతంలాగే కొనసాగితే ప్రాంతాల వారీగా గణాంకాలు అందచేస్తే, ఏ గణాంకాలు నిజమో, అబద్ధమో ప్రజలు తెలుసుకుంటారు. ప్రభుత్వానికి ఒక హెచ్చరికగా పనిచేస్తుంది.

**బిజెపి ఏర్పాటు చేసిన మూడు చిన్న రాష్ట్రాల్లో అభివృద్ధి – ర్యాంక్**

| | వ్యవసాయం | ప్రాథమిక వైద్యం | విద్య | మౌలిక సౌకర్యాలు | శాంతి భద్రతలు | బడ్జెట్ ప్రాస్పరిటీ | వినిమయ మార్కెట్ | పెట్టుబడులకు వాతావరణం |
|---|---|---|---|---|---|---|---|---|
| 2004 | | | | | | | | |
| ఛత్తీస్‌ఘడ్ | 19 | 15 | 15 | 16 | 10 | 16 | 17 | 13 |
| జార్ఖండ్ | 20 | 19 | 18 | 17 | 20 | 17 | 18 | 11 |
| ఉత్తరాఖండ్ | 14 | 8 | 5 | 14 | 16 | 11 | 10 | 2 |
| 2005 | | | | | | | | |
| ఛత్తీస్‌ఘడ్ | 20 | 19 | 17 | 17 | 10 | 17 | 18 | 2 |
| జార్ఖండ్ | 18 | 16 | 18 | 19 | 16 | 19 | 17 | 12 |
| ఉత్తరాఖండ్ | 14 | 10 | 3 | 5 | 15 | 10 | 9 | 8 |
| 2006 | | | | | | | | |
| ఛత్తీస్‌ఘడ్ | 18 | 15 | 15 | 14 | 10 | 14 | 17 | 9 |
| జార్ఖండ్ | 19 | 19 | 19 | 19 | 18 | 19 | 18 | 13 |
| ఉత్తరాఖండ్ | 12 | 8 | 3 | 8 | 15 | 8 | 10 | 5 |
| 2007 | | | | | | | | |
| ఛత్తీస్‌ఘడ్ | 18 | 19 | 14 | 14 | 17 | | 17 | 9 |
| జార్ఖండ్ | 19 | 20 | 19 | 19 | 16 | – | 14 | 12 |
| ఉత్తరాఖండ్ | 10 | 10 | 7 | 5 | 9 | – | 9 | 5 |
| 2008 | | | | | | | | |
| ఛత్తీస్‌ఘడ్ | 18 | 18 | 15 | 18 | 11 | – | 17 | 9 |
| జార్ఖండ్ | 20 | 14 | 18 | 20 | 18 | – | 15 | 14 |
| ఉత్తరాఖండ్ | 9 | 15 | 3 | 6 | 17 | – | 6 | 8 |

తెలంగాణ ఆందోళన ప్రారంభమైనప్పటి నుంచి తెలంగాణ వెనుకబాటుతనం గురించే, దానికి కారణం కోస్తా ధనికులేననే ప్రచారం జరిగింది. కానీ శ్రీకృష్ణ కమిటీ నివేదిక రాకముందే అది వాస్తవం కాదని గణాంకాలతో నిరూపించడం జరిగింది. ఇపుడు నివేదిక కూడా అదే చెబుతోంది. బహుశా, తెలంగాణవాదులు తమ వాదనలోని బలహీనతను గ్రహించి, వెనుకబాటుతనం నినాదాన్ని పక్కనపెట్టి సెంటిమెంట్ అనే నినాదాన్నిచ్చారు. ఇలా సెంటిమెంట్ల ఆధారంగా రాష్ట్రాల ఏర్పాటు ప్రారంభిస్తే, సర్దార్ పటేల్ 550 సంస్థానాలను రద్దు చేయగా మళ్లీ అన్ని రాష్ట్రాలు ఏర్పాటు చేయాల్సి వస్తుందేమో.

రాష్ట్రంలో వరసగా వరదలు, వానల వల్ల పంట నష్టపోయి రైతాంగం గొల్లున ఏడుస్తుంటే, తెలంగాణ నాయకులకు వారి గోడు వినపడడం లేదు. ప్రతిపక్షాలే కాదు, ప్రభుత్వం కూడా గుడ్డిలో మెల్లగా అయినా, వారికేదో సహాయం అందించడానికి ప్రయత్నిస్తోంది. కేంద్ర సహాయాన్ని అర్థిస్తోంది. కాని తెలంగాణ నాయకులు తమ చెవులకు బిరడాలు పెట్టేసుకొన్నట్లనిపిస్తుంది. అంటే తెలంగాణ రాష్ట్రం ఏర్పడి చంద్రశేఖరరావు ముఖ్యమంత్రి అయితే ఇలాంటి విపత్తులు ఎదుర్కోవాల్సి వస్తే, ఎలా ప్రవర్తిస్తారో రుచి చూపిస్తున్నారన్నమాట. తెలంగాణ రైతులారా, బహుపరాక్. ఒక్క రైతు సమస్యే కాదు, నిరుద్యోగం, ధరల పెరుగుదల, నిద్రపోతున్న పరిపాలన వ్యవస్థ, సవాలక్ష సమస్యలతో ప్రజానీకం సతమతమవుతున్నారు. తెలంగాణ నాయకులకు వారి ఉపన్యాసాలే వినిపిస్తున్నాయి గానీ, ప్రజల గోడు వినిపించడం లేదు. అధికారంలోకి వస్తే తమ పరిపాలన ఇలాగే ఉంటుందని చెబుతున్నారన్న మాట. రైతాంగ సోదరులూ, గమనించండి. చిన్న రాష్ట్రాలు ఏర్పాటయితే ఇలాంటి సమస్యలుండవా? రైతాంగానికి పరిమితమై బేరీజు వేసుకొంటే అటు ఆంధ్ర, రాయలసీమ, ఇటు తెలంగాణ రైతులు ఒకే స్థాయిలో, ఒకే రకమైన సమస్యలెదుర్కొంటున్నారు. పెద్ద రాష్ట్రం కొనసాగిస్తే ఈ సమస్యలు పరిష్కారమైపోవు. పాలకుల విధానాలు, పరిపాలనా వ్యవస్థ తీరు తెన్నులు మారాలి.

స్నేహపూర్వకంగా విడిపోదాం అంటున్నారు. తెలంగాణ, ఆంధ్ర రైతాంగం ఏమైనా దెబ్బలాడుకుంటున్నారా? వారి మధ్య విభేదాలేమీ లేవే? ఇరు ప్రాంతాల రైతులు ఒకేరకమైన దోపిడీకి గురవుతున్నారు. అక్కడి యువత, ఇక్కడి యువత నిరుద్యోగ సమస్య ఒక్కటే. విడిపోతే, వారి సంఘటిత శక్తి బలహీనపడుతుంది. వారి బార్గెయినింగ్ పవర్ తగ్గుతుంది. విభజించి పాలించే విధానాన్ని బ్రిటిష్ పాలన నుంచి మన నాయకులు అలాగనే ఒంటబట్టిచ్చుకున్నారు. తెలంగాణ ఉద్యోగులు వేరే సంఘాలు పెట్టుకొన్నారు. వారి సమస్యలు ఏమైనా పరిష్కారమై పోయాయా? వారి జీత భత్యాలు పెంచారా? ఈ సమస్యలన్నీ పెద్ద రాష్ట్రమైన ఆంధ్రప్రదేశ్‌లోనే పరిష్కరించబడడం లేదు. అలాంటిది కొత్త రాష్ట్రంలో, చిన్న రాష్ట్రంలో పరిష్కారమైపోతాయా?

తెలంగాణ ఏర్పడితే, దాని సరిహద్దులు, జనాభా లెక్కలేమిటో మాత్రమే తెలుసు. కాని దాని ఆదాయ వ్యయాలు, రుణభారం ఎంత, బడ్జెట్, రెవెన్యూ లోటు, బడ్జెట్ లోటు, ఇపుడు కొరవడినవని చెబుతున్న విద్య, వైద్యం, రవాణా సౌకర్యాల లాంటివి ఎలా, ఎప్పుడు పెంచుతారు, లాంటి వివరాలతో కూడిన చిత్రాన్ని తెలంగాణ ప్రజల ముందు ఎపుడైనా ఉంచారా? తెలంగాణ మేధావులకు ఈ విషయం తట్టలేదా? కొత్త రాష్ట్రానికవసరమైన హంగులన్నీ సమకూర్చడానికి కావాల్సిన నిధులనెలా సమకూరుస్తారు? పన్నులు ఎలా వేస్తారు? కేంద్రాన్ని అడుగుతారా? ప్రపంచబ్యాంక్‌ను అర్థిస్తారా? తెలంగాణకు వచ్చే ఆస్తులెంత? జిడిపి ఎంత ఉంటుంది? ఒక ప్రణాళిక ప్రజల ముందుంచినట్లయితే, వారి వాదనలకు బలం చేకూరేది కదా. అలాంటి ప్రణాళిక ఇదివరకే ఎవరైనా ప్రచురించి ఉంటే, నా ఈ విమర్శను ఉపసంహరించుకుంటా. శ్రీకృష్ణ కమిటీ నివేదిక వివిధ రంగాల్లో తెలంగాణ ప్రాంతంలో ఉన్న లోటుపాట్లేమిటో చెప్పింది. కానీ, ఆ రాష్ట్రం ఆర్థిక రూపు రేఖలెలా ఉంటాయో చెప్పలేదు.

ఈ సంవత్సరం వానలు, వరదలు, తుపానులు రాష్ట్రాన్ని ముంచెత్తాయి. రైతాంగం గిలగిలలాడుతోంది. రబీ పంటపండించు కోవడానికి వారి వద్ద నిధుల్లేవు. కేంద్రాన్ని అడిగితే ఎంగిలి చెయ్యి విదిలించింది. పెద్ద రాష్ట్రమైన ఆంధ్రప్రదేశ్ ఇలాంటి దయనీయ పరిస్థితుల్లో ఉంటే, చిన్నగా, కొత్తగా ఏర్పడే రాష్ట్రం ఇలాంటి సమస్యలెదుర్కొన్నపుడు ఎలా తన ప్రజలకు సహాయం అందచేయ గలుగుతుంది?

శ్రీకృష్ణ కమిటీ పుణ్యమా అంటూ మూడు ప్రాంతాల పరిస్థితుల గురించిన గణాంక వివరాలు లభించాయి. ఆ గణాంకాలను పరిశీలిస్తే తెలంగాణ వాదులు నిందారోపణ చేసినంత వెనుకబాటుతనం లేదని స్పష్టంగా కనిపిస్తుంది. ఆ వెనుకబాటుతనం రాయలసీమ జిల్లాలు, ఉత్తర కోస్తా ఆంధ్రలో కూడా కొట్టొచ్చినట్లు కనబడుతున్నాయి. అందుకనే కాబోలు, వేర్పాటువాదులు గణాంకాల జోలికి పోరు.

తెలంగాణలోగానీ, మొత్తం ఆంధ్రప్రదేశ్‌లో గానీ అసలు సమస్యలు భూమి, భుక్తి, నిరుద్యోగం, పేదరికం. ఈ సమస్యలను తెలంగాణ నాయకులు తమ ఉపన్యాసాల్లో ప్రస్తావించకపోవడం వెనుక ఉన్న అసలు విషయం తెలంగాణలో గత యాభై సంవత్సరాల్లో రూపుదిద్దుకొన్న నయా సంపన్న వర్గం, వారి అధికార దాహం. గత రెండేళ్లుగా సాగుతున్న బంద్‌లు, ఆందోళనలు, సజీవ చిత్రాలు టి.వి.ల్లో చూస్తున్నాం. మీకు ఎక్కడైన పంచెలు గట్టి, తలపాగా చుట్టి, అర్ధనగ్నంగా గ్రామాల్లో తిరుగాడే రైతు ఎప్పుడైనా కనపడ్డారా? అంతా తెల్లచొక్కాల వాళ్లు, విద్యార్థులు, చిన్నపిల్లలు, కొంతమంది మహిళలు మాత్రమే కనిపిస్తారు. ఇటీవల జరిగిన 12 నియోజక వర్గాల్లో తెలంగాణవాదులే గెలిచారు కానీ, మొత్తం ఓటర్లలో 40 శాతం మంది మాత్రమే గెలిచిన అభ్యర్థులకు ఓటు వేశారు. 60 శాతం మంది ఇతర పార్టీలకు వేశారు. లేదా ఓటు వెయ్యనే లేదు. కొత్త రాష్ట్రం ఏర్పాటైతే, మంత్రి పదవులు, కార్పొరేషన్‌ల అధ్యక్షులు ఆ పదవుల పేరుతో, కాంగ్రెస్ వారిలాగే బొజ్జలు పెంచుకోవడం, రియల్ ఎస్టేట్ వ్యాపారం – (ఇటీవల పత్రికల్లో ఒక ఫుల్ పేజీ ఎడ్వర్టయిజ్ మెంట్‌లో హైదరాబాద్‌లో కన్పించేటటువంటి పలు అంతస్తుల భవనాలు కరీంనగర్‌లో వెలిసాయనీ, ఇతర తెలంగాణ జిల్లాలలో కూడా అలాంటి భవనాలు నిర్మిస్తున్నామని బిల్డర్స్ సంస్థ ప్రకటించింది) – తెలంగాణ ఉద్యమం వెనుకనున్న సూత్రధారులు వీరే. వారి పాలనలో ప్రస్తుతమున్న అసమానతలే కొనసాగుతాయి. విడిపోయినా, కలిసి ఉన్నా, ఈ నయా సంపన్న వర్గాలే పాలించ బోతున్నాయి. అసలు ప్రజా సమస్యల మీద ప్రజలు ఐక్యంగా, సమిష్టిగా పోరాడితే తమకు పీఠాలు దక్కవని, బ్రిటిష్ పాలకులు నుంచి నేర్చుకొన్న 'విభజించి పాలించు' సూత్రాన్ని అమలు పరచడమే ఉభయ ప్రాంతాల ఉద్యమనాయకుల లక్ష్యం. తెలంగాణ ఏర్పడితే ఉద్యోగాలు లభిస్తాయి. కాని ఎవరికి? పైన ఉదహరించిన వర్గానికే. ప్రజల జీవితాలు ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లుండిపోతాయి.

*(రచయిత వీక్షణం గౌరవ సంపాదకులు)* వీ

***శ్రీకృష్ణ కమిటీ వల్ల కోట్లాది రూపాయలు, సమయం వృథా అయిందనీ, తెలంగాణ ప్రజాఉద్యమం అవకాశవాద పార్టీల చేతుల్లోకి పోయిందనీ అంటున్నారు ఆర్.ఎస్. చౌహాన్***

# శ్రీకృష్ణ కమిటీ నివేదిక - పూర్వాపరాలు

మొక్కై వంగనిది మ్రానై వంగునా అనే విధంగా తయారైంది. శ్రీకృష్ణ కమిటీ వ్యవహారం - ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధనకు జరుగుతున్న తెలంగాణ వాదుల ఉద్యమ ఫలితంగా, ప్రత్యేక తెలంగాణ ఏర్పాటుకు ప్రక్రియ మొదలౌతుందని కేంద్ర ప్రభుత్వం చేసిన ప్రకటనను నిరసిస్తూ సీమాంధ్ర ప్రాంత సమైక్యాంధ్రవాదుల మెరుపు ఉద్యమంతో ఇరు ప్రాంతాలలో క్లిష్ట పరిస్థితులు ఏర్పడినాయి. ఈ పరిస్థితులను అధ్యయనం చేసి పరిష్కరించేందుకు తగిన సూచనలు గల నివేదికను సమర్పించవలసినదిగా ఒక కమిటీని జస్టిస్ శ్రీకృష్ణ సారథ్యంలో కేంద్ర ప్రభుత్వం నియమించింది.

శ్రీకృష్ణ కమిటీని ఆదిలోనే విభేదించి నిరోధించి ఉంటే ఈ కమిటీ కార్యాచరణ జరిగి ఉండేది కాదు. శ్రీకృష్ణ కమిటీ తన నివేదికను కేంద్ర ప్రభుత్వానికి సమర్పించి ఉండేది కాదు. నివేదికలోని విషయాలు అనుకూలమా, ప్రతికూలమా అని తర్జన భర్జనలకు తావు ఉండేది కాదు. నివేదికను అందుకున్న కేంద్ర ప్రభుత్వం పంపిన ఆహ్వానాన్ని అందుకున్న రాజకీయ పార్టీలు, ఆహ్వానాన్ని మన్నించాలా, బహిష్కరించాలా అనే ఆలోచనలలో పడడం మాత్రం వీరి పరిస్థితి చేతులు కాలిన తరువాత వైద్యానికి ఆకులు పట్టుకునే రీతిలో కనిపించాయి.

ప్రత్యేక తెలంగాణ ఏర్పాటు విషయంలో పాలకపక్షం, ప్రధాన ప్రతిపక్షం ఈ రోజుకూ తమ వైఖరిని స్పష్టం చేయలేదు. తెలంగాణను తెచ్చేది మేమే, ఇచ్చేది మేమే అంటూ ఒక వైపు కాంగ్రెస్ పార్టీ, రెండు ప్రాంతాలు మాకు రెండు కళ్లలాంటివని మరొకవైపు టి.డి.పి. తమ ద్వంద్వ నీతిని ప్రదర్శించినాయి. పార్లమెంట్‌లో ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు బిల్లు పెడితే బలపరుస్తామని బిజెపి సమర్థించింది. ఇక మిగిలిన చిన్న పార్టీల వైఖరులు స్పష్టంగా బహిర్గతం కాలేదు. కానీ గద్దర్ అధినాయకత్వంలోని తెలంగాణ ప్రజా ఫ్రంట్ మాత్రం పార్లమెంట్‌లో ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు బిల్లు పెట్టాలని, ఉద్యమాల ద్వారానే ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధన జరుగుతుందని తన అజెండాను ప్రకటించింది.

ప్రత్యేక తెలంగాణ సాధనకు జరిగిన, జరుగుతున్న ఉద్యమాల చరిత్ర కొన్ని దశాబ్దాలుగా ఉన్నదే. వాస్తవంగా 2009-10 మధ్యకాలంలో జరిగిన తెలంగాణ ఉద్యమాన్ని చూసినవారికి తెలంగాణ ప్రజలు సహించే పరిస్థితులు లేవు అనిపించింది. ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు అతి చేరువలో ఉందనిపించింది. అప్పట్లో తెలంగాణ ప్రజల ఉద్యమ ఉధృతి అలాంటిది.

ప్రజలే తమ ఉద్యమంతో ప్రత్యేక తెలంగాణ రాష్ట్రాన్ని సాధించుకోగలిగితే, రేపు వచ్చే పరిపాలన కూడా ప్రజల చేతుల్లోకి పోతుందేమోనని రాజకీయ పార్టీలన్నీ భావించినట్లు ఉన్నది. చిత్తశుద్ధి, నిజాయితీ గల రాజకీయ పార్టీలైతే 'గో బ్యాక్ శ్రీకృష్ణ కమిటీ' అని ఆదిలోనే నినదించి శ్రీకృష్ణ కమిటీకి తన ప్రక్రియను మొదలు పెట్టనిచ్చేవి కావు. దానికి విరుద్ధంగా శ్రీకృష్ణ కమిటీ ఏర్పాటు జరిగిన తరుణంలో నిశబ్ద సాక్షులుగా నిబడినాయి. మౌనం వహించి తమ అర్ధాంగీకారంతో ఆహ్వానించాయి. తెలంగాణ సాధనకు సారథ్యం వహిస్తున్న టి.ఆర్.ఎస్. పార్టీ కూడా ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధనకు శ్రీకృష్ణ కమిటీ నివేదిక మీద ఆధారపడినది. ఫలితంగా శిఖరాగ్ర స్థాయికి చేరిన తెలంగాణ ప్రజల ఉద్యమం చల్లబడింది. ఉద్యమాన్ని నీరుకార్చాలన్న కేంద్ర ప్రభుత్వ ఆకాంక్ష నెరవేరింది. ఉద్యమించిన ప్రజలకు ఓపిక వహించవలసిన పరిస్థితి ఏర్పడింది. ఈ పరిస్థితులలో ప్రజల చేతుల్లో ఉద్యమం మరి ఒకసారి రాజకీయ పార్టీల చేతుల్లోకి వచ్చినట్లైంది. రాజకీయ పార్టీలన్నీ పోటీపడి తమ, తమ వాదనలు శ్రీ కృష్ణ కమిటీకి సమర్పించుకున్నాయి.

తెలంగాణ, సీమాంధ్రలలో ఉద్యమాలు జరుగుతున్న సమయంలో ఇరు ప్రాంతాల వారిమీద పోలీసులు కేసులు నమోదైనాయి. ముఖ్యంగా ఇరు ప్రాంతాల విద్యార్థుల మీద ఎక్కువ కేసులు నమోదైనాయి. కానీ టి.ఆర్.ఎస్. పార్టీ తన ఇద్దరు ఎం.పి.ల మీద నమోదైన కేసులను ఉపసంహరించేలా చేసుకోగల్గింది. కానీ తెలంగాణ ప్రాంత విద్యార్థుల మీద నమోదైన కేసుల ఉపసంహరణ విషయంలో విఫలమైంది. అవకాశవాద రాజకీయ పార్టీలు కొన్ని తెలంగాణ ప్రజల సానుభూతి సంపాదించే దిశలో విద్యార్థుల మీద నమోదైన పోలీసు కేసులు ఉపసంహరించాలని ఉద్యమాలు చేసి విఫలమైనాయి. చివరకు తెలంగాణ కాంగ్రెస్ నాయకులు చేసిన నాటకీయ ఉద్యమంతో విద్యార్థుల మీద విధించిన పోలీసు కేసులన్నింటిని ఎత్తివేస్తున్నామంటూ రాష్ట్ర ప్రభుత్వం ప్రకటన వెలువరించింది.

ఈ మధ్యకాలంలో శ్రీకృష్ణ కమిటీ తన కార్యకలాపాలను నిర్విఘ్నంగా కొనసాగించుకోగలిగింది. ప్రజల చేతుల్లోకి వచ్చిన ఉద్యమ ప్రక్రియ మరొక్కసారి రాజకీయ పార్టీల చేతుల్లోకి మారింది. అవకాశవాద రాజకీయ పార్టీలన్నీ మేమంటే మేము తెలంగాణ సాధిస్తామని గళం విప్పినాయి. తెలంగాణ ప్రజలను నమ్మించే ప్రయత్నం చేసినాయి. గడువుకు ఒకరోజు ముందే శ్రీకృష్ణ కమిటీ తన నివేదికను కేంద్ర ప్రభుత్వానికి సమర్పించింది.

శ్రీకృష్ణ కమిటీ నివేదికను అందుకున్న కేంద్ర ప్రభుత్వం భవిష్యత్తు కార్యాచరణగా ప్రతి ఒక పార్టీ నుండి ఇద్దరేసి ప్రతినిధులను ఢిల్లీకి

రావలసిందిగా మన రాష్ట్రంలోని ఎనిమిది రాజకీయ పార్టీలకు ఆహ్వానాన్ని పంపించింది. ఆహ్వానాన్ని అందుకున్న మన రాష్ట్రంలోని రాజకీయ పార్టీల అంచనాలు తలకిందులైనాయి. శ్రీకృష్ణ కమిటీ నివేదికలోని సూచనలు తమకు అనుకూలమా లేక ప్రతికూలమా, ఆహ్వానాన్ని మన్నించాలా బహిష్కరించాలా అని రాజకీయ పార్టీలు అన్నీ గందరగోళంలో పడినాయి. అంతర్గత తర్జన భర్జనల అనంతరం టి.ఆర్.ఎస్., బి.జె.పి., టి.డి.పి. పార్టీలు ఆహ్వానాన్ని బహిష్కరిస్తున్నట్లు, కాంగ్రెస్, పి.ఆర్.పి., సి.పి.ఐ., సి.పి.ఎం., ఎం.ఐ.ఎం. పార్టీలు ఆహ్వానాన్ని మన్నించి ఢిల్లీకి వెళ్లనున్నట్లు ప్రకటించాయి.

ఆహ్వానాన్ని మన్నించి ఢిల్లీకి వచ్చిన పార్టీలకు కేంద్ర ప్రభుత్వం నివేదిక ప్రతులను అందజేసింది. నివేదిక ప్రతిని 'నెట్'లోనూ పెట్టింది. నివేదికలోని విషయాలను బాగా చదివి భవిష్యత్తులో జరగబోవు మరో సమావేశానికి రావలసిందిగా ఐదు పార్టీలను కోరింది. కేంద్ర ప్రభుత్వ ప్రక్రియ ఇంతవరకూ సజావుగా సాగింది. కానీ శ్రీకృష్ణ కమిటీ నివేదికలోని సూచనలను చూసిన సీమాంధ్రవాదులు బాణసంచాలను కాల్చి, స్వీట్లను పంచి తమ సంతోషాన్ని వ్యక్తపరిచారని, తెలంగాణ ప్రజలు తమకు అన్యాయం జరిగిందంటూ ఉద్యమానికి తెర తీసినారని వార్తా కథనాలు వెలువడ్డాయి.

నివేదిక వెలువడిన తరువాత నివేదికలోని సారాంశాలు వెలువడిన వెనువెంటనే ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని విద్యార్థులు శ్రీకృష్ణ కమిటీ సూచనలను నిరసిస్తూ ఉద్యమానికి నాంది పలికారు. ఒ.యు. క్యాంపస్ పరిధిలోనే శాంతియుతంగా ధర్నా కార్యక్రమాలను చేపట్టారు. కేంద్ర ప్రభుత్వం మోహరించిన సైనిక దళాలు విద్యార్థుల మీద నిర్దాక్షిణ్యంగా భాష్పవాయువు, రబ్బర్ బుల్లెట్లను ప్రయోగించి ధర్నాను అణగదొక్కాయి. తమంతట తాముగా ఎటువంటి ఆంక్షలను విధించలేదంటూనే రాష్ట్ర పాలకవర్గం మీడియాల మీద ప్రసార ఆంక్షలను విధించి, ఒ.యు.లో విద్యార్థుల మీద కొనసాగుతున్న సైనిక దమనకాండపైన, ఇనుప తెరను దించింది.

దాదాపు ఒక సంవత్సర కాలాన్ని వృథా చేసి, కోట్లాది రూపాయల వ్యయంతో తయారు చేసిన శ్రీకృష్ణ కమిటీ నివేదిక తీరు కొండను తవ్వి ఎలుకను పట్టినట్టుందనీ, రాష్ట్ర విభజనకు అవసరమైన ముఖ్యాంశాలను కమిటీ తమ నివేదికలో దాటవేసిందనీ, రాష్ట్ర విభజనతో సంబంధంలేని ఇతర అంశాలను (మావోయిస్టు లాంటి) కమిటీ తన నివేదికలో ప్రస్తావించిందనీ, మొత్తానికి నివేదికలోని సూచనలు ఏకపక్షంగా సీమాంధ్రవాదులకు అనుకూలంగా ఉన్నాయనీ తెలంగాణ వాదాన్ని సమర్థిస్తున్న పలువురు రాజకీయ నాయకులు, ప్రజా ప్రతినిధులు, మేధావులు, సామాజికవేత్తలు, విద్యావంతులు, కవులు, కళాకారులు, ప్రజాసంఘాలు, తెలంగాణ ప్రజా ఫ్రంట్‌తో సహా తెలంగాణ ప్రజలందరూ ముక్తకంఠంతో నిరసిస్తున్నారు.

ఒకవేళ రాష్ట్ర విభజన అంటూ జరిగిన పక్షంలో రాయలసీమను కూడా ప్రత్యేక రాష్ట్రంగా విభజించాలని రాయలసీమ వాదులు, 3వ వాదనను ముందుకు తెచ్చారు. వాస్తవానికి ప్రత్యేక రాయలసీమ రాష్ట్ర సాధన అనే అంశం గత 55 సంవత్సరాలుగా కోల్డు స్టోరేజిలోనే ఉండిపోయింది. మధ్యకాలంలో ఒకరిద్దరు మేధావులు లేవనెత్తిన వాదం జనబాహుళ్యంలోకి రాలేదు. ప్రత్యేక రాయలసీమ వాదంతో చెదురు, ముదురుగా వచ్చిన రెండు లేక మూడు ఉద్యమాలకు సారథ్యం వహించిన రాజకీయ నాయకులు, కాంగ్రెస్, టి.డి.పి.లలో స్థానాలను దక్కించుకొని లబ్ధిపొందారు. ఇదే క్రమంలో ఏర్పడిన రాయలసీమ హక్కుల వేదిక కూడా తన కార్యక్రమాలను వేదికే పరిమితం చేసింది. ప్రజల మీద ప్రభావం చూపించలేకపోయింది. యువతరం సారథ్యంలో ఆవిర్భవించిన రాయలసీమ విద్యావంతుల వేదిక చేస్తున్న ప్రయత్నాలు అభినందనీయమే. కానీ ఈ వేదిక ఇంకా శైశవదశలో ఉంది. రాయలసీమ ప్రజలను ఉద్యమదిశలో చైతన్యవంతులను చేయవలసి ఉంది.

ఈ నేపథ్యంలో కాంగ్రెస్, టి.డి.పి. రాజకీయ నాయకుల ద్విపాత్రాభినయం బహిర్గతమైంది. తెలంగాణ ప్రజలను నమ్మించ తలచిన వారి ప్రయత్నాలు విఫలమయ్యాయి. ముఖాల మీది నాటకీయ ముసుగులు తొలగిపోయాయి. అధిష్ఠానం, తెలంగాణ ప్రజల మధ్య వారి పరిస్థితి అడకత్తెరలో పోకచెక్కలా తయారైంది.

అసలు శ్రీకృష్ణ కమిటీ కేంద్ర ప్రభుత్వం ముందు ఉంచిన ఆరు సూచనల సారాంశమేమిటని అధ్యయనం చేయాలి.

**సూచన**

1. రాష్ట్రంలో యథాతథ స్థితిని కొనసాగించాలి.
2. సీమాంధ్ర, తెలంగాణగా విభజించి, హైదరాబాద్‌ను కేంద్ర పాలిత ప్రాంతంగా ప్రకటించడం. తగిన కాలవ్యవధిలో రెండు రాష్ట్రాలు వేర్వేరు రాజధానులు ఏర్పాటు చేసుకోవడం.
3. రాయల తెలంగాణ, కోస్తాంధ్రగా విభజించి, హైదరాబాద్‌ను రాయల తెలంగాణలో చేర్చడం.
4. ఆంధ్రప్రదేశ్‌ను సీమాంధ్ర, తెలంగాణగా విభజిస్తూ, హైదరాబాద్ మహానగర పరిధిని విస్తరించి, దానిని కేంద్రపాలిత ప్రాంతంగా ప్రకటించడం, అటు ఆగ్నేయంలో నల్గొండ ద్వారా గుంటూరుతో, ఇటు దక్షిణాన కర్నూలుతో భౌగోళిక సంబంధం ఉండేలా ఈ కేంద్ర పాలిత ప్రాంత పరిధులను విస్తరించడం.
5. రాష్ట్రాన్ని ఇప్పుడున్న సరిహద్దుల ప్రకారం తెలంగాణ, సీమాంధ్రగా విభజించడం, హైదరాబాద్‌ను తెలంగాణకు రాజధానిగా ప్రకటించి, సీమాంధ్రకు కొత్త రాజధానిని ఏర్పాటు చేయడం.
6. రాష్ట్రాన్ని ఉమ్మడిగానే ఉంచి, తెలంగాణ సామాజిక అభివృద్ధికి కొన్ని నిర్దిష్టమైన రాజ్యాంగబద్ధమైన చర్యలు తీసుకోవడం, రాజకీయ సాధికారత కోసం చట్టబద్ధమైన మండలి ఏర్పాటు.

పై సూచనలలో సంఖ్య 1, 2, 3 సూచనలు అమలుచేయడం సాధ్యం కాదని శ్రీకృష్ణ కమిటీ తనకు తానుగా ప్రకటించుకున్నది. మిగిలిన 4వ సూచన ప్రకారం కటింగ్, ఫిటింగ్ క్రమంలో హైదరాబాద్ కేంద్ర పాలిత ప్రాంతంగా ప్రకటిస్తే అది మరిన్ని సమస్యలకు దారితీస్తుందని అమలు చేయడం సాధ్యంకాదు. 6వ సూచనకు, మొదటి సూచనకు ఎటువంటి తేడా లేదని ఇదివరకటి ప్రాంతీయ మండళ్ల ఏర్పాట్లు పూర్తిగా విఫలమైనాయనీ అమలు చేయడం సాధ్యంకాదు. 5వ సూచన తెలంగాణ ప్రజల ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షను సమర్థించేలా ఉంది. తెలంగాణ ప్రజలకు ఆమోదయోగ్యంగా ఉంది. కానీ కేంద్ర ప్రభుత్వం ఎటువంటి నిర్ణయం తీసుకోబోతుందోనని వేచి చూడవలసిన అవసరమున్నది.

శ్రీకృష్ణ కమిటీ సూచనలు వెలువడిన తరువాత కేంద్ర ప్రభుత్వంతో సహా అటు రాయలసీమ వాదులు, సమైక్యాంధ్ర వాదులు, ఇటు తెలంగాణ వాదులు భవిష్యత్తులో చేయవలసిన వారి కార్యక్రమాలలో నిమగ్నమై ప్రణాళికలను రచించుకుంటున్నారు.

ఏది ఏమైనా, ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఏర్పడాలనీ, ఐదున్నర దశాబ్దాల తెలంగాణ ప్రజల ఉద్యమం విజయవంతం కావాలనీ ఆశిద్దాం.

*(రచయిత ట్రేడ్ యూనియన్ నాయకులు)*

వీ

*శ్రీకృష్ణ కమిటీ కేంద్రం యొక్క, కేంద్రం చేత, కేంద్రం కోసం రహస్య నివేదిక రూపొందించడానికి ఏర్పడింది తప్ప వాస్తవాన్ని తేల్చి చెప్పడానికి కాదనీ, అలాంటి చట్టబద్ధత కూడా లేదనీ అంటున్నారు* **మాడభూషి శ్రీధర్**

# శ్రీకృష్ణ కమిటీ కాదు, దుగ్గల్ కమిటీ ఇది

అడుగడుగునా గందరగోళం నింపి హోంశాఖకు కావలసిన నివేదిక ఇచ్చి తెలంగాణ సమస్యను మరింత జటిలం చేసిన శ్రీకృష్ణ కమిటీ స్వరూపం ఏమిటి? దానికున్న చట్టబద్ధత ఏమిటి? దాని నివేదిక ఏం సాధించగలుగుతుంది? తెలంగాణ సమస్యపై రగులుతున్న రాష్ట్రాన్ని ప్రశాంతంగా ఉండాలన్న పేరుతో హోం మంత్రిత్వ శాఖ ఏర్పాటుచేసిన కమిటీని ఏమనాలి? శ్రీకృష్ణ కమిటీ తెలంగాణ కమిటీ కాదు. దాని పేరులోనే తెలంగాణ లేకుండా చూసుకున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో పరిస్థితిపై సంప్రదింపులుచేసే కమిటీ అని దానికి హోం శాఖ పెట్టిన పేరు. ఇది విచారణ కమిషన్ల చట్టం కింద ఏర్పాటయిన నిజనిర్ధారణ కమిషన్ కాదు. మాజీ సుప్రీంకోర్టు న్యాయమూర్తి అధ్యక్షత వహించినంత మాత్రాన అది న్యాయవిచారణ సంఘంకాబోదు. ఈ కమిటీ ఏర్పాటుకు కేంద్రం ఒక చట్టం చేయలేదు కనుక ఇది చట్టబద్ధమైన కమిటీ కూడా కాదు. ఈ కమిటీకి నిజాన్ని నిర్ధేశించేందుకు దీనికి సివిల్ కోర్టు హోదా కూడా ఇవ్వలేదు.

## ఏ బాధ్యతలు ఇచ్చారు?

నిజానికి ఈ కమిటీ ముందు కనీసం ఒక సమస్యకు పరిష్కారాన్ని సూచించడానికి శాస్త్రీయ విధానాలను అనుసరించే అవసరాన్ని చూపలేదు. ఆ బాధ్యత కూడా దాని మీద మోపలేదు. దాని ముందు సమస్యలుకూడా సరిగ్గా ఉంచలేదు. అధ్యయనం చేయడం, సంప్రదింపులు జరపడం దానిపని. తోచిన సిఫార్సులు చేయడం కూడా చేయవచ్చు. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఇవ్వడం గురించి మాత్రమే కాకుండా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఈ విధంగానే కొనసాగించడమా? అనే ప్రశ్నను కూడా అధ్యయనం చేయాల్సి ఉంటుంది. ఈ అధ్యయనం ఏవిధంగా చేయాలనేది వారు స్వయంగా నిర్ణయించుకోవాలి. కాని వారు అధ్యయనం విధానాన్ని ప్రకటించలేదు. సంప్రదింపులుజరుపుతున్నాం రండి అని వచ్చి చెప్పండి అని పత్రికల్లో ప్రకటనలుచేసారు. కాని తమముందుకు వచ్చిన నివేదికలను ఏం చేస్తారో చెప్పలేదు. నివేదికలో అంశాల్లో నిజానిజాలను ఏవిధంగా లెక్కిస్తారో చెప్పలేదు. ఎవరిచ్చిన పత్రాలనైనా స్వీకరించి, దాన్ని ఏవిధంగానైనా అన్వయించి, ఏరకమైన వ్యాఖ్యానమైనా చేసి, ఏ సిఫార్సయినా ఇస్తానన్నట్టు వ్యవహరించింది. కాని ఆ అశాస్త్రీయ విధానాన్ని అనుసరిస్తున్నట్టు ముందే చెప్పలేదు. ఈ కమిటీ నిజస్వరూపం న్యాయవిచారణ కాకపోయినా ఒక పద్ధతి ప్రకారం అంశాలను అధ్యయనం చేయాల్సిన మౌలిక నైతిక బాధ్యత ఉంటుంది. రాష్ట్ర శాసనసభ చట్టం ద్వారానైనా దీనికి చట్టబద్ధత కల్పించే ప్రయత్నం చేయలేదు. చివరకు దీని విలువ ఏమంటే ఒక హోం డిపార్ట్‌మెంట్ వారు వేసిన డిపార్ట్‌మెంటల్ కమిటీ. ఒక ముక్కలో చెప్పాలంటే హోం శాఖ వారి హోం కమిటీ. దీనికి పెద్ద బాస్ హోం మంత్రి. ఆ శాఖ నియమించిన సభ్య కార్యదర్శి వి కె దుగ్గల్ దీనికి చిన్న బాస్.

## న్యాయసూత్రాలు బుట్ట దాఖలు

ఎంతో స్వతంత్రంగా వ్యవహరిస్తారని కొందరు ఆశించిన జస్టిస్ శ్రీ కృష్ణ ఒక ఉత్సవ విగ్రహంగా ఉండడానికి అంగీకరించడం, అలంకార ప్రాయంగా ఇతర సభ్యులు వ్యవహరించడానికి సమ్మతించడం అనైతిక పాలనా వ్యవహారాల్లో ఒక విషాదం. చివరకు ఏ శాస్త్ర విధానాన్ని, పరిశోధనా పద్ధతులను పాటించకుండా, తమ ముందున్న విచారణంశాలపై వచ్చిన సమాచారాన్ని క్రాస్ ఎగ్జామినేషన్ చేయకుండా మరే ఇతర పద్ధతిలోనూ పరిశీలించకుండా, ఖచ్చితంగా ఒక లెక్క ప్రకారం సేకరించిన గణాంక వివరాలను మాత్రమే తీసుకోవలసిన ప్రాథమిక బాధ్యతను కూడా ఈ కమిటీ పాటించకుండా కమిటీ నివేదికను రూపొందించింది. సహజ ప్రాథమిక న్యాయసూత్రాల ప్రకారం తమ ముందుకు వచ్చిన అంశాలను నిష్పాక్షికంగా పరిశీలించడానికి, నిజం నిగ్గు తేల్చడానికి చేయవలసిన ప్రయత్నాలేవీ చేయలేదు. ఏ అంశంపైన రెండు పక్షాలను వినలేదు. ఒక పక్షం వాదనను మరొక పక్షంతో క్రాస్ ఎగ్జామిన్ చేయలేదు. ప్రభుత్వ పక్షపాతాన్ని వీడలేదు. మరో పక్షాన్ని వినలేదు. తెలంగాణ గురించి తెలంగాణ వ్యతిరేక ప్రభుత్వం ఇచ్చిన తప్పుడు అంకెలను, సమాచారాన్ని ఏ విధమైన క్రాస్ చెక్ లేకుండా దానికి కనీసం తెలంగాణ వాదుల సమాధానాన్ని గానీ, అందులో ఉన్న అబద్ధాలను ఎత్తిచూపే అవకాశం గానీ ఇవ్వకుండా వాటినే నమ్మి, ప్రభుత్వానికి కావలసిన రీతిలో నివేదికలు రాయడానికి అనుకూలమైన వ్యక్తులకు ఔట్ సోర్స్ చేసి వారు ఇచ్చిన నివేదికలో తప్పులు కూడా సరిదిద్దకుండా వాటిని వరసగా పేర్చి తొమ్మిది అధ్యాయాలున్న తమ నివేదికగా మార్చి హోం మంత్రికి ఇచ్చారు. దీన్ని కమిటీ రాసిందో లేక కనీసం చదివిందో లేదో తెలియదు. అందరూ సంతకాలు మాత్రం చేసారు. ఎన్నో విలువైన పిటిషన్లను కమిటీ చెత్తబుట్టలోవేసింది. ఎన్నో నిజాలను ప్రస్తావించకుండా వదిలేసింది. సమగ్ర నివేదిక ఇవ్వడం తమ బాధ్యత అని కమిటీ మరిచిపోయింది.

## తప్పుల తడక – అంకెల గారడీ

ఇక తప్పులకు అంతులేదు. ఘోరాలు కూడా ఎక్కువే. నదులు, వానిమీద ప్రాజెక్టుల పేర్ల రచనలో నిర్లక్ష్యం. చారిత్రక అసత్యాలు రాయడంలో సిగ్గుపడకపోవడం, అంకెల గారడీ ద్వారా మసి బూయడం ... ఎన్నో అసమంజసమైన వ్యాఖ్యలు. డబ్బు వ్యాపారం తప్ప జనం వారి సమస్యలు తమకు అనవసరమనే ఒక బ్యూరొక్రాటిక్ ధోరణిని అనేక వ్యాఖ్యల్లో ప్రదర్శించిందీ నివేదిక. తెలంగాణ తో పోల్చి ఆంధ్రకు ఎక్కువ అభివృద్ధి జరిగిందని చెప్పవలసి రాగానే అది ఎందుకో సమర్థించడానికి అయిదారు పేరగ్రాపులు రాయడం, అదే తెలంగాణకు అంకెల ఆధిక్యత వచ్చినపుడు, చూసారా ఎంత అభివృద్ధో అని వదిలేయడం వంటి మేధో అనైతికతకు పాల్పడింది ఈ కమిటీ.

ఎంత ప్రయత్నం చేసినా శ్రీకృష్ణ కమిటీ తెలంగాణ రాష్ట్ర డిమాండ్ అన్యాయమైందని చెప్పలేకపోయింది. ఎంత గాఢంగా ప్రభుత్వానికి అనుకూలమైన సిఫార్సు ఇవ్వడం కోసం కష్టపడినా, ఆంధ్రప్రదేశ్‌ను సమైక్యంగా ఇప్పుడున్న రీతిలో కొనసాగించడం ఆచరణాత్మకం కాదని చెప్పక తప్పలేదు. తెలంగాణను సీమాంధ్ర నాయకత్వంలోని ప్రభుత్వాలు అన్యాయం చేసాయని అభివృద్ధిలో వివక్షకు గురిచేసాయని ఈ నివేదికలో రాయలేదు. అలా అని వారు న్యాయం చేసారని కూడా రాయలేదు. తెలంగాణలో అభివృద్ధి లేదనే వాదాన్ని తిరస్కరించడానికి గట్టి ప్రయత్నం చేసిన పచ్చి నిజాలు కంటిముందు కనిపిస్తుంటే కప్పిపుచ్చడం సాధ్యం కాక కమిటీ తికమక పడింది. తెలంగాణలో అభివృద్ధి జరిగిందని చెప్పడానికి అంతకన్నవెనుక బడి ఉన్న జిల్లాల లెక్క తీసింది. రోడ్ల పొడుగు, వాహనాల కొనుగోలు, ప్రైవేటు విద్యా సంస్థల సంఖ్య, విద్యుచ్ఛక్తి వినియోగం ఆధారంగా అంకెలు తెలంగాణకే అనుకూలంగా ఉన్నాయని, వారి అభివృద్ధి ఇతర ప్రాంతాలకు దీటుగా ఉందని వాదించడానికి నానా తంటాలు పడింది. రోడ్ల వెడల్పు, పొడుగు వల్ల వ్యాపారం పెరిగితే పెరగవచ్చు. దాంతో పాటు ఆక్సిడెంట్లు కూడా పెరగవచ్చు. వాహనాల కొనుగోలు ఏ తరగతిని బాగుచేస్తుందో కమిటీకి తెలియదా?

పేదరికం ఎంత పెరిగిందో, పేదలకు ధనికులకు మధ్య వ్యత్యాసం ఎంత పెరిగిందో చెప్పవలసిన బాధ్యత కమిటీకి లేదా? ప్రైవేటు విద్యాసంస్థల సంఖ్య పెరిగిందని చెప్పే కమిటీ అవి ఎందరి ఆంధ్ర వర్తకుల చేతిలో ఉందో ఎందుకుచెప్పలేదు? అందులో కనీసం ఉద్యోగులు తెలంగాణ వారు ఎంత తక్కువ మంది ఉన్నారో ఎందుకు చెప్పలేక పోయింది. ఈ అంకె పెరగడంలో ప్రభుత్వం తెలంగాణకు చేసిందేమిటో ఎందుకు విశ్లేషించలేదు. కాలువ నీరందని పొలానికి బోరుబావు ఒక్కటే దిక్కని డ్రిల్లింగ్ చేయడం, అది ఎండిపోవడం, మరో బావి తవ్వడం అదీ నీరు ఇవ్వకపోవడం...ఈ విధంగా ఒక ఎకరాకు నాలుగైదు గొట్టపు బావులు తవ్వుకుని మోటార్లు అమర్చుకుంటే విద్యుచ్ఛక్తి వినియోగం తెలంగాణ రైతుకు ఎక్కువ ఉంటుంది. నిరంతరం కాలువ నీటితో సాగుచేసుకుంటూ ఏటా మూడు పంటలకు నీరు అందించే గ్యారంటీ ఉన్న కోస్తాంధ్ర రైతులకు గొట్టపుబావులు కరెంటు మోటార్లు అవసరం లేదు. కనుక వారి విద్యుచ్ఛక్తి వినియోగం తక్కువే ఉంటుంది. కాని ఆ రైతుల ఇళ్లలో, వారికి రాజధానిలోఉన్న ఎసి గదుల ఇళ్లలో ఎంత విద్యుచ్ఛక్తి కాలుతుందో కమిటీ లెక్క వేసి ఉంటే విద్యుచ్ఛక్తి వినియోగంలో కూడా తెలంగాణ రైతు ఎంత వెనుకబడి ఉన్నాడో తేలిపోయేది. కాని ఆ పని చేయడం శ్రీకృష్ణ కమిటీకి ఇష్టం లేదు. ఈ దొరికిన అంకెలతో అబద్ధాల గోడ కట్టాలనే అన్యాయానికి పాల్పడింది. వృద్ధి రేటు అంకెలను ఎటుబడితే అటువాడుకోవచ్చు కనుక తెలంగాణకు అన్యాయం చేయడానికి వాడుకుంది శ్రీకృష్ణ కమిటీ. అయినా విద్య, అక్షరాస్యత, వైద్యం, సేద్యపునీటిరంగం, మౌలిక వనరుల కల్పనలో తెలంగాణ వెనుకబడిందని కమిటీ అంగీకరించ తప్పలేదు. ఇంత కీలకమైన రంగాల్లో వెనుకబడి ఉన్న విషయం తెలిసిన తరువాత కూడా తెలంగాణ అన్యాయానికి గురైందని చెప్పడానికి కమిటీకి మనసొప్పలేదు. వారి మనసును ఎవరు దోచుకున్నారు? ఏవిధంగా? చదువులో, వైద్యంలో, సాగునీటి రంగంలో వెనుకబడి ఉన్న ప్రాంతం కోస్తాంధ్రతోదీటుగా అభివృద్ధి చెందిందనడానికి కమిటీ సభ్యులు కొంచమైనా సిగ్గుబడితే వారి పరువు దక్కలేదు.

తెలంగాణను దోపిడీచేసామన్న నిందనుంచి సీమాంధ్రను తప్పించడానికి ఎంత ప్రయత్నంచేసినా ఫలితంలేదు. కాని తమను ఆ నిందనుంచి తప్పించిందని కమిటీని ప్రశంసించడానికి వీలైన కొన్ని వ్యాఖ్యలను ఈ నివేదికలో అక్కడక్కడ ఉప్మాలో జీడిపప్పు చల్లినట్టు చల్లారు. ఈ వ్యాఖ్యలతో కోస్తాంధ్ర సీమల్లో నేతలు ఆనందంతో ఉప్పొంగి పోతున్నారు. వెనుకబడిందని చెప్పడానికి కావలసిన సాక్ష్యాలున్నా కమిటీ వదిలేసింది. అందుకు తెలంగాణ నుంచి విమర్శలు చెలరేగుతున్నాయి. ఒక శాస్త్రీయమైన విధానాన్ని అనుసరించకపోవడం వల్ల ఈ కమిటీ ఈవిధంగా ఇష్టం వచ్చినట్టు హోం శాఖ అభిప్రాయాలను తమ పరిశోధనా ఫలితాలుగా రాయడానికి వీలుపడింది. ఈ వ్యవహారపరమైన లోపాలతోపాటు కమిటీ కొన్ని ఘోరమైన దోషాలకు కూడా పాల్పడింది.

## దుగ్గల్ రహస్యాలు, రహస్య నివేదికలు

తెలంగాణ ఉద్యమం పట్ల ఈ హోంకమిటీ తనకున్న దురభిప్రాయాలతో పాటు రహస్యాన్ని పెంచి పోషించే దుర్మార్గానికి కూడా వెనుకాడలేదు. ఈ నివేదికలో తొమ్మిదో అధ్యాయం సూచనలు పరిష్కారాలకు సంబంధించింది. ఇది చాలా కీలకమైన అధ్యాయం. కాని దీనికి ఆధారమైన అధ్యాయం ఎనిమిదోది. దీన్ని లా అండ్ ఆర్డర్ అధ్యాయం అని పిలుచుకున్నారు. కేవలం అరపేజీ మించదీ అధ్యాయం. ఇది 413వ పేజీలో ఉంది. ఇందులో ఏ వివరాలూ లేవు. కాని ఒక కీలక సమాచారం ఉంది. అదేమంటే... ఈ కమిటీ సభ్య కార్యదర్శి అయిన వి కె దుగ్గల్ (హోం శాఖ మాజీ ఉన్నతాధికారి) ఈ రాష్ట్రంలోని 17 జిల్లాల సీనియర్ అధికారులు, పోలీసు అధికారులతో ముఖాముఖి చర్చలు జరిపారు. ఆ చర్చల ఆధారంగా కార్యదర్శి కమిటీకి కొన్ని విషయాలు చెప్పారు. ఆవిధంగా ఆయన చెప్పిన వివరాలు ఇతరత్రా అందిన సమాచారం ఆధారంగా కమిటీ ఒక నివేదిక తయారు చేసింది. ఈ నివేదిక (505 పేజీల నివేదిక) తోపాటు డిసెంబర్ 30న శ్రీ కృష్ణ కమిటీ ఒక సీల్డు కవర్‌లో ఇచ్చారు. ఆ అధ్యాయం ఆధారంగానే తాము తొమ్మిదో అధ్యాయంలో సూచనలు సిఫార్సులు రూపొందించాం అని ఆ అరపేజీ అధ్యాయంలో వివరించారు. దీని అర్థం ఏమిటి? 17 జిల్లాల అధికారులతో మాత్రమే మాట్లాడారు. ఆరు జిల్లాల అధికారుల విషయం ప్రస్తావనే లేదు. ఆ జిల్లాల్లో ఉన్నది మనుషులు కారా? అవి ఏ జిల్లాలో తెలియదు. వారిని ఎందుకు వదిలేసారో అర్థం కాదు. దానిగురించి నివేదికలో రాయరు. కనీసం ఈ 17 జిల్లాల అధికారులైనా

లిఖిత పూర్వకంగా ఇచ్చారా అంటే లేదు. వారు ముఖాముఖి చెప్పారట. కనీసం వారు మొత్తం కమిటీ ముందైనా నివేదిక ఇచ్చారా అంటే అదీ లేదు.

## ఎవరిదీ రహస్య ఎజెండా?

ఎజెండాలో, టర్మ్స్ ఆఫ్ రిఫరెన్సులో కమిటీలో సభ్యులు తమ ముందుకు వచ్చిన వారితో ముఖాముఖి మాట్లాడాలని రాసుకున్నారు. అంటే దాని అర్థం కమిటీ సభ్యులు కూర్చుని ఒక పబ్లిక్ హియరింగ్ జరిపినట్టు జరపాలని, వినతి పత్రం ఇచ్చిన వారిని సంప్రదించాలని, వారిని ప్రశ్నలు వేసి మరింత పరిశీలన జరపాలని అర్థం. కాని దుగ్గల్ 17జిల్లాల అధికారులతో మాట్లాడిన అంశాలే తమ ముందుకు వచ్చిన అంశాలుగా కమిటీ ఎందుకు భావించింది? ఆ 17 జిల్లాల అధికారులు ఏంచెప్పారు? దాన్ని దుగ్గల్ యథాతథంగా చెప్పారా? అనే ప్రశ్నలకు సమాధానం లేదు. మొత్తం తుది సిఫార్సుల అధ్యాయం చాలావరకు 8వ అధ్యాయంపైన ఆధారపడినప్పుడు, ఈ మౌఖిక సమాచారం నమ్మతగిందేనా? ఇక్కడ హోంశాఖ పట్ల పక్షపాతం, అపారమైన విధేయతలను ఈ కమిటీ ప్రదర్శించింది. ఆ కమిటీముందు హాజరై ఎంతో నమ్మకంతో తమ అభిప్రాయాలు పరిశోధనా పత్రాలు సమర్పించిన జన నాయకులకు, రాజకీయ పార్టీల ప్రతినిధులకు ఇది తిరస్కారం వంటిదే. ప్రజానాయకులంతా బహిరంగంగా నివేదికలు లిఖితపూర్వకంగా ఇచ్చి, జస్టిస్ ప్రశ్నలకు ఇతర సభ్యుల ప్రశ్నలకు సమాధానం చెప్పి వెళ్లాలి. అయినా ఆ నివేదికలకు అతీగతీ ఉండదు. మరోవైపు కమిటీ ముందు కాకుండా ఒక కార్యదర్శి ముందు 17 జిల్లాల సీనియర్ అధికారులు నోటిమాటగా చెప్పిన రహస్యాలకు ఎంతో విలువ ఉంటుంది. ఆ రహస్యాల ఆధారంగా ఇచ్చిన అధ్యాయం రహస్యంగా ఉంటుంది. కనీసం ప్రజా ప్రతినిధులకు, పార్టీ నేతలకు, అఖిల పక్ష సమావేశంలో కూడా ఆ సీల్డు కవరు నివేదిక ఇవ్వరు. వారికీ ఇది అవమానమే. కమిటీ అధ్యక్షుడిగా ఉన్న మాజీ న్యాయమూర్తి జస్టిస్ శ్రీకృష్ణ దీనికి అంగీకరించడం, తన ముందుకు రాని అంశాలను తన కమిటీ నివేదికలో చేర్చడం, హోంశాఖపట్ల ఆయనకు ఉన్న విధేయతను ప్రతిబింబిస్తుందే కాని, స్వతంత్రుడైన న్యాయమూర్తిగా ఆయనకు కీర్తిని తేజాలదు. పైగా ఈ సంఘటనను బట్టి ఆయన ఇది వరకు ఇచ్చిన తీర్పుల్లో న్యాయంపైన అనుమానాలు వచ్చే అవకాశం కూడా ఉంది. తన స్వతంత్రతను, విశ్వసనీయతను ఫణంగా పెట్టి ఈ రహస్య రక్షణ చేయడానికి ఏ మాజీ న్యాయమూర్తి కూడా అంగీకరించకూడదు.

## పరిష్కారాల గందరగోళం

మొదటి పరిష్కార సూచన ప్రకారం తెలంగాణ సమస్య ఒక లా అండ్ ఆర్డర్ సమస్య. కేంద్రం జోక్యం లేకుండా రాష్ట్రమే ఈ సమస్యను పరిష్కరించాలి. కేంద్రం ఇదివరకే బలగాలను పంపి జోక్యం చేసుకుంది. కాని అది కమిటీ పట్టించుకోదు. యథాతథంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని కొనసాగించాలని ఈసూచన చేసారు. కాని ఇది ఆచరణ సాధ్యం కాదని కమిటీయే పేర్కొంది. అయినా రాజకీయ పరిణామాలను పరిశీలిస్తే, కేంద్రం ఈ యథాతథ కొనసాగింపునకే వోటు వేస్తుందేమోననిపిస్తున్నది.

కమిటీ చేసిన సూచనల్లో 2,3,4,5 రాష్ట్ర విభజనకు అనుకూలంగా ఉన్నాయి. 6వ సూచన తెలంగాణకు రాజ్యాంగబద్ధమైన రక్షణలు కల్పిస్తూ రాష్ట్రాన్ని కొనసాగించడం. తెలంగాణ, సీమాంధ్రగా రాష్ట్ర విభజన, హైదరాబాద్‌ను కేంద్రపాలితప్రాంతం చేసి – రెండు రాష్ట్రాలకు ఉమ్మడి రాజధానిగా కూడా కొనసాగేట్టు చూడడం, లేదా కోస్తాంధ్ర, రాయల తెలంగాణగా వేర్పాటుచేసి హైదరాబాద్‌ను రాయల తెలంగాణ రాజధానిగా ఉంచడం అనే 2,3 సూచనల సమంజసత్వం కూడా సందేహాస్పదమే అని కమిటీ తేల్చింది. ఇక నాలుగో సూచన, హైదరాబాద్ విస్తీర్ణాన్ని పెంచి ఇతర తెలంగాణ జిల్లాలలోని అనేక మండలాలను దీంతో కలిపి, దాన్ని కేంద్ర పాలిత ప్రాంతంగా ప్రకటించడం, మూడు రాష్ట్రాలకు మూడు రాజధానులను విడిగా నిర్మించుకోవడం అనేది. ఇదొక దారుణమైన సూచన, ఎవరూ అడగనిది, ఎవరూ ఊహించనిది. అమలు చేయాలో వద్దో కమిటీ కూడా చెప్పలేకపోయిన అసమంజసమైన సూచన ఇది.

ఒక అయిదో సూచన, తెలంగాణ, సీమాంధ్రగా రాష్ట్ర విభజన, తెలంగాణలోనే హైదరాబాద్ రాజధానిగా కొనసాగడం, సీమాంధ్ర కొత్త రాజధాని నిర్మించుకునే వరకు హైదరాబాద్ రాజధానిగా ఉపయోగించడం. కాని దీనికి కొన్ని షరతులు విధించారు. లా అండ్ ఆర్డర్ సమస్యగా భావించి తెలంగాణ ఉద్యమాన్ని చాలా వ్యూహాత్మకంగా, కఠినంగా, తెలివిగా ఎదుర్కొనడం సాధ్యం కాకపోతేనే ఈ సూచనను అమలు చేయాలన్నారు. అందరి ఆమోదం ఉంటే ఈ పనిచేయాలన్నారు. తెలంగాణలో ఆంధ్రుల ఆస్తులకు రక్షణ కల్పించిన తరువాతనే ఈ విభజన చేయాలన్నారు. అందరి ఆమోదం సాధ్యం కాదని వేరే చెప్పనవసరం లేదు. రక్షణ కల్పించడం అవసరం. కాని ఉద్యమాన్ని అణచడం సాధ్యం కాకపోతేనే ఈ సూచన గురించి ఆలోచించాలని చెప్పడం ద్వారా శ్రీకృష్ణ కమిటీ లాఠీ బుద్ధితో నివేదిక రాసిందే కాని న్యాయమైన ఆలోచనే చేయలేదని తేలిపోయింది. ఆరోసూచన సాధ్యంకాకపోతే అయిదో సూచన రెండో ఉత్తమ సూచన అని కమిటీ వర్ణించింది. ఆరోసూచన ఏమంటే ప్రయోగించి విఫలమైన తెలంగాణ ప్రాంతీయ మండలికి మళ్లీ రాజ్యాంగ ప్రాణం పోయడం, దానికో అసెంబ్లీని ఏర్పాటు చేయడం, అక్కడి నివేదికలను తీర్మానాలను రాష్ట్రశాసనసభలో ఉంచడం, మండలి అసెంబ్లీకి, రాష్ట్ర అసెంబ్లీకి విభేదాలు వచ్చినా, మండలి తీర్మానాలకు ప్రభుత్వానికి మధ్య విభేదాలు వచ్చినా వివాదాన్ని గవర్నర్ కమిటీకి పంపడం, ఈ కమిటీలో రెండుప్రాంతాలను సమప్రాతినిధ్యం ఇచ్చి, గవర్నర్‌కు కాస్టింగ్ ఓటు ఇవ్వాలనడం ప్రధాన అంశాలు. గవర్నర్ తన విచక్షణతో నిర్ణయిస్తారన్నమాట. పెద్దమనుషుల ఒప్పందాన్ని ఈ ప్రతిపాదన ద్వారా మళ్లీ తెరముందుకు తీసుకొస్తారట. ఇదొక అప్రజాస్వామిక ప్రతిపాదన. ఇదివరకే విఫలమైందనడానికి అనేక రుజువులు ఉన్న ఈ ప్రయోగాలను మళ్లీ చేయాలనడం ఎంతవరకు వివేకవంతమో? హైదరాబాద్‌ను కేంద్రపాలిత ప్రాంతంగా ప్రకటించాలనడం ఈ చారిత్రక నగరాన్ని ఢిల్లీ సుల్తానులకు అప్పగించడమే. ఇది రాజ్యాంగ ఫెడరల్ సూత్రాలకు కూడా విరుద్ధమే. అందరికీ సంతృప్తిని కలిగించే నివేదిక ఇస్తామన్నపుడే ఇది తెలంగాణ వ్యతిరేక నివేదిక అని తేలిపోయింది. ఎవరికీ తృప్తిని కలిగించని ఈ నివేదిక సమస్యను సాగదీసి ఆంధ్ర తెలంగాణ ప్రజల మధ్య విద్వేషాల అగ్నిని వెదజల్లే ఇంధనంగా మారింది.

*(రచయిత నల్సార్ న్యాయశాస్త్ర విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్)* వీ

సమైక్యతకే శ్రీకృష్ణ కమిటీ మొగ్గు చూపినప్పటికీ, రాష్ట్రం విడిపోయేటట్లయితే పరిశీలించాల్సిన అంశాల గురించి పేర్కొంటున్నారు **చలసాని శ్రీనివాస్**

# పరిష్కార మార్గాలు ఆలోచించాలి

శ్రీకృష్ణ కమిటీపై ఆంధ్రప్రదేశ్‌లో లేదా 14 కోట్ల తెలుగువారి లోనే కాక దేశమంతటా చిన్న రాష్ట్రాల ఏర్పాటుకు దిక్సూచి లాగా ఆసక్తి నెలకొంది. ఫజల్ అలీ నేతృత్వంలోని మొదటి ఎస్.ఆర్.సి. మొదట విశాలాంధ్ర కావాలని కోరినా ఆఖరున ఐదు సంవత్సరాలు తాత్కాలికంగా తెలంగాణ రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలని ఆ తరువాత 2/3 మెజారిటీ శాసనసభ్యులు ఆమోదిస్తే (అంతవరకూ ఆగకుండా అత్యధిక మెజారిటీతో ఆంధ్ర రాష్ట్రంలో కలవాలని అక్కడి శాసనసభ్యులే కోరుకున్నది వాస్తవం) ఆంధ్ర రాష్ట్రంతో కలిసి విశాలాంధ్ర ఏర్పరచాలనే అసందిగ్ధ నిర్ణయం ఎలాగ ఉందో ప్రస్తుతం శ్రీకృష్ణ కమిటీ ఆరు పరిష్కారాలు చెపుతూ అందులో మొదటి మూడు పరిష్కారాలు సాధ్యం కావని తేల్చడం దానికి కొనసాగింపుగా ఉంది. అయితే నిప్పులాంటి నిజాలని మరొక్కసారి వెలుగులోకి తీసుకురావడంలో కమిటీ పాత్రని అభినందించి తీరాల్సిందే.

నానాటికీ వెనుకబాట పడుతున్నందువల్ల కొన్ని ప్రాంతాల నాయకుల ఒత్తిడి వల్ల అభివృద్ధి, ఉపాధి అవకాశాలు కోల్పోతున్నందు వల్ల సీమాంధ్ర, తీరాంధ్ర ప్రాంతాలు (హక్కులు సాధించుకుంటే మాత్రమే) ప్రత్యేక రాష్ట్రాలు అవ్వాలన్న ఆకాంక్షతో వివరాలతో గ్రంథాలు కూడా ప్రచురించి అనేక సభలు, యాత్రలు, న్యాయపోరాటాలు ఆంధ్ర మేధావుల ఘోరం చేసిన విషయం విదితమే. అయితే ప్రత్యేక తెలంగాణ కోరే ఉప ప్రాంతీయ పక్షాలు, వారికి మద్దతిస్తున్న 'కొందరు' మేధావులు, గాయకులు, ఆచార్యులు, కొన్ని రచయితల సంఘాలు వారి ఉద్యమాన్ని ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు తరువాత తెలంగాణ ప్రాంతాన్ని ఆంధ్ర ప్రాంతం వారు అభివృద్ధిలో కావాలని నిర్లక్ష్యం చేసారన్న ముఖ్య పునాదిపై నిర్మించారు. తరువాత వనరుల, ఉద్యోగాల, సాంస్కృతిక దోపిడీలనే అదనపు అంతస్తులు నిర్మించి తోటి తెలుగు సోదరులపై విద్వేషాలను తెలంగాణ సోదరుని మనసులలో నాటడానికి ఆ కొద్దిమంది చేయని ప్రయత్నం లేదు. సంస్కృతి మొత్తం వైవిధ్యమైనదని, దాన్ని కూడా ధ్వంసం కావాలని చేసారని ఆరోపణలు చేసారు. తమ స్వంత ప్రాబల్యం పెంచుకోవడానికి కొందరు రాజకీయ నాయకులు దానికి చిలవలు పలవలు కల్పించారు.

దానివల్ల చాలామంది మనసులలో అపోహబీజాలను నాటారు. అన్యాయం అన్ని ప్రాంతాలలో అసహాయులకి జరిగింది. ఒక్కో ప్రాంతంలో ఎక్కువ జరగవచ్చు. అయితే దాన్ని భూతద్దాలలో చూపించారు. ప్రస్తుతం అవి పటాపంచలు అయ్యాయి. అవి ప్రజలు నమ్మితే ఇన్నాళ్ల నుంచి అవాస్తవాలను ఎందుకు ప్రచారం చేసారని ప్రజలు నిలదీస్తారని ఆ రిపోర్టు ప్రజల చేత చదవనీయకుండా మొత్తం విశ్వసనీయతని దెబ్బతీయడానికి కొందరు చూడడం బాధాకరం. అయితే విజ్ఞానవంతులైన ప్రజలు ఆలోచించడం చూసి ప్రస్తుతం ప్రత్యేక తెలంగాణ కోరే కొంతమంది నాయకులు, ప్రొఫెసర్లు దోపిడీ అనే మాటే లేదని కేవలం ఆత్మగౌరవం, స్వయం పాలన కోసం మాత్రమే వేర్పాటు కోరుతున్నామని మాటమార్చడం వెనుక మర్మమిదే. అయితే ప్రత్యేక తెలంగాణ కోరుతూ ఏనాటి నుంచో ఉద్యమిస్తున్న అనేకులు ముఖ్యంగా వామపక్షవాదులు, కళాకారులు, ఆచార్యులు ఏనాడూ తోటి సోదరులని దూషించకుండా తమ హక్కుల కోసం ప్రత్యేక రాష్ట్రం కావాలని పోరాడడం వారి నిబద్ధతని తెలియజేస్తుంది.

రాష్ట్రం ఏర్పడేనాటికి తెలంగాణ మొత్తంలో విద్యుద్దీకరణ అయిన పట్టణాలు, గ్రామాల సంఖ్య దాదాపు పది ఉంటే అదే ఏ చిత్తూరు జిల్లాలో ఒక తాలూకానో పరిశీలిస్తే అంతకంటే ఎక్కువ గ్రామాలు విద్యుద్దీకరణ అయినాయని, అదే విధంగా మొత్తం హైదరాబాద్, రంగారెడ్డి విద్యుత్ వినియోగం అన్ని రంగాలలో చూసినా అంతకంటే కృష్ణా జిల్లా వినియోగం 46 శాతం ఎక్కువ అనే అనేక వాస్తవాలను శ్రీకృష్ణ కమిటీ వెలుగులోకి తీసుకురాలేని మాట వాస్తవమే. అదే విధంగా 31 అక్టోబర్ 1956 నాటికి ఉమ్మడి హైదరాబాద్ రాష్ట్రంలో ఒకే భాగం ఉండి అతి ధనవంతమైన బొంబాయిలో కలిసిన మరట్వాడా నేటి దీన స్థితిని అదే విధంగా మైసూరు (కర్ణాటక)లో కలిసి దారుణంగా ఉన్న బీదర్, గుల్బర్గా లాంటి ప్రాంతాల అభివృద్ధిని కూడా తెలంగాణ నేటి అభివృద్ధితో పోల్చి చూస్తేనే అసలైన వాస్తవాలు తెలుస్తాయని తోటి తెలుగు సోదరులలో అపోహలు తొలగుతాయన్న విషయాన్ని దృష్టికి తీసుకువచ్చినా పరిశీలించకపోవడాన్ని శ్రీకృష్ణ కమిటీ వైఫల్యంగానే చెప్పవచ్చు.

శ్రీకృష్ణ కమిటీ రిపోర్ట్‌ని నమ్మననే వారు 1956-2010 విషయాలు, ఆనాడు సీమాంధ్ర, తెలంగాణ, తీరాంధ్రలు విద్య, వైద్య-ఆరోగ్యం, నీటిపారుదల, మానవ అభివృద్ధి సూచికలు, వ్యాపారం దాదాపుగా అన్ని రంగాలలో ఎలా ఉండేవి, నేడు ఎలా ఉన్నాయో అంతర్జాతీయ న్యాయస్థానం నియమించిన ఏ కమిటీతోనైనా నిరూపణ చేసుకోవచ్చు. దేశంలో తెలంగాణ ప్రాంతంవారు ఎక్కడైనా ఉద్యోగాలు చేసుకోవచ్చు కాని తెలంగాణలో స్థానికంగా మాత్రం ముల్కి రూల్స్ ఐదు సంవత్సరాలు మాత్రం కొనసాగాలని పెద్ద మనుషుల ఒప్పందం

ఉంటే దాన్ని పొడిగించి ఒప్పందాలను ఉల్లంఘించిన విషయం నేడు మరల వెలుగులోకి వచ్చింది. తెలంగాణ ప్రాంతంలో ఆనాడు స్థానిక సమితులు, జిల్లా పరిషత్ అధ్యక్షులే అవసరమై అనేకమంది ఉపాధ్యాయులు, నర్సులు, డాక్టర్లు అవసరమై ఇతర ప్రాంతాల నుంచి రప్పించి ముల్కీ రూల్స్‌కి వ్యతిరేకంగా నియమించుకున్న విషయం నిజమే. అదే విధంగా గిర్‌గ్లానీ రిపోర్ట్ సారాంశం (సంగ్రహంగా చూస్తే స్థానికేతరుల సంఖ్య ఉండవలసిన దానికంటే చాలా నెగ్లిజబుల్ / తక్కువే ఉందన్న) నిజాలను శ్రీకృష్ణ కమిటీ రిపోర్ట్ ద్వారా వెలుగులోకి వస్తే ఉన్న కొద్ది ప్రభుత్వ ఉద్యోగాలలో ఏకంగా లక్షల ఉద్యోగాలు ఇతర ప్రాంతీయులు కాజేసారనే అపవాదులు పోతాయని కొంతమంది భయం. 'స్థానికేతరుల' వివరాలు చూస్తే అందులో పక్క జిల్లాల తెలంగాణ వాసులే రూల్స్ ప్రకారం స్థానికేతరులౌతారని చెపుతున్న ఆ పదిహేను వేల మంది స్థానికేతరుల సంఖ్య అంతా ఇతర ప్రాంతీయులు కాదని ప్రజలు తెలుసుకునే రోజు వస్తుంది.

నాలుగు వందల మంది ఆత్మత్యాగం చేసినా, పోలీసుల తూటాలకి బలైన జై ఆంధ్ర ఉద్యమం వచ్చినప్పుడు అతికొద్దిమంది తప్ప మిగిలిన తెలంగాణ ప్రాంత నాయకులు, మేధావులు సమైక్య రాగం ఎందుకు ఆలాపించారో, ఆరు సూత్రాల ఒప్పందాన్ని, అందరి నిధులతో ఉమ్మడిగా హైదరాబాద్ అభివృద్ధి చేయాలన్న ఒప్పందాలని తీర / సీమాంధ్ర వాసుల నెత్తిమీద ఎందుకు రుద్ది రాష్ట్రాన్ని సమైక్యంగా ఉంచారో ప్రజలు నిలదీయాలి. నేడు 14 (ఎఫ్) లాంటి ఆరు సూత్రాల ఒప్పందం ప్రాతిపదికలను ఎందుకు ఉల్లంఘించాలని కోరుతూ 22 జిల్లాల వాసులకి ఎందుకు అన్యాయం చేస్తున్నారో ఆలోచించాలి.

2009 డిసెంబర్ 9, 23 ప్రకటనలపై స్పందించేవారు ఆనాడు డిసెంబర్ 21న ప్రధాని అధికారికంగా భారత ప్రభుత్వం తరపున పార్లమెంట్‌లో (1972లో) చేసిన పూర్తి ప్రకటనపై నమ్మకముండే ఆనాడు తీర / సీమాంధ్ర ప్రాంతవాసులు సమైక్య రాష్ట్రంలో కొనసాగడానికి ఒప్పుకున్న విషయం ఎలా మరవగలరు? కాచ్‌మెంట్ / నీటి సమకూరే అరగాణి ప్రకారం నీటి కేటాయింపులు అవ్వలేదని 70 శాతం మోసగిస్తున్నారనే ఆరోపణలతో ప్రత్యేక తెలంగాణ కోరేవారు చేసే విషయంలో దేశ / విదేశాలే మెచ్చుకునే కాచ్‌మెంట్ / కేటాయింపు విషయంలో తన నిర్ణయాన్ని స్పష్టంగా శ్రీకృష్ణ కమిటీ ప్రకటించింది. ప్రత్యేక తెలంగాణ కోరేవారు ఇచ్చిన ప్రతిపాదనల విధానం ప్రకారమే అయితే తెలంగాణ జీవదాయని శ్రీరాంసాగర్‌లో దాదాపు వచ్చే నీరంతా పై రాష్ట్రాలదేనని అలాగే శ్రీశైలం / సాగర్‌లో సమకూరే నీటిలో అత్యధికం పై రాష్ట్రాల నుంచే వస్తుందని మొత్తం ఆంధ్రప్రదేశ్ ప్రజల జీవన విధానం దెబ్బతింటుందని ప్రజలకి పరోక్షంగా కమిటీ గుర్తు చేసింది. చిన్న చిన్న తప్పులు ఈ విభాగంలో లేకపోలేదని కాని సంగ్రహంగా కూడా చూడాలి.

విద్యుత్ విషయంలో తెలంగాణలో ఉన్న డిస్కామ్ కంటే తీరాంధ్రలో తూర్పు ప్రజల విద్యుత్ పంపిణీ డిస్కామ్‌కి యూనిట్ విద్యుత్‌ని యాభై శాతం పైగా ఎక్కువ రేటుకు అమ్మి వేలాది కోట్ల రూపాయలని ప్రభుత్వం దొడ్డిదారిన తరలించిన విషయాన్ని పెట్టుబడుల విషయంలో తీరాంధ్ర కంటే తెలంగాణలో 300 శాతం అధికంగా ఖర్చుపెట్టిన అనేక వాస్తవాలను వెలుగులోకి తీసుకు రాలేకపోయింది. అదే విధంగా తెలంగాణలో కొన్ని జిల్లాలకు కొన్ని విభాగాలలో జరిగిన అన్యాయాలను వెలుగులోకి తీసుకు రాలేకపోయిందని కొందరు అనడం కూడా సత్యం. అయితే 1589 హైదరాబాద్ నగర నిర్మాణం పునాది రోజు నుంచి తీర – సీమాంధ్ర ప్రాంతాల నుంచి సంపదని హైదరాబాద్‌కి తరలించిన విషయాలు, లెక్కలు, అలాగే ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత అనేక సంవత్సరాలు హైదరాబాద్‌లో అభివృద్ధికి ఖర్చుపెట్టిన మొత్తం నిధులు తీర – సీమాంధ్ర నుంచే తీసుకువచ్చారని జస్టిస్ భార్గవ కమిటీ రిపోర్టు వివరాలు లేకపోవడం కమిటీ రిపోర్టులో వెలితినిస్తుంది. ఏది ఏమైనా ప్రాంత నాయకులు, మేధావులు ఆ ప్రాంతం ఒక రాష్ట్రంగా ఏర్పాటు కావాలని ఆకాంక్షించడం తప్పు కాదు. అయితే తీర సీమాంధ్ర వాసులను దానికోసం మొత్తం దోపిడీదారులుగా చూపించే విధానం పోవాలన్నదే ముఖ్యం.

అదే సమయంలో నిజంగా ఈ ప్రాంతంలో వనరుల, భాష, సంస్కృతి, రాజకీయ అవకాశాలు కోల్పోయామని, ఎన్నో చట్టాలున్నా దోపిడీకి గురయ్యామని ఎవరైనా వాస్తవాలతో ఎవరైనా ఎలుగెత్తారంటే వారే కోయ, కొండ, గోండ్, పర్ధాన్, కోలం, బగత, సవర, చెంచులాంటి 32 ఆదివాసి, కొండజాతి గిరిజనులు లేదా నిర్లక్ష్యం చేయబడ్డ యానాది గిరిజనులు. వారి ప్రస్తావన రిపోర్ట్‌లో చాలా ప్రముఖంగా ఉంది. కేరళ రాష్ట్రం కంటే పెద్దదైన ఒకనాటి బస్తర్ జిల్లాలో వక్రమార్గం పట్టిన పెట్టుబడిదారీ వ్యవస్థ కోసం త్యాగం చేయబడుతున్న ఆదిమ గిరిజనుల జీవితాలను ఒక్కసారి పరిశీలిస్తే మనం మన ఆదిమ గిరిజన జాతులని కాపాడుకోవాల్సిన అవసరం ఉందని తెలుస్తుంది. అలా చేయకపోతే నాగరిక సమాజం అని చెప్పుకోవడానికే సిగ్గుపడాలి. అందువల్ల అసలైన గిరిజన రక్షణ అభివృద్ధి కోసం ఒరిజినల్ ట్రైబల్స్ అటానమస్ రిజన్‌ని అధికారాలతో విడిపోయే రాష్ట్రాలలోనే ఏర్పాటు చేయవలసి ఉంటుంది. అధికార వికేంద్రీకరణ, బహుళ అధికారాల స్థానిక సంస్థలు, జిల్లా ప్రభుత్వాల ఆశయం సాధ్యం కానప్పుడు వయబిలిటి – ఫిజిబిలిటిని దృష్టిలో పెట్టుకుని చిన్నరాష్ట్రాలు ఏర్పడడం చాలా మంచిది.

ఈ రోజు కొన్ని సంఘాలు, ఆచార్య లక్ష్మణ్ బాపూజీ అనేక మంది ఈ పాత వివరాలు, గణాంకాలు, అభివృద్ధి శాతాలపై పక్కన పెడదాం అంటూ 'కలిసి విడిపోదాం, విడిపోయి కలిసుందాం' అనే భావనతో ముందుకు వెళదాం అని ఉద్యమానికి ముందుకు రావడం అభినందనీయం. అన్నదమ్ముల కుటుంబాలు విడిపోయేటప్పుడు విద్వేషకారుల గాయాలను గుర్తు చేసుకోకుండా సౌభ్రాతృత్వంతో విడిపోయేందుకు సహకరించే వారి లాంటి కుటుంబాల మేలుకోరే మధ్యవర్తుల అవసరం తెలుగునాట నేడు ఎంతైనా ఉంది.

శ్రీకృష్ణ కమిటీ తన మొదటి మూడు పాయింట్లు సాధ్యం కావని చెపుతూ ఆరో పాయింట్ అత్యుత్తమని చెపుతూ సమైక్య రాష్ట్రం, తెలంగాణకి ప్రత్యేక రీజినల్ కౌన్సిల్ ఏర్పాటు చేయాలని కోరింది. ఒక్క పక్క రాష్ట్రంలో దారుణంగా వెనుకబడిన ప్రాంతం రాయలసీమ, అలాగే బాగా వెనుకబడిన ప్రాంతంగా ఉత్తరాంధ్ర అనే నిజాలను నిర్ధారిస్తూ అదే సమయంలో ఆయా ప్రాంతాలకు రీజినల్ కౌన్సిల్స్ ఏర్పాటు ఎందుకు కోరలేదో విచిత్రం. దేశ స్థూల విషయాలను పరిశీలించి రాష్ట్రాన్ని సమైక్యంగా ఉంచాలన్న భావనతో ఉండి అదే సమయంలో తెలంగాణలో ఉన్న ప్రజాకాంక్షను కాదనలేని పరిస్థితి కాదనలేక కొంతైనా సంతృప్తి పరుద్దామనే ఆకాంక్ష ఈ సిఫారసులో

అంతర్లీనంగా కనబడుతుంది.

రెండో ఉత్తమంగా చెప్పబడిన 5వ సూచన అయిన 'తప్పనిసరి అయితే, మూడు ప్రాంతాల వారి అంగీకారంతోనే హైదరాబాద్‌తో కూడిన ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు కావాలనే' పరిష్కారంలోనే మూడు ప్రాంతాల వారి ఆమోదంతో అన్న విషయం వల్ల ఏకాభిప్రాయంతోనే అని తెలుస్తుంది. ఇది కూడా సాధ్యమయ్యే విషయంలో కనిపించడం లేదు. ఈ రెండూ కాకపోతే దార్శనికుడు, భారత రాజ్యాంగ నిర్మాత బాబా సాహెబ్ అంబేద్కర్ ఆశయాలకు అనుగుణంగా దేశానికి రెండవ రాజధాని తరహాలో 4వ పాయింట్‌ని పరిష్కార మార్గంగా చేద్దామని కొందరు ఆశిస్తున్నట్లుంది.

ఆ ప్రకారం హైదరాబాద్ ఎచ్.ఎం.డి.ఎ. నల్గొండ మహబూబ్‌నగర్‌లోని కొన్ని మండలాలతో కలిపి గ్రేటర్ మెట్రోపాలిస్ (శాసనసభతో) ఏర్పడి సీమాంధ్ర, తెలంగాణ, తీరాంధ్రలకు ఉమ్మడి రాజధానిగా కూడా ఉండవచ్చనే ఆశ్వాసన ఆ హైదరాబాద్ గ్రేటర్ మెట్రోపాలిస్ ప్రాంతాన్ని అత్యద్భుతంగా అభివృద్ధి చేయడానికి ఆ ప్రాంత వాసులకి బాగా ఉపయోగపడవచ్చుకాని ఇతర ఇరవై జిల్లాల వాసులకి హక్కుపరంగా అలాగే తెలుగువారందరికి అనుబంధపరంగా కొంత నష్టమే. ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ రెండు కోట్ల జనాభాతో చిన్న చిన్న రాష్ట్రాలుగా విడిపోతే తప్పేం లేదు. కొంపలేమీ అంటుకోవు. తాడిత పీడిత వర్గాలకోసం పోరాడేవారికి మంచిదే. ఈ చిన్నరాష్ట్రాల ప్రతిపాదనకు రాష్ట్ర విభజనకి హేతుబద్ధత ఉండాలనే మెలికతో అనూహ్యంగా సమైక్యాంధ్ర, ప్రత్యేక తెలంగాణ మేధావులు కలిసి అడ్డుపడవచ్చు.

వేర్పాటు ఆకాంక్ష ఎక్కువగా తెలంగాణలో ఉంది. సమైక్యంగా ఉండాలన్న ఆకాంక్ష ఉన్న తీరాంధ్ర, సీమాంధ్ర ప్రాంత వాసుల అభ్యంతరాలు కొన్ని పరిష్కరిస్తే సమస్య సానుకూలంగా పరిష్కారమవ్వడానికి అవకాశం ఉంది. అందులో కొన్ని సూచనలు పరిశీలించాలి.

1) 1956 నాటి సరిహద్దుల ప్రకారం రాష్ట్రం విడిపోతుంది. అలాగే దాదాపు 700 కిలోమీటర్ల సరిహద్దు నదులని నిట్టనిలువునా చీలుస్తూ ఆ సరిహద్దు గీత నీటిమధ్యన ఉంటుంది. ఇలాంటి అనూహ్య పరిస్థితి దేశంలో వంద రాష్ట్రాలు ఏర్పడినా మిగతా చోట్ల ఏర్పడవు. అందువల్ల విడిపోయేముందు నీటిపారుదల విషయంలో అందరి హక్కుల రక్షణ కోసం అంతర్రాష్ట్రీయ నదుల విభాగాన్ని కేంద్రం చేపట్టి నీటి విడుదలకి రక్షణ విభాగం, అధికారులతో ప్రత్యేక తరహా ట్రిబ్యునల్ ఏర్పాటు చేసి నీటి విడుదలపై వర్కింగ్ టేబుల్స్ ప్రతి రైతుకు చేరే ఏర్పాటు చేసి ఉత్తరోత్తరా ప్రజల మధ్యన ఎలాంటి అంతరాలు ఏర్పడకుండా చూడడం. నిజంగా రాష్ట్రం విభజన కోరుకునేవారిలో దాదాపు అందరూ ఈ పరిష్కారాన్ని అంగీకరిస్తున్నారు. (అయితే తీర-సీమాంధ్రలలో నీరు, యువతకి ఉద్యోగాలు, అభివృద్ధి, నిధులు, బలహీన వర్గాలకి రక్షణలు / హక్కులు లాంటివి ఏమీ అక్కరలేకుండా 'ఒట్టి' ప్రత్యేక ఆంధ్ర కావాలని అతికొద్ది మంది చేసేది వారు ఒక ప్రత్యేక వాద పార్టీ నేతల వలలో చిక్కుకోవడంలో భాగమే).

2) అర్ధరాత్రి రాష్ట్రాన్ని విడగొట్టి హైదరాబాద్‌కి అక్కడ ఉపాధి అవకాశాలకు దూరమైతే వచ్చే ఇరవై సంవత్సరాలు తీరాంధ్ర, సీమాంధ్ర యువత ముఖ్యంగా మధ్యతరగతి, బలహీనవర్గాల వారు నష్టపోతారు. అందువల్ల తెలంగాణలో అనేకమంది దళిత ప్రొఫెసర్లు, మేధావులు కోరుతున్న విధంగా బాబా సాహెబ్ అంబేద్కర్ ఆశయాల ప్రకారం దేశానికి రెండవ రాజధాని చేసి అందరికీ అవకాశాలు కల్పించాలి. అలా ఏర్పాటైతే ఉపాధి అవకాశాలు 400 శాతం పైగా పెరిగితే అభివృద్ధి పదింతలైతే ఫలితాలు అందరూ పొందుతారు. కొంతకాలం కొన్ని ఆ ప్రాంత మిగులు నిధులని జనాభా నిష్పత్తిలో మూడు ప్రాంతాలు పంచుకోవాలి. హైదరాబాద్ తెలంగాణకి రాజధానిగానే ఉంటుంది. సీమ - తీరాంధ్రలు తమ తమ కొత్త రాజధానులని కొంత కేంద్ర సహాయంతో తామే ఏర్పాటు చేసుకోవాలి. ఈ పరిష్కారంపై ఇప్పుడే అన్ని వర్గాలలో చర్చ జరుగుతోంది.

3) చిన్న రాష్ట్రాలు ఏర్పాటు అయ్యేటప్పుడు కొన్ని కులాలు, మైనారిటీలు ఒక ప్రాంతంలో ఎక్కువ శాతం అవ్వవచ్చు. అదే సమయంలో కొన్ని ప్రాంతాలలో అదే విధంగా తగ్గిపోతాయి. ఆంధ్రప్రదేశ్ చీలిపోతే రాయలసీమ, దక్షిణాంధ్రలో బలహీనవర్గాల జనాభా శాతం ఇతర ప్రాంతాల శాతంతో పోల్చుకుంటే గణనీయంగా తగ్గిపోతుంది. రాజకీయంగా కూడా ఇబ్బందులు తప్పవు. అందువల్ల బలహీనవర్గాలు, మైనారిటీల కోసం అటువంటి పరిస్థితులలో రక్షణలు ఏర్పాటు చేయవలసి ఉంటుంది. అదే విధంగా తెలుగు భాష, సంస్కృతి అభివృద్ధి కోసం, తెలుగు వారి సౌభ్రాతృత్వం కోసం విడిపోయిన అన్ని రాష్ట్రాలలో అధికారాలతో భాషా, సంస్కృతి సంఘాలు ఏర్పరచాలి.

అంతిమంగా ప్రజలు ఉద్యమించాల్సింది ఒక జిల్లానో గుత్త ప్రాంత అభివృద్ధి పేరిట అభివృద్ధి ఫలాలు గుత్తేదార్లు, పెత్తందార్ల చేతిలోకి పోకుండా అసహాయులకీ, రాజ్యంలో అన్యాయం జరిగిన బలహీనులకీ మొదట న్యాయం జరిగేలా. అందుకనే నవ యువత ముందుకి రావాలి. బుద్ధం శరణం గచ్ఛామి - సంఘం శరణం గచ్ఛామి... సర్వేజనా సుఖినో భవంతు.

*(రచయిత న్యాయవాది, ప్రత్యేక ఆంధ్ర మేధావుల సంఘం నాయకులు)* ఏ

**రాబోయే సంచికలలో...**

- ❖ కృష్ణా జలాల వివాద ట్రిబ్యునల్ తీర్పు
- ❖ బ్లెయిర్‌కు బహిరంగ లేఖ - హాన్స్ వాన్ స్పానెక్
- ❖ అడవి సంపదపై సామ్రాజ్యవాదుల కన్ను - సి.ఎస్. పాదిల ఆజాద్
- ❖ వెనిజులా ప్రజల అధ్యయన ప్రణాళిక

శ్రీకృష్ణ కమిటీ నివేదికలోని అర్ధసత్యాలు, అబద్ధాలు, సాధారణ విషయాలలో కూడా లోపాలు విప్పిచెబుతూ, కమిటీ కనీస న్యాయ విచక్షణ, కనీస జ్ఞానం కూడా పదర్శించలేదంటున్నారు **శ్రీధర్‌రావు దేశ్‌పాండే**

# తప్పుల తడక కమిటీ నివేదిక

శ్రీకృష్ణ కమిటీ నివేదిక సమర్పించిన అనంతరం పరిస్థితిలో ఏమైన మర్పులు వచ్చాయా సమస్య పరిష్కారం అయ్యేందుకు నివేదిక దోహదం చేస్తుందా? లేదా మరింత జఠిలం అయ్యేందుకు దోహదం చేస్తుందా? ఎనిమిది నెలల విస్తృతమైన సంప్రదింపుల అనంతరం వెలువడిన ఈ నివేదిక సంప్రదింపుల ద్వారా వచ్చిన నిర్ధారణలను ప్రతిఫలించిందా? లేక మొదటే ఒక నిర్ధారణకు వచ్చి దానికి అనుగుణంగానే నివేదిక రూపొందిందా? శ్రీ కృష్ణ కమిటీ ముందే ఒక మైండ్‌సెట్‌తో పనిచేసిందా? నివేదిక చదివిన వారికి, నివేదికను విశ్లేషిస్తున్న వారికి వస్తున్న సందేహాలు. నేరస్థుడు తన ఆనవాళ్లను నేర ప్రదేశంలో వదిలివెళ్లినట్లు శ్రీకృష్ణ కమిటీ కూడా తన నివేదికలో ఇటువంటి ఆనవాళ్లని కోకొల్లలుగా మనకు అందించింది. నివేదిక నిండా వక్రీకరణలు, అబద్ధాలు, అర్ధసత్యాలు, వాస్తవాలను కావాలని తొక్కిపెట్టడం, తమకు అనుకూలమైన వాటిని వనిగట్టుకొని ప్రస్తావించడం, వాటినే వివరంగా చర్చించడం, తెలంగాణ అనుకూలాంశాలను ప్రస్తావించకపోవడం... నివేదిక నిండా ప్రతీ చాప్టర్‌లోనూ కనిపిస్తాయని విశ్లేషకులు సోదాహరణంగా పత్రికల్లో రాసారు. ఇంకా రాస్తూనే ఉన్నారు.

కమిటీ తన నివేదికను తొమ్మిది చాప్టర్లుగా విభజించింది. ఎనిమిదో చాప్టర్‌లో చర్చించిన ఆంతరంగిక భద్రతకు సంబంధించిన అంశాలను ప్రజలముందుంచలేదు. దాన్ని ప్రత్యేక సీల్డ్ కవర్‌లో ప్రభుత్వానికి సమర్పించింది. ఆ రహస్య నివేదిక చాలా కీలకమైనదని, కమిటీ తన నిర్ధారణలకు ఈ అంశాలే కీలకంగా పనిచేసాయని విశ్లేషకులు భావిస్తున్నారు. రాష్ట్రంలోని అన్ని రాజకీయ పక్షాలు, ప్రజా సంఘాలు ఆ రహస్య నివేదికను కూడా ప్రజల ముందుంచాలని డిమాండ్ చేసినా ప్రభుత్వం పట్టించుకునే స్థితిలో లేదు. అందుకు విరుద్ధంగా తెలంగాణ ప్రాంతంలోని విశ్వవిద్యాలయాలలో, ఇతర పట్టణాలలో పారా మిలిటరీ, పోలీసు బలగాలని దింపి తెలంగాణ ఉద్యమాన్ని అణిచివేయ జూస్తున్నది. లాఠీలు, తూటాలు, పోలీసు బలగాలు తెలంగాణ ప్రజలకు కొత్తకాదు. వీటిని ప్రయోగించి తెలంగాణ ఆకాంక్షలను అణచివేస్తామని భావిస్తున్న ప్రభుత్వాలకు తెలంగాణ ప్రజల వీరోచిత పోరాట సంప్రదాయం తెలియదనుకోం. అయితే అణచివెయ్యగలమనే తెంపరితనం, ఆధిపత్య భావజాలం కనిపిస్తున్నది.

ఇక మళ్లీ శ్రీకృష్ణ కమిటీ నివేదిక పైకి దృష్టి మళ్లిస్తే... ఇంతకు ముందే ప్రస్తావించినట్లు నివేదిక నిండా అనేక వక్రీకరణలు, అబద్ధాలు, అర్ధసత్యాలు, వాస్తవాలను తొక్కిపెట్టిన సందర్భాలు కన్పిస్తాయి. అన్నింటిని ప్రస్తావించడం ఇక్కడ సాధ్యం కాకపోయినా, కొన్నింటిని పాఠకుల సౌకర్యం కోసం ప్రస్తావించక తప్పదు. నిర్లక్ష్యానికి పరాకాష్ట ఈ నివేదిక. తెలంగాణకు సంబంధించినది కాబట్టి ఏమైనా రాయొచ్చు. 'బారా ఖూన్ మాఫ్' అన్నట్లు సాగిందీ నివేదిక రచన. ఈ నిర్లక్ష్యం వారు ఉపయోగించిన 'అబ్రివేషన్స్' నుండి మొదలయింది.

1) ఎ.పి. ట్రాన్స్‌కో - ఎ.పి. ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్

2) కర్నూలుని రాజధాని నగరంగా అభివృద్ధి చేశారు. (పే.1)

అబద్ధం. కేవలం జిల్లా కేంద్రంగా మాత్రమే ఉన్న కర్నూలు పట్టణం శ్రీబాగ్ ఒప్పందంలో భాగంగా రాజధానిగా మారింది. అక్టోబర్ 1953 నుండి నవంబర్ 1956 వరకు రాజధానిగా ఉన్నా ఎటువంటి సౌకర్యాలను కల్పించకుండా డేరాలలో పనికానిచ్చారు. కర్నూలు తాత్కాలిక రాజధాని, హైదరాబాద్ శాశ్వత రాజధాని అని 30 సెప్టెంబర్ 1953 నాడు అంటే ఆంధ్రరాష్ట్ర అవతరణకు ఒకరోజు ముందు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ తీర్మానించింది. కర్నూలును రాజధాని నగరంగా అభివృద్ధి చేయడానికి కేంద్రం సమకూర్చిన వంద కోట్ల రూపాయల నిధులను కూడా ఇతర ఖర్చులకు మళ్లించారు. దీన్ని బట్టి తేలేదేమిటంటే ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ ఒక కుట్రపూరితమైన వ్యూహంతోనే కర్నూలును తాత్కాలిక రాజధానిగా ఏర్పాటు చేసుకొని అందుకు అవసరమైన భవన నిర్మాణాలు చేపట్టకుండా హైదరాబాద్‌ని కబళించాలన్న ఆలోచనతో ఉంది. అయితే శ్రీకృష్ణ కమిటీ మాత్రం కర్నూలును రాజధాని నగరంగా అభివృద్ధి చేశారని చెప్పడం విచిత్రం.

3) రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం (ఫజల్ అలీ కమిషన్) భాషా సారూప్యతనే ప్రాతిపదికగా తీసుకొని రాష్ట్రాలు పునర్వ్యవస్థీకరణకు సిఫారసు చేసింది. (పే.4)

ఇది వక్రీకరణ అని చెప్పడానికి ఎస్.ఆర్.సి. నివేదికను చదివిన ఎవరికైనా తెలుస్తుంది. జస్టిస్ శ్రీకృష్ణ, అతని మేధావుల బృందం ఎస్.ఆర్.సి. నివేదికను చదివి ఉండరని ఎవరికీ భ్రమలు లేవు. తమ వాదనకు భాషా సారూప్యత ఒక ప్రాతిపదికగా వారు ఉపయోగించ దలుచుకున్నారు. కాబట్టి ఎస్.ఆర్.సి. నివేదికలో లేని అంశాన్ని చూపెట్టి వక్రీకరించారు. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కోసం ఫజల్ అలీ కమిషన్ కొన్ని ప్రాతిపదికలను గుర్తించింది. అవి ప్రాధాన్యతా క్రమంలో...

1. భారత దేశ సమైక్యతను, దేశ భద్రతను పరిరక్షించి, పెంపొందించాలి.

2. భాషా సాంస్కృతిక సారూప్యత.

3. ఆర్థిక స్వయం సమృద్ధి, పరిపాలనా సౌలభ్యం.

4. జాతీయ ప్రణాళికలను విజయవంతంగా అమలుపర్చడం.

పైన పేర్కొన్న ప్రాతిపదికలన్నింటిని కూలంకషంగా చర్చించి, విశ్లేషించి కమిషన్ ఈ కింది నిర్ధారణలకు వచ్చింది.

– రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ భాషా లేదా సంస్కృతిని మాత్రమే ప్రాతిపదికలుగా తీసుకొని చేయడం సాధ్యం కాదు. వాంఛనీయమూ కాదు. సమతుల్యత కలిగిన మార్గాన్ని, దేశ సమైక్యతను దృష్టిలో ఉంచుకొని ఎంచుకోవాలి.

– పరిపాలనా సౌలభ్యత, ఆర్థిక స్వయం సమృద్ధి, రాజకీయ సుస్థిరత తదితర అంశాలపై భాషా సారూప్యతది పై చేయి కారాదు.

– ఒక భాషా – ఒక రాష్ట్రం అన్న వాదన న్యాయమైంది కాదు. ఎందుకంటే ఒక భాష మాట్లాడే ప్రజలకు ఒకటికన్న ఎక్కువ రాష్ట్రాలు ఉండే అవకాశం ఉంది. ఈ ఏర్పాటు కూడా భాషా సారూప్యత వ్యతిరేకం కాదు. భాషా సారూప్యతకు విఘాతం కలుగకుండానే ఒక భాషకు ఒకటి కన్న ఎక్కువ రాష్ట్రాలను ప్రతిపాదించవచ్చు.

– రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణలో ఆర్థిక స్వయం సమృద్ధి అత్యంత కీలకమైన ప్రాతిపదిక అని మేం భావిస్తున్నాం. అయితే మిగతా ప్రాతిపదికలను కూడా పరిగణనలోకి తీసుకొని సమతుల్యతతో జాతీయ ప్రయోజనాలని దృష్టిలో ఉంచుకొని నిర్ణయించాలి.

పైన పేర్కొన్న నిర్ధారణల ఆధారంగానే ఫజల్ అలీ కమిషన్ 16 రాష్ట్రాలను మూడు కేంద్ర పాలిత ప్రాంతాలను ఏర్పాటు చెయ్యాలని సిఫారసు చేసింది. ఇందులో భాషా రాష్ట్రాలున్నాయి. మిశ్రమ భాషా రాష్ట్రాలున్నాయి. ఒక భాషకు ఒకటికన్న ఎక్కువ రాష్ట్రాలున్నాయి. హిందీకి 3, తెలుగుకు 2, మిశ్రమ భాషా రాష్ట్రాలు 3, భాషా రాష్ట్రాలు 8 ఉన్నాయి. కాబట్టి శ్రీకృష్ణ కమిటీ ఫజల్ అలీ స్వీకరించిన ప్రాతిపదికలనే వక్రీకరించినట్లు తేలుతున్నది.

4) '1949లో ఏర్పాటైన విశాలాంధ్ర మహాసభకు హైదరాబాద్ రాష్ట్రంలో తెలుగు మాట్లాడే ప్రజల నుండి ఇతోధిక మద్దతు లభించింది.' (పే. 8)

ఇదొక వక్రీకరణ. విశాలాంధ్రకు మద్దతు పలికే ప్రజలు ముఖ్యంగా కమ్యూనిస్టులు ఆనాడు ఉండిన మాట వాస్తవమే. కాని ప్రజానీకం పెద్ద ఎత్తున మద్దతు పలికిన దాఖలాలు లేవు. విశాలాంధ్ర మహాసభ సమావేశాలు జనం లేక ఎట్లా వెలవెలపోయినాయో బి.ఎన్. శర్మ 'రెందు తెలుగు రాజ్యాలెందుకు?' అన్న పుస్తకంలో వివరించారు. ప్రాథమిక పాఠశాల పిల్లలతో సభలను నిర్వహించినారని చెప్తూ ఇటువంటి సభలను నిర్వహించి డబ్బును వృథా చేయడం దండుగని విశాలాంధ్ర మహాసభ నాయకులు వాపోయినట్లుగా బి.ఎన్. శర్మ పేర్కొన్నారు. విశాలాంధ్ర మహాసభ తరపున హైదరాబాద్ రాష్ట్రంలో పర్యటించి సికింద్రాబాద్ చేరుకున్న పాగపుల్లారెడ్డి, మీర్ అహ్మద్ అలీఖాన్, వి.బి. రాజులకు వ్యతిరేకంగా 11 ఆగస్ట్ 1954న పెద్దఎత్తున నిరసన ప్రదర్శన జరిగింది. తెలంగాణ వాదులంతా నల్లజెండాలతో నిరసన వ్యక్తం చేస్తూ 'విశాలాంధ్ర ముర్దాబాద్ – తెలంగాణ జిందాబాద్' అంటూ నినాదాలిచ్చారు. అంతకు ముందు 1952లో నాన్ ముల్కీలకు వ్యతిరేకంగా జరిగిన 'నాన్ ముల్కీ గో బ్యాక్ – ఇడ్లీ సాంబార్ గో బ్యాక్' అన్న నినాదాలతో జరిగిన ఉద్యమం గురించి శ్రీకృష్ణ కమిటీ కావాలనే ప్రస్తావించలేదు. ఆనాటి ముల్కీ ఉద్యమంలో ఏడుగురు విద్యార్థులు పోలీసు తూటాలకు బలి అయ్యారు. వందలాది మంది గాయాల పాలయినారు. జైళ్ల పాలయినారు. ఈ చరిత్రనంతా మరుగున పర్చి విశాలాంధ్రకు ప్రజల మద్దతు ఉందని శ్రీకృష్ణ కమిటీ నిర్ధారించింది.

5) 'సాగునీటి రంగంలో తెలంగాణ కంటే రాయలసీమనే వెనుకబడి ఉంది. తెలంగాణ వాదుల ఫిర్యాదుకు సరి అయిన కారణం కన్పించదు.' (పే. 181)

సాగునీటి రంగమే కాదు, ఏ రంగంలోనైనా తెలంగాణ కంటె రాయలసీమ వెనుకబడి ఉందన్న సంగతి ఎవరూ కాదనరు. ఇక్కడ తెలంగాణ వెనుకబాటుతనాన్ని రాయలసీమతో పోల్చడమే ఒక కుట్ర. తెలంగాణ వాదులు చెప్తున్నదేమిటంటే విస్తారమైన నీటి వనరులు, ఖనిజ సంపద, అటవీ సంపద, ఇతర ప్రకృతి వనరులు, మానవ నిర్మిత వనరులు, ఆదాయ వనరులు కలిగి ఉన్నప్పటికీ తెలంగాణ వెనుకబడి పోయింది. ఇది అసహజం. పాలకవర్గాల వివక్షకు నిదర్శనం. ఇవేవీ లేని రాయలసీమ వెనుకబాటుకు అన్నీ ఉన్న తెలంగాణ వెనుకబాటుకు పోలిక తేవడమే అశాస్త్రీయం. కుట్రపూరితం. ఎందుకంటే అభివృద్ధిలో వెనుకబడడమే రాష్ట్ర డిమాండ్‌కు కారణమైతే రాయలసీమ, ఉత్తరాంధ్రలు తెలంగాణ కంటె వెనుకబడి ఉన్నాయని చెప్తూ తెలంగాణ రాష్ట్ర డిమాండ్‌ని తిరస్కరిస్తున్నారు. వనరులున్నప్పటికీ వనరుల వినియోగం మీద అధికారం లేకపోవడం వల్లనే తెలంగాణలో అభివృద్ధి లేమి కనిపిస్తున్నది. స్వయం పాలన వల్లనే వనరులను ఈ ప్రాంత సమగ్ర అభివృద్ధికి వినియోగించుకోవచ్చునన్న స్పృహనే తెలంగాణ ఉద్యమానికి ప్రాతిపదిక. రాయలసీమ వనరులు లేక వెనుకబడితే వనరుల దోపిడీ వల్ల తెలంగాణ వెనుకబడిపోయిందన్న వాస్తవాన్ని శ్రీకృష్ణ కమిటీ గుర్తించ లేకపోయింది.

6) పే. 185లో లిఫ్ట్ ఇరిగేషన్ ప్రాజెక్టులు కొన్నింటిని పేర్కొన్నారు. అవి ఏమంటే – కల్వకుర్తి, భీమా, నెట్టంపాడు, కోయిల్‌సాగర్, ఎ.ఎం.ఆర్.పి. ఇవన్నీ గోదావరి బేసిన్‌లో ప్రభుత్వం ప్రతిపాదిస్తున్న లిఫ్ట్ ఇరిగేషన్ స్కీములను నివేదిక చెప్తుంది. నివేదిక రచయితల నిర్లక్ష్యానికి పరాకాష్ట. పైన పేర్కొన్న ప్రాజెక్టులు అన్నీ కూడా కృష్ణ బేసిన్‌లో ఉన్నవన్న సంగతి ఆంధ్రప్రదేశ్ సాగునీటి రంగంపై ఏ కొద్దిపాటి అవగాహన ఉన్నవారికైనా తెలుస్తుంది. శ్రీకృష్ణ కమిటీ సభ్యులకు, కమిటీ నియమించిన ఎ.డి. మొహిలికి మాత్రం తెలియకపోవడం విస్మయం కలిగిస్తుంది.

7) 'ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత తెలంగాణలో భారీ, మధ్యతరహా ప్రాజెక్టుల కింద 713 శాతం భూమి సాగులోకి వచ్చింది.' (పే. 192)

సాగునీటి రంగ నిపుణులను కూడా అయోమయంలో పడవేసిన నిర్ధారణ ఇది. ఏ గణాంకాల ఆధారంగా శ్రీకృష్ణ కమిటీ ఈ నిర్ధారణకు వచ్చిందో తెలియదు. నిజాంసాగర్, సదర్‌మాట్, కడెం – ఘన్‌పూర్ తదితర భారీ మధ్యతరహా ప్రాజెక్టుల కింది 1956 నాటికి నాలుగు లక్షల యాభై వేల ఎకరాలు సాగులో ఉండేవి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తర్వాత శ్రీరాంసాగర్ – నాగార్జునసాగర్ ఎడమ కాలువ తదితర ప్రాజెక్టుల ద్వారా నికరంగా సాగులోకి వచ్చిన భూమి 12 లక్షలకు మించదు. అంటే ఇది 266 శాతం. అదే సమయంలో చిన్న తరహా ప్రాజెక్టుల కింద సాగయ్యే భూమి 1956 నాటికి పన్నెండు లక్షల

ఎకరాలుంటే అది ఈనాటికి ఐదు లక్షలకు పడిపోయింది. తెలంగాణలోని చెరువులు, కుంటలు మరమ్మతులు లేక, పూడిక తీయక, కబ్జాలకు గురి అయి చిన్న నీటి సాగునీటి వ్యవస్థ కునారిల్లిపోయింది. 1 నవంబర్ 1956 నాటి నుండి ఈనాటి జలయజ్ఞం వరకు సాగునీటి రంగం పరిస్థితిని ఈ కింది పట్టికలో గమనించవచ్చు.

| క్ర. సం. | సంవత్సరం | సాగవుతున్న మొత్తం భూమి (లక్షల ఎకరాలు) | | సాగు నీరందే భూమి నిష్పత్తి |
|---|---|---|---|---|
| | | ఆంధ్ర | తెలంగాణ | ఆంధ్ర : తెలంగాణ |
| 1. | 1.11.1956 నాటికి | 30.65 | 18.20 | 1.7 : 1 |
| 2. | 2004 నాటికి | 69.27 | 18.00 | 3.8 : 1 |
| 3. | జలయజ్ఞం తర్వాత 2009 | 107.20 | 39.83 | 2.7 : 1 |

ఆంధ్రప్రదేశ్ ఏర్పడే నాటికి ఉన్న తారతమ్యం 2004 నాటికి రెండింతలయింది. జలయజ్ఞంలో ప్రతిపాదించిన ప్రాజెక్టులు పూర్తయినా ఆ తారతమ్యాలు 3.8 : 1 నుండి కొద్దిగా తగ్గి 2.7 : 1కి వస్తుందే తప్ప తెలంగాణ సాగునీటి రంగంలో అభివృద్ధిలో న్యాయంగా దక్కవలసిన నీటి వాటా దక్కదు. తెలంగాణలో చిన్న నీటి వనరులు కునారిల్లి పోవడానికి ప్రభుత్వ నిర్లక్ష్యమే కారణం అని తెలంగాణ వాదులు పేర్కొంటే, ఇది ఒక్క తెలంగాణకే పరిమితం కాదు రాష్ట్రంలోనే ఇతర ప్రాంతాలలోనూ, దేశమంతటా చిన్న నీటి వనరులు తగ్గిపోయినాయని చెప్తూ తెలంగాణ వాదుల ఆరోపణ ఒక అపోహ మాత్రమేనని కొట్టి పారేసింది. (పే. 206) తెలంగాణలో అనాదిగా జీవనాధారాలుగా ఉన్న చెరువులు, కుంటలు కనుమరుగైపోవడం వల్ల చెరువుల చుట్టూ నిర్మితమైన స్వయం పోషిత గ్రామీణ ఆర్థిక వ్యవస్థ, సుసంపన్నమైన సాంస్కృతిక జీవితం విధ్వంసమైపోయి గ్రామాల్లో కరువు బారిన పడి, ప్రజలు లక్షలాదిగా బతుకు తెరువు వెదుక్కుంటూ దేశాలు బట్టిపోతుంటే శ్రీకృష్ణ కమిటీ నివేదిక ఈ వాస్తవాలను ప్రస్తావించదు.

8) పోలవరం ప్రాజెక్టుపై చూపిన శ్రద్ధ ఇచ్చంపల్లి ప్రాజెక్టు మీద చూపడం లేదన్న తెలంగాణ వాదుల విమర్శకు సమాధానం చెప్తూ ఇచ్చంపల్లి ప్రాజెక్టు పెద్ద ఎత్తున అడవి ముంపుకు గురి అవుతుందనీ, గిరిజన జనాభా విస్థాపన పాలవుతారనీ, కాబట్టి ఇచ్చంపల్లి ప్రాజెక్టు చేపట్టడం లేదనీ, దీనిపై తెలంగాణ వాదుల ఆరోపణ సమంజసం కాదనీ కొట్టివేసింది. (పే. 207). మనకు అర్థం కాని విషయం, ఎ.డి. మొహిలికి అర్థం అయిన విషయం ఏమిటంటే ఆంధ్రకు ప్రయోజనం చేకూర్చే పోలవరం ప్రాజెక్టు కూడా పెద్ద ఎత్తున అడవిని ముంపుకు గురి చేస్తున్నది. రెండున్నర లక్షల గిరిజన జనాభాని విస్థాపన పాలు చేస్తున్నది. పాపికొండలు లాంటి జీవవైవిధ్యం కలిగిన అటవీ ప్రాంతం నీట మునిగిపోతుంది. అయినా పోలవరం ప్రాజెక్టు ముందుకు ఎట్లా వెళుతుంది? అవ్వే సమస్యలు ఉత్పన్నం అవుతాయని ఇచ్చంపల్లి ప్రాజెక్టు ఫైళ్లలో దుమ్ముకొట్టుక పోతారెందుకు? ఎందుకో స్పష్టమే. ఇచ్చంపల్లి తెలంగాణ ప్రాజెక్టు. గోదావరి నదిపై ఎగువన నిర్మాణం అయ్యేది. పోలవరం ప్రాజెక్టు. ఆంధ్ర ప్రాజెక్టు. గోదావరిపై దిగువన నిర్మాణం అయ్యేది. ఇచ్చంపల్లి నిర్మాణమైతే పోలవరంకు నీళ్లు రావేమోనని పాలకుల భయం. ఈ రహస్యం ఎ.డి. మొహిలికి గానీ కమిటీ సభ్యులకు అర్థం కాలేదని కాదు. ఒక మైండ్‌సెట్‌తో నివేదిక రాసేవారికి గాని ఉండే ఇబ్బందులే ఈ రకమైన వక్రీకరణకు చోటు కల్పిస్తాయి.

9) 'తెలంగాణలో సింగరేణి బొగ్గు గనులున్నాయి. కోస్తాంధ్రలో సహజ వాయు నిల్వలున్నాయి. అందుకే అక్కడ గ్యాస్ ఆధారిత విద్యుత్ ప్రాజెక్టులు నిర్మాణం అవుతున్నాయి. అయితే రాయలసీమలో బొగ్గు గనులు రేవు, గ్యాస్ నిక్షేపాలు లేవు. అందుకని భారత ప్రభుత్వం రాయలసీమలో ఉన్న కొత్తగూడెం థర్మల్ విద్యుత్ కేంద్రానికి, కోస్తాంధ్రలో ఉన్న విజయవాడ థర్మల్ విద్యుత్ కేంద్రానికి సింగరేణి నుండి బొగ్గును కేటాయించింది.' (పే. 222)

కొత్తగూడెం థర్మల్ విద్యుత్ కేంద్రం (కె.టి.పి.ఎస్.) తెలంగాణ లోని ఖమ్మం జిల్లాలో ఉంటే శ్రీకృష్ణ కమిటీ సభ్యులు మాత్రం కె.టి.పి.ఎస్. రాయలసీమలో ఉందని రాయడం నిర్లక్ష్యపు ధోరణికి మరో నిదర్శనం. సహజ వాయు నిల్వలున్న కారణంగా కోస్తాంధ్రలో గ్యాస్ ఆధారిత విద్యుత్ కేంద్రాలు నిర్మాణం అవుతున్నాయని చెబుతున్న కమిటీ మరి బొగ్గు గనులున్న తెలంగాణలో బొగ్గు ఆధారిత విద్యుత్ కేంద్రాలు ఎందుకు నిర్మాణం కాలేదో వివరిస్తే బాగుండేది. బొగ్గున్న తెలంగాణలో, బొగ్గులేని కోస్తాంధ్రలో థర్మల్ విద్యుత్ ఉత్పాదక సామర్థ్యం సమానంగా ఉండడాన్ని కమిటీ ఆక్షేపించడం లేదు. పైగా ఇది తీవ్రంగా పరిగణించే విషయమే కాదట. ఎందుకంటే కోస్తా, రాయలసీమ థర్మల్ కేంద్రాల నుండి కావాల్సినంత విద్యుత్తు తెలంగాణకు గ్రిడ్ ద్వారా సరఫరా అవుతుందట. ఎంత విచిత్రం! థర్మల్ కేంద్రాల్లో ఉద్యోగాలు, ఆ కేంద్రాల చుట్టూ పెంపొందే, వృద్ధి అయ్యే ఆర్థిక వ్యవస్థలను తెలంగాణ కోల్పోయిన సంగతి శ్రీకృష్ణ కమిటీ పరిగణనలోకి తీసుకోనే లేదు. ప్రపంచంలో ఎక్కడైనా బొగ్గు నిల్వలున్న చోటే విద్యుత్ ప్లాంట్లు వెలుస్తాయి. కానీ ఆంధ్రప్రదేశ్‌లో మాత్రం బొగ్గు గనులకు వంద కిలోమీటర్ల దూరంలో విద్యుత్ కేంద్రాలు నిర్మాణం అవుతాయి. బొగ్గు ఇక్కడ నుండి తరలిపోతుంది. ఉత్పత్తయిన కరెంటు తిరిగి వెనక్కి తెలంగాణకు వస్తుంది. బొగ్గు రవాణా ఖర్చు, తిరిగి కరెంట్ సరఫరా ఖర్చు, సరఫరాలో నష్టాలు తెలంగాణ ప్రజలు ఎందుకు భరించాలి? నూట యాభై సంవత్సరాలుగా బొగ్గు ఉత్పత్తి చేస్తున్న ఆదిలాబాద్ జిల్లాల్లో ఒక్క థర్మల్ విద్యుత్ కేంద్రం ఎందుకు లేదు? పాలకుల వివక్ష కాదా? మణుగురులో నిర్మాణం కావాల్సిన థర్మల్ విద్యుత్ కేంద్రం విజయవాడకు ఎందుకు తరలిపోయింది? కరీంనగర్ గ్యాస్ ఆధారిత విద్యుత్ ప్లాంట్‌కు గ్యాస్ కేటాయింపులు ఎందుకు జరగడం లేదు? శ్రీకృష్ణ కమిటీ ఈ సవాళ్లని హాయిగా దాటవేసింది.

10) 'ఉద్యోగరంగంలో తెలంగాణకు మొదట్లో అన్యాయం జరిగినప్పటికీ గత ఐదు సంవత్సరాలుగా 610 జి.ఒ. అమలు కోసం, రాష్ట్రపతి ఉత్తర్వుల అమలు కోసం రాష్ట్ర ప్రభుత్వం తీసుకుంటున్న చర్యల పట్ల తెలంగాణ ఉద్యోగులు సంతృప్తి వ్యక్తం చేస్తున్నారు.' (పే. 295)

– 18,856 మందిని స్థానికేతరులుగా గుర్తించి, వారిలో 14,784 మందిని వెనక్కి పంపించింది.

– ఫేయిర్‌షేర్ సూత్రాన్ని శాఖాధిపతి కార్యాలయాల్లో, సచివాలయంలో అమలు చేస్తున్నారు.

– కాంట్రాక్ట్ నియామకాలలో, అవుట్‌సోర్సింగ్ నియామకాలలో స్థానిక రిజర్వేషన్‌లు పాటిస్తున్నారు.

– ప్రభుత్వ రంగ సంస్థల్లో కూడా రాష్ట్రపతి ఉత్తర్వులను అమలు చేస్తున్నారు.

– గిర్‌గ్లానీ కమిషన్ సిఫారసుల మేరకు 610 జి.ఒ. అమలు, రాష్ట్రపతి ఉత్తర్వుల అమలుకోసం శాశ్వత ప్రాతిపదికన హౌస్ కమిటీ, మంత్రివర్గ ఉపసంఘం, మానిటరింగ్ అథారిటీని ప్రభుత్వం ఏర్పాటు చేసింది.'

ఇంక ఇటువంటి అబద్ధాలను కమిటీ నివేదిక నుండి ఎన్నయినా ఉటంకించవచ్చు. కమిటీకి కనీసం యాభై తెలంగాణ ఉద్యోగ సంఘాలు నివేదికలు ఇచ్చినాయి. వ్యక్తిగతంగా కల్సి చర్చించాయి. ఏ తెలంగాణ ఉద్యోగ సంఘం ప్రభుత్వం తీసుకుంటున్న చర్యల పట్ల సంతృప్తిని వ్యక్తం చేశాయో కమిటీ వెల్లడించాలి. 18,856 మంది గుర్తించిన స్థానికేతరులలో 14,784 మందిని వెనక్కి పంపినారని కమిషన్ నిర్ధారించడం విస్మయం కలిగించక మానదు. ఎందుకంటే వీరందరు ఎ.పి.ఎ.టి. నుండి స్టేలను పొంది ఎవరి స్థానాల్లో వారు కొనసాగుతూనే ఉన్నారు. ఆ స్టేలను తొలగించేందుకు ప్రభుత్వం ఎటువంటి చర్యలు తీసుకోవడం లేదు. ఫేర్‌షేర్ సూత్రాన్ని సచివాలయంలో, శాఖాధిపతుల కార్యాలయాల్లో అమలు చేస్తున్నారని అనడం అబద్ధం. 2010లో సేకరించిన ఈ గణాంకాలు సెక్రటేరియట్‌లో పరిస్థితికి అద్దం పడతాయి.

| క్ర.సం. | కేటగిరి | ఆంధ్ర | తెలంగాణ (శాతం) | మొత్తం |
|---|---|---|---|---|
| 1. | అసిస్టెంట్ సెక్షన్ ఆఫీసర్స్ | 1320 | 180 (12) | 1500 |
| 2. | సెక్షన్ ఆఫీసర్స్ | 508 | 101 (16.5) | 609 |
| 3. | ప్రైవేట్ సెక్రటరీస్ | 68 | 11 (13.9) | 79 |
| 4. | అసిస్టెంట్ సెక్రటరీస్ | 150 | 38 (20.2) | 188 |
| 5. | డిప్యూటీ సెక్రటరీస్ | 43 | 13 (23.2) | 56 |
| 6. | జాయింట్ సెక్రటరీస్ | 23 | 3 (11.5) | 26 |
| 7. | అడిషనల్ సెక్రటరీస్ | 13 | 0 (0.0) | 13 |

ఇదీ పరిస్థితి. ఫెయిర్‌షేర్ సచివాలయంలో అమలయిందీ లేనిదీ పై పట్టిక తెలియజేస్తుంది. కీలకమైన ఎ.ఎస్.ఒ., ఎస్.ఒ. పోస్టుల్లో 20 శాతం కూడా తెలంగాణవారు లేకపోవడం పరిస్థితి తీవ్రతను తెలియజేస్తుంది. ఫెయిర్‌షేర్ (42 శాతం)కు తెలంగాణ దక్కాలంటే ఇంకెన్ని సంవత్సరాలు వేచి చూడాలో.

ఆంధ్రప్రదేశ్‌లో వందకు పైగా ప్రభుత్వరంగ సంస్థలున్నాయి. వాటిల్లో రాష్ట్రపతి ఉత్తర్వులు అమలవుతున్నాయని, కాంట్రాక్టు, అవుట్ సోర్సింగ్ నియామకాలలో స్థానిక రిజర్వేషన్‌లు అమలవుతున్నాయని ప్రభుత్వం జారీ చేసిన జి.ఒ.ల ఆధారంగా నిర్ధారణకు రావడం విచిత్రం. 610 జి.ఒ. 31 డిసెంబర్ 1985న జారీ అయితే ఇప్పటి దాకా ప్రభుత్వం అమలెందుకు చెయ్యలేదో కమిటీ ప్రశ్నించదు. అయితే అమలు చెయ్యకపోతే ఉద్యోగులు కోర్టుకు వెళ్లవచ్చు కదా అని ఉచిత సలహా ఇస్తుంది. అమలు విషయంలో ప్రభుత్వ జి.ఒ.లను, మెమోలను, సర్క్యులర్లను నమ్మి నిర్ధారణకు వస్తుంది. వాస్తవానికి ప్రభుత్వరంగ సంస్థలు ఇప్పటికీ రాష్ట్రపతి ఉత్తర్వులను అమలు చెయ్యడం లేదు. కాంట్రాక్టు, అవుట్ సోర్సింగ్ నియామకాలలో ఏ రిజర్వేషన్‌లు పాటించకుండా సీమాంధ్రులను నింపేస్తున్నారు. వీటిల్లో పది శాతం కూడా తెలంగాణ ఉద్యోగులు లేరని సచివాలయంలో చేరిన అవుట్ సోర్సింగ్, కాంట్రాక్టు ఉద్యోగుల జాబితాను పరిశీలిస్తే అర్థం అవుతుంది. కమిటీ వాస్తవ అమలును కాకుండా కాగితాల మీది రాతలను ఆధారం చేసుకొని నిర్ధారణకు రావడమే విషాదం.

11) 'నిజాం రాజులు తెలంగాణలో సాగునీటి ప్రాజెక్టులను నిర్మించకపోయినా హైదరాబాద్‌ని మాత్రం పటిష్ఠమైన నగరంగా అభివృద్ధి చేశారు.' (పే. 296)

ఇదొక అర్ధసత్యం. హైదరాబాద్ నగరాన్ని సకల సౌకర్యాలు కలిగిన నగరంగా అభివృద్ధి చేసిన మాట వాస్తవమే. ఆధునిక హైదరాబాద్ నగరం ఆరవ నిజాం మహబూబ్ అలీఖాన్ కాలంలో అభివృద్ధి చెందడం ప్రారంభమైంది. అయితే తెలంగాణ సాగునీటి పథకాలను నిర్లక్ష్యం చేశారని అనడం అబద్ధం. నిజానికి చెరువుల నిర్మాణం కాకతీయుల కాలంలో, ఆ తర్వాత కుతుబ్‌షాహీల పాలనలోనే పెద్ద ఎత్తున జరిగింది. అసఫ్‌జాహీల కాలం నాటికి చిన్న చెరువులతో పాటు మధ్యతరహా, భారీ ప్రాజెక్టుల నిర్మాణం కూడా ప్రారంభమైంది. 1920 నాటికే పోచారం ప్రాజెక్టు (మెదక్), ఢిండీ ప్రాజెక్ట్ (నల్లగొండ), పాలేరు (ఖమ్మం), వైరా (ఖమ్మం), ఎగువ మానేరు (కరీంనగర్), సదీర్‌మాట్ (ఆదిలాబాద్), ఫతేనహర్, మహబూబ్‌నహర్ (మెదక్), స్వర్ణ (ఆదిలాబాద్), సరళాసాగర్ (మహబూబ్‌నగర్) మొదలైన మధ్యతరహా ప్రాజెక్టులు నిర్మాణం అయినాయి. ఆ తర్వాత గోదావరి, కృష్ణా నదుల సమగ్ర అభివృద్ధి పథకాలలో భాగంగా భారీ ప్రాజెక్టుల రూపకల్పన జరిగింది. 1930 నాటికి నిజామాబాద్ జిల్లాలో నిజాం సాగర్ ప్రాజెక్టు పూర్తయింది. 1940 నాటికి ఆదిలాబాద్ జిల్లాలో కడెం ప్రాజెక్టు నిర్మాణం పూర్తయింది. పోచంపాడు వద్ద నాలుగు వందల టి.ఎం.సి.ల వినియోగంతో ఆదిలాబాద్, నిజామాబాద్, కరీంనగర్, వరంగల్, నల్లగొండ జిల్లాలలో నలభై లక్షల ఎకరాలకు సాగునీరు అందించే సమగ్ర గోదావరి అభివృద్ధి పథకం, కృష్ణా నదిపై నల్లగొండ జిల్లాలో నందికొండ ప్రాజెక్టు, మెదక్ జిల్లాలో మంజీరా నది పై దేవనూరు ప్రాజెక్టు, గోదావరిపై ఇచ్చంపల్లి ప్రాజెక్టు, తుంగభద్ర నదిపై మహబూబ్ నగర్ జిల్లాకు సాగునీరందించే రాజోలిబండ డైవర్షన్ స్కీం, అప్పర్ కృష్ణా ప్రాజెక్టు, భీమానదిపై భీమా ప్రాజెక్టుల రూపకల్పన జరిగింది. ఇవన్నీ కూడా నిజాం ప్రభుత్వంలో పనిచేస్తున్న ప్రతిభావంతులైన ఇంజనీరు అలీనవాజ్ జంగ్ కానుకలే. గోదావరి, కృష్ణా బేసిన్‌లలో మొత్తం 1364 టి.ఎం.సి.ల నీటి వినియోగానికి పథకాలు ఆనాటికే రూపకల్పన జరిగి ఉన్నాయి. అయితే 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుతో ఈ పథకాలు కుదించబడడమో, అటకెక్కడమో జరిగింది. వాస్తవం ఇట్లా ఉండగా నిజాం రాజులు తెలంగాణలో సాగునీటి సౌకర్యాలను నిర్లక్ష్యం చేశారని అనడం వక్రీకరణ కాక మరేమవుతుంది.

12) '1956లో హైదరాబాద్ నగరం రాష్ట్ర రాజధానిగా మారిన తర్వాత కాస్మోపాలిటన్ సిటీగా అభివృద్ధి చెందింది.' (పే. 297)

నిజానికి హైదరాబాద్ నగరం 1956 కు ముందే కాస్మోపాలిటన్ సిటీగా అభివృద్ధి అయింది. ఆనాటికే మార్వాడీలు, కాయస్థులు, పంజాబీలు, తమిళులు, మరాఠీలు, కన్నడిగులు, ఇరానీయన్లు, అబిసీనియన్లు, బుందేలీలు, కచ్చీలు, బెంగాలీలు, పార్సీలు, సింధీలు ఇట్లా అనేక భాషల, జాతుల ప్రజలు హైదరాబాద్ నగరంలో స్థిరపడి వ్యాపార కార్యకలాపాలు ప్రారంభించారు. హైదరాబాద్ నగరానికి ఒక కాస్మోపాలిటన్ సంస్కృతిని అందించారు. వారు హైదరాబాద్‌ని భిన్న సంస్కృతుల సమ్మేళనంగా మార్చారు. హైదరాబాద్‌లో విలసిల్లిన 'గంగా–జమునా తహజీబ్'ని సమున్నతంగా నిలబెట్టడంలో క్రియాశీలక పాత్ర పోషించారు. అయితే వారెన్నడూ ఇవ్వాళ ఆంధ్రులు చెప్తున్నట్లుగా తామే హైదరాబాద్‌ని అభివృద్ధి చేశామని గొప్పలు చెప్పుకోవడం లేదు.

13) హైదరాబాద్ ప్రపంచ నగరంగా అభివృద్ధి చెందడంలో హైదరాబాద్ నగర రూపురేఖలు (ల్యాండ్‌స్కేప్) గణనీయంగా మారిపోవడంలో మొదట ఎన్.టి.ఆర్., ఆ తర్వాత చంద్రబాబు నాయుడుల పరిపాలన దోహదం చేసింది. (పే. 298)

నిజమే 1983లో ఎన్.టి. రామారావు ముఖ్యమంత్రి అయినాక హైదరాబాద్ ల్యాండ్‌స్కేప్ మారిపోవడం ప్రారంభమైనాక, చంద్రబాబు నాయుడు, వై.ఎస్. రాజశేఖరరెడ్డిలు మొత్తం హైదరాబాద్ తన చారిత్రక వైభవాన్ని కోల్పోవడంలో ముఖ్య పాత్ర వహించారు. బంజారాహిల్స్, జూబ్లీహిల్స్, మాదాపూర్, కూకట్‌పల్లి, శంషాబాద్, హయత్‌నగర్, తదితర హైదరాబాద్ శివారు ప్రాంతాలన్నీ సీమాంధ్ర వలసవాదులకు అడ్డాలుగా మారిపోయినాయి. ఇన్నర్ రింగ్‌రోడ్డు, అవుటర్ రింగ్‌రోడ్డు, రామోజీ ఫిల్మ్‌సిటీ, హైటెక్ సిటీ, అంతర్జాతీయ విమానాశ్రయం, బయోటెక్ పార్కులు, ఐ.టి. పార్కులు, ఎం.ఎం.టి.ఎస్. రైల్వే లైన్లు తదితర ప్రాజెక్టులను చూపించి వేలాది ఎకరాలలో రియల్ ఎస్టేట్లను ప్రారంభించి కోట్లకు పడగలెత్తినవారు – ఎవరు? ఈ ప్రాజెక్టుల్లో విస్థాపనకు గురి అయిన ప్రజలు ఎవరు? ఈ ప్రాజెక్టులకు మౌలిక సదుపాయాలకు పెట్టుబడులు సమకూర్చింది ప్రభుత్వం అయితే, వాటిని వినియోగించుకొని లాభపడింది సీమాంధ్ర పెట్టుబడిదారులు. ఇదంతా తమ వల్లే జరిగిందని వీరు గప్పాలు కొట్టుకోవడం శ్రీకృష్ణ కమిటీ దాన్ని నమ్మడం ఎంత చిత్రం! హైదరాబాద్ శివార్లలో 1983 వరకు ఐదు వందల వరకు చెరువు కుంటలు ఉండేవి. వందలాది బాగ్‌లు ఉండేవి. సీమాంధ్రుల ధన దాహానికి నాలుగు వందల చెరువులు కుంటలు మాయమైనాయి. నగరానికి పచ్చదనాన్ని ఇచ్చిన బాగ్‌లు ఎక్కడ మాయమైనవి? నగరం నడిబొడ్డులో చిరాన్ ప్యాలెస్ చుట్టూ ఉన్న రిజర్వ్ అటవీ ప్రాంతం కాసు బ్రహ్మానందరెడ్డి పార్క్‌గా పేరు మార్చుకొని కాంక్రీట్ జంగిల్‌గా మార్చింది చంద్రబాబు నాయుడు కాదా! నగరంలో జరిగిన మహా విధ్వంసాన్ని అభివృద్ధిగా పరిగణించడం శ్రీకృష్ణ కమిటీ హ్రస్వ దృష్టికి నిదర్శనం. కాంక్రీట్ నిర్మాణాలే అభివృద్ధి సూచికలుగా పరిగణించడం వారి అమానవీయ ధోరణికి అద్దం పడుతుంది.

14) 'ఉప ప్రాంతీయ ఉద్యమంగా తెలంగాణ ఉద్యమం జాతీయ సమైక్యతకు భంగకరం కాకపోయినప్పటికీ ఈ ఉద్యమం ప్రభావం జాతి మీద ఉంటుంది.' (పే. 344)

ఒకవైపు తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఉద్యమం జాతి వ్యతిరేకం కాదు అంటూనే జాతిపై దాని ప్రభావాలుంటాయి అంటున్నారు. ఆ కారణం చేత తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుపై విస్తృత చర్చ జాతీయ దృష్టికోణం నుండి జరపాలి అని కమిటీ అభిప్రాయపడింది. తెలంగాణ డిమాండ్ దేశంపై వేసే తక్షణ ప్రభావం ఏముంటుంది? దేశంలో మరికొన్ని ప్రాంతాలలో ఇప్పటికే వేళ్లూనికొని ఉన్న ప్రత్యేక రాష్ట్ర డిమాండ్‌లు తలెత్తి ఉధృతమవుతాయి. అటువంటి డిమాండ్లలో ప్రబలంగా ముందుకు వచ్చేవి మహారాష్ట్రలో విదర్భ, బెంగాల్‌లో గోర్ఖాల్యాండ్, ఉత్తర ప్రదేశ్‌లో హరితప్రదేశ్, మధ్యప్రదేశ్‌లో బుందేల్‌ఖండ్ డిమాండ్‌లు. అయితే ఈ డిమాండ్‌లు వెల్లువెత్తడం అనే సాకుతో తెలంగాణ డిమాండ్‌ను తీర్చకపోవడం అప్రజాస్వామికం. చిన్న రాష్ట్రాల డిమాండ్ దేశంలో రావడం ఇదే ప్రథమం కాదు. ఆఖరూ కాదు. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ పరిణామ క్రమాన్ని పరిశీలిస్తే 19వ శతాబ్ది తొలినాళ్ల నుండే ప్రత్యేక రాష్ట్రాల కోసం, ప్రావిన్సుల కోసం డిమాండ్లు వస్తూనే ఉన్నాయి. ఏ డిమాండ్ వచ్చినా అది శూన్యంలో నుంచి ఆకస్మికంగా ఊడిపడదు. ఆ డిమాండ్ వెనక ప్రబలమైన చారిత్రక, ఆర్థిక, రాజకీయ కారణాలు, భాషా సాంస్కృతిక అణచివేత, అసమ అభివృద్ధి, వనరుల దోపిడీ... ఇట్ల అనేక కారణాల సమాహారంగా ఆయా డిమాండ్లు ముందుకు వచ్చినప్పుడు వాటిని ప్రజాస్వామ్యబద్ధంగా పరిష్కరించడం దేశం బాధ్యత. అటువంటి డిమాండ్లు దేశ సమైక్యతను విచ్ఛిన్నం చేస్తాయన్న భావజాలమే తప్పు. అది ఆధిపత్య శక్తుల, వనరుల దోపిడీని కొనసాగించదల్చుకున్న వర్గాల భావజాలమే. తమిళుల ఆధిపత్యం కింద నలిగిపోయిన ఆంధ్రులు ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రాన్ని కోరుకోవడం ఎంత న్యాయబద్ధమో, ఎంత ప్రజాస్వామికమో, సీమాంధ్రుల ఆధిపత్యం కింద నలిగిపోతున్న తెలంగాణ ప్రజల ప్రత్యేక రాష్ట్ర డిమాండ్ అంతే న్యాయబద్ధమైనదే, ప్రజాస్వామికమైనదే అన్న సంగతిని సీమాంధ్రులు గమనించి విడిపోవడం హక్కు అవుతుందే తప్ప కల్సి ఉండడం హక్కు కాదనేది ఇవ్వాళ్టి ప్రపంచం నమ్ముతున్న న్యాయసూత్రం. అయితే ఆంధ్రులు మాత్రం కల్సి ఉండడాన్ని కూడా ఒక హక్కుగా తెలంగాణ ప్రజల మీద రుద్దడం వారి ఆధిపత్య భావజాలానికి నిదర్శనం.

15) '29 నవంబర్ 2009న ప్రారంభమైన ఉద్యమంలో లెక్కలేనన్ని జాయింట్ ఆక్షన్ కమిటీలు ఏర్పడినాయి. వాటిలో ఉస్మానియా యూనివర్సిటీలో ప్రొ. కోదండరామ్ నాయకత్వంలో ఏర్పడినది ప్రధానమైనది. అయితే మొదట్లో అన్ని పార్టీలు ఈ జె.ఎ.సి.లో భాగంగా ఉన్నప్పటికీ, ఆ తర్వాత టి.ఆర్.ఎస్. సహా చాలా పార్టీలు జె.ఎ.సి.లోంచి తొలగిపోయాయి.' (పే. 349)

తెలంగాణలో 'బారా ఖూన్ మాఫ్' అనే పలుకుబడి ఉంది. పన్నెండు హత్యలు చేసినా క్షమించడం – అంటే ఏం చేసినా చెల్లుబాటు అవుతుందని చెప్పడానికి ఈ పలుకుబడిని వాడతారు. ఇది తెలంగాణ మీద రాస్తున్న రిపోర్ట్ కదా ఏం రాసినా చెల్లుతుందన్న బారాఖూన్ మాఫ్ ధోరణికి ఇది మచ్చుతునక. టి.ఆర్.ఎస్. కూడా జె.ఎ.సి.లోంచి తొలగిపోయిందని ఏ సమాచారం ఆధారంగా రాసినారో ఘనత వహించిన జస్టిస్ శ్రీకృష్ణ తెలంగాణ ప్రజలకు సంజాయిషి ఇవ్వాలి. ఇటువంటి అబద్ధాలను నివేదికలో పొందుపర్చిన కమిటీ సభ్యులను ఎందుకు ప్రాసిక్యూట్ చెయ్యకూడదో వారు ప్రజలకు చెప్పాలి. లేదా కేంద్ర మంత్రి చిదంబరం కమిటీ సభ్యులకు 'ఖూన్ మాఫ్ సర్టిఫికేట్'ని భారత రాష్ట్రపతి నుండి ఇప్పించారా? చిదంబరం స్పష్టం చెయ్యాలి.

16) 'తెలంగాణ, కోస్తా ఆంధ్రకు మధ్యన ఉన్న ఖమ్మం జిల్లా ప్రజలు తెలంగాణ రాష్ట్రం పట్ల మిశ్రమ అభిప్రాయాలు వ్యక్తం చేశారు.' (పే. 350)

ఏమిటీ బేహొద్గీ! ఖమ్మం జిల్లా ఎక్కడుందో తెలియకుండానే ఖమ్మం జిల్లా ప్రజల అభిప్రాయాలను ఈ రకంగా నివేదించడం! మిస్టర్ జస్టిస్! మళ్లొకసారి ఆంధ్రప్రదేశ్ చిత్రపటాన్ని వీక్షించండి. ఖమ్మం జిల్లా పూర్తిగా తెలంగాణలో భాగంగానే ఉంది. తెలంగాణ ప్రజలు అడుగుతున్నది 31 అక్టోబర్ 1956న ఏ ప్రాంతాలైతే ఆంధ్రతో కలిపారో అవే భూభాగాలతో తెలంగాణ రాష్ట్రాన్ని ఏర్పాటు చెయ్యమని. ఖమ్మం జిల్లాని తెలంగాణ నుండి వేరు చెయ్యాలన్న కుట్ర కాదుగదా?

ఇకపోతే చివరకు 'ది వే అహెడ్' పేరిట సమస్యకు ఆరు పరిష్కార మార్గాలను లేదా ప్రత్యామ్నాయాలను కమిటీ చర్చించింది. ఇవన్నీ ఇప్పటికే విస్తృతంగా ప్రజల్లో చర్చకు వస్తున్నాయి. ఈ ఆరింటిలో కమిటీ మొదటి మూడు ప్రత్యామ్నాయాలు ఆచరణ యోగ్యం కావని,

వాటి వల్ల సమస్య మరింత తీవ్రతరం అవుతుందని తానే తిరస్కరించింది. ఇక్కడ ప్రశ్న ఏమిటంటే ఆచరణయోగ్యం కావని తామే తిరస్కరించిన వాటిని అసలు ప్రత్యామ్నాయంగా చర్చించడం ఎందుకు? ఈ ఆరు ప్రత్యామ్నాయాలను సంక్షిప్తంగా ఇట్లా పేర్కొనవచ్చు.

1) యథాతథ స్థితిని కొనసాగించడం

ఇప్పుడు రాష్ట్రంలో నెలకొని ఉన్న సవాలక్ష సమస్యల నేపథ్యంలో, తెలంగాణ ప్రజలలో ఉన్న సున్నితమైన తెలంగాణ భావోద్వేగాల నేపథ్యంలో యథాతథ స్థితిని కొనసాగించడం సాధ్యం కాదని అభిప్రాయపడింది. ఏదో ఒక రకంగా ఈ పరిస్థితి మార్చడం అనివార్యమని భావిస్తూ ఈ ప్రత్యామ్నాయం చిట్టచివరిగా పరిశీలించవల్సిన ప్రత్యామ్నాయం కమిటీ అభిప్రాయపడింది.

2) రాష్ట్రాన్ని సీమాంధ్రగా, తెలంగాణగా విభజించడం హైదరాబాద్ నగరాన్ని కేంద్రపాలిత ప్రాంతంగా చేయడం, రెండు రాష్ట్రాలకు రెండు కొత్త రాజధాని నగరాలను అభివృద్ధి చేయడం.

తెలంగాణ ప్రజలు హైదరాబాద్‌ని రాజధానిగా తెలంగాణ రాష్ట్రాన్ని కోరుతున్న నేపథ్యంలో అసలు ఇటువంటి ప్రత్యామ్నాయాన్ని ప్రతిపాదించి చర్చించడం కుట్రపూరితం. ఈ ప్రత్యామ్నాయం పట్ల తెలంగాణ ప్రజల్లో పెల్లుబుకే వ్యతిరేకత తీవ్రత కమిటీకే తెలుసు. ఈ వ్యతిరేకతను నివారించడం తేలిక కాదనే సంగతి కూడా కమిటీకి తెలుసు. గత ఐదు వందల సంవత్సరాలలో ఈ ప్రాంతానికి రాజధానిగా, అధికార కేంద్రంగా, మేధో సాంస్కృతిక వికాస కేంద్రంగా ఉన్న హైదరాబాద్ నగరం యాభై ఏండ్ల వలస పాలనతోనే తమకు కాకుండా పోవడం సహించలేని విషయం. హైదరాబాద్‌లేని తెలంగాణ తలలేని మొండెం లాంటిది అని, హృదయం లేని శరీరం లాంటిదని చాటుకున్నారు. బెల్జియంలోని బ్రస్సెల్స్ నగరంతో పోలిక తెచ్చి హైదరాబాద్ నగరాన్ని కూడా ఒక స్వతంత్ర ప్రతిపత్తిగల్గిన పాలనా యూనిట్‌గా మార్చాలన్న చర్చను కమిటీ చేసినప్పటికీ చివరికి తెలంగాణ ప్రజల నుండి (తక్షణం వచ్చే తీవ్రమైన వ్యతిరేకతకు జడిసి ఈ ప్రత్యామ్నాయం ఆచరణ యోగ్యం కాదని తేల్చేసింది.

3) రాష్ట్రాన్ని రాయల తెలంగాణగా, ఆంధ్రగా విడదీయడం, హైదరాబాద్‌ని రాయల తెలంగాణకు రాజధానిగా చేయడం –

ఇటువంటి ప్రతిపాదనను కమిటీ ముందు పెట్టింది హైదరాబాద్ పాతబస్తీకి మాత్రమే పరిమితమైన మజ్లిస్ పార్టీ. మజ్లిస్ పార్టీ కమిటీ ముందు ఉంచిన ఈ దిక్కుమాలిన ప్రత్యామ్నాయాన్ని కమిటీ పరిగణనలోకి తీసుకోవడం ఎందుకు? అంతిమంగా దాన్ని తిరస్కరించడం ఎందుకు? ఈ ప్రత్యామ్నాయం పట్ల రాయలసీమ వాసులకు ఆమోదం ఉండవచ్చుగాక. తెలంగాణ ప్రజలెందుకు అంగీకరిస్తారు? తెలంగాణ ప్రజలు, కోస్తాంధ్ర ప్రజలు ఈ ప్రత్యామ్నాయాన్ని వ్యతిరేకిస్తారని, దీనికి తోడు మతతత్వ శక్తుల ప్రాబల్యం (హిందూత్వ శక్తులా? ఇస్లామిక్ శక్తులా?) పెరిగిపోతుందని కమిటీ ఈ ప్రత్యామ్నాయాన్ని ఆమోదయోగ్యం కానిదిగా తీసిపారేసింది.

4) రాష్ట్రాన్ని సీమాంధ్రగా, తెలంగాణగా విభజించడం. హైదరాబాద్ నగర పరిధిని విస్తరించి కేంద్రపాలిత ప్రాంతంగా మార్చడం. ఈ కేంద్రపాలిత ప్రాంతానికి నల్గొండ జిల్లా ద్వారా గుంటూరు జిల్లాకు, మహబూబ్‌నగర్ జిల్లా ద్వారా కర్నూలుకు భౌగోళికంగా లింకు ఉంటుంది.

రెండో ప్రత్యామ్నాయం, ఈ నాల్గో ప్రత్యామ్నాయం ఒకటే. ఇక్కడ నల్గొండ జిల్లాలో కొన్ని మండలాలు, మహబూబ్‌నగర్ జిల్లాలో కొన్ని మండలాలు కలుపుకొని హైదరాబాద్ నగర కేంద్రపాలిత ప్రాంతానికి ఒక కారిడార్‌ని ఏర్పర్చాలన్న యోచన ఉన్నది. 12,430 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంలో 67 మండలాలు, 1330 రెవెన్యూ గ్రామాలు కలిగి ఉన్న ప్రాంతాన్ని వీరు ఒక మ్యాప్ ద్వారా సూచించారు. ఎవడబ్బ సొమ్మని కమిటీ ఈ రకమైన ప్రత్యామ్నాయాన్ని సూచిస్తున్నది? హైదరాబాద్ నగరానికి, కోస్టల్ కారిడార్‌కి ప్రవేశ మార్గాన్ని ఏర్పాటు చేసి దేశీయ పెట్టుబడికి, అంతర్జాతీయ పెట్టుబడికి ఎటువంటి ఆంక్షలు లేకుండా హైదరాబాద్, తెలంగాణ వనరులపై ఇప్పటికే ఉన్న భల్లూకపు పట్టుని కొనసాగించడమే ఈ ప్రత్యామ్నాయం వెనుక ఉన్న లక్ష్యం. అపుడు చండీఘడ్ లాగా హైదరాబాద్ నగరం కూడా సీమాంధ్రకు, తెలంగాణకు ఉమ్మడి రాజధానిగా ఉండగలుగుతుంది. వహ్వా! జస్టిస్! ఏమి న్యాయం! ఏమి చతురత! ఎటు తిరిగి హైదరాబాద్ నగరాన్ని తెలంగాణకు దక్కకుండా చెయ్యాలన్న కుట్రకు ఈ ఆరుగురు సభ్యుల కమిటీ కూడా వంతపాడడం ఎంత విషాదం. అయితే కమిటీకి ఈ ప్రత్యామ్నాయం పట్ల తీవ్రమైన వ్యతిరేకత వస్తుందని, ప్రజల ప్రతిఘటన తప్పదని తెల్సు. ఇంకో రహస్యాన్ని కూడా కమిటీ కనిపెట్టింది. తెలంగాణలో హైదరాబాద్ ఉన్నా లేకున్నా మావోయిస్టుల కార్యకలాపాలు పెరిగిపోతాయంట. మావోయిస్టులు ఎక్కడైనా ఎందుకు పుడతారో ఈ కమిటీకి అర్థం కానేలేదు. పాలకవర్గాల ఆలోచనా విధానంతోనే ఆలోచిస్తున్న ఈ కమిటీకి మావోయిస్టులు దేశ అంతరంగిక భద్రతకు ముప్పుగా ఉన్నారన్న విషయాన్ని నివేదికలో ఎన్నిసార్లు ప్రస్తావించారో లెక్కలేదు. ఈ అంశాలన్నిటిని నివేదిక ఎనిమిదో చాప్టర్‌లో చర్చించారట. డైమెన్షన్స్ ఆఫ్ ఇంటర్నల్ సెక్యూరిటీ పేరున ఈ చాప్టర్ ప్రజల ముందుంచక సీల్డ్ కవర్‌లో ప్రభుత్వానికి సమర్పించారు. మాడభూషి శ్రీధర్ లాంటి విశ్లేషకులు చెప్తున్నదేమిటంటే రహస్యంగా ఉంచిన ఈ ఎనిమిదో చాప్టర్‌లో చర్చించిన అంశాలే కమిటీ నిర్ణయాలకు ప్రధాన ప్రాతిపదికలుగా ఉన్నాయి.

5) రాష్ట్రాన్ని ఇపుడున్న సరిహద్దులతోనే సీమాంధ్ర, తెలంగాణలుగా విభజించడం, హైదరాబాద్‌ని తెలంగాణకు రాజధాని చేయడం, సీమాంధ్రకు మరో కొత్త రాజధానిని నిర్మించడం.

ఈ ప్రత్యామ్నాయం కమిటీ దృష్టిలో రెండో ఉత్తమ ప్రత్యామ్నాయం. ఈ రెండు ఉత్తమ ప్రత్యామ్నాయాన్ని మొదటి ఉత్తమ ప్రత్యామ్నాయం (ఆరవది) సాధ్యం కాకపోతేనే పరిశీలించాలి. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు డిమాండ్ న్యాయబద్ధమైనదే అని కమిటీ అంగీకరించింది. ఈ డిమాండ్‌ని నెరవేర్చడం ద్వారా తెలంగాణ ప్రాంతంలోని అత్యధిక ప్రజానీకం ఆకాంక్ష నెరవేరుతుందని కూడా కమిటీ అభిప్రాయపడింది. అయితే తెలంగాణలో అన్ని జిల్లాలలో ఒకే స్థాయిలో తెలంగాణ సెంటిమెంట్ లేదట. వరంగల్, పశ్చిమ ఖమ్మం (?), నిజామాబాద్, కరీంనగర్, దక్షిణ ఆదిలాబాద్, మెదక్ జిల్లాలో సిద్ధిపేట ప్రాంతం, నల్లగొండ, మహబూబ్‌నగర్ జిల్లాల్లో కొంత భాగంలో, రంగారెడ్డి జిల్లాలో కొన్ని ప్రాంతాలలో మాత్రమే తెలంగాణ ఆకాంక్ష వెల్లడి అయిందట. హైదరాబాదీ ముల్కీలు (ఒరిజినల్ పాపులేషన్), మజ్లిస్ ప్రాబల్యం ఉన్న పాతబస్తీ ప్రాంతాలు, మహారాష్ట్ర, ఛత్తీస్‌ఘడ్, కోస్తాంధ్ర, రాయలసీమ, కర్నాటక సరిహద్దు ప్రాంతాలలో, కరీంనగర్, ఖమ్మం, నిజామాబాద్ తదితర జిల్లాలోని సెటిలర్స్ గ్రామాలలో, ఎచ్.ఎం.డి.ఎ. పరిధిలో వలస ప్రజలు తెలంగాణ ఏర్పాటు పట్ల తటస్థ వైఖరిని వెల్లడించారట. ఉత్తర తెలంగాణ గిరిజనులు మన్యసీమ రాష్ట్రానికి అనుకూలమట. ఒడిషా, ఛత్తీస్‌ఘడ్, మహారాష్ట్ర సరిహద్దుల్లో ఉన్న గిరిజనులు సమైక్య రాష్ట్రానికి అనుకూలమట. అయ్యా! జస్టిస్ గారు అరకొరగా గ్రామాలు

తిరిగి ఎంపిక చేసిన ప్రజలతో మచ్చటించి ఇంత విస్తృత స్థాయిలో ప్రజల మనోగతాన్ని ఎట్లా అర్థం చేసుకున్నారు? తెలంగాణ నుండి ఒక లక్షా యాభై వేల వినతి పత్రాలు ఒకే ఒక డిమాండ్‌తో – తెలంగాణ రాష్ట్రం కావాలని – కమిటీకి వెళితే కమిటీ సభ్యులకు మాత్రం పైన వివరించిన విధంగా ప్రజాభిప్రాయం వెల్లడికావడం చిత్రం. తెలంగాణ ఉద్యమం మొదటి నుండి తెలంగాణలో ప్లెబిసైట్ నిర్వహించమని డిమాండ్ చేస్తున్నది. అది మాత్రమే తెలంగాణ ఆకాంక్ష స్థితిని వాస్తవంగా వెల్లడిచేస్తుంది. శ్రీకృష్ణ కమిటీ ఆ పని చేపట్టవలసి ఉండే. సాంపిల్ సర్వేలతో ప్రాజెక్టెడ్ నిర్ధారణలకు రావడం సమంజసమా? అయితే 1971లో ప్రజాభిప్రాయం ప్రబలంగా వెల్లడి అయినప్పటికీ తెలంగాణ డిమాండ్‌ని బుట్టదాఖలు చేసి ఇవ్వాళ మళ్లొకసారి వంచనకు పాల్పడుతున్నారు.

దీనికి తోడు తెలంగాణ ఏర్పడితే తలెత్తే సమస్యలని కూడా కమిటీ ఏకరువు పెట్టింది. కోస్తాంధ్ర, రాయలసీమల్లో హింసాత్మక ఉద్యమాలు ప్రజ్వరిల్లుతాయట. నీటి పంపకాల్లో వివాదాలు తలెత్తుతాయట. సీమాంధ్ర ప్రజా ప్రతినిధులపై రాజీనామాలకై ఒత్తిడి పెరుగుతుందట. ప్రత్యేక రాయలసీమ ఉద్యమం ఉధృతమవుతుందట. ఎప్పట్లాగే నక్సలిజం పెట్రేగిపోతుందట. ఇంకా మతతత్వం పెరిగిపోతుందట. దేశంలోని ఇతర ప్రాంతాలలో ప్రత్యేక రాష్ట్ర డిమాండ్లు పురుడు పోసుకుంటాయట. సీమాంధ్ర పెట్టుబడులకు మార్కెట్లు కుదించబడి ఆర్థిక వ్యవస్థ దెబ్బతింటుందట.

ఇవన్నీ ఉన్నప్పటికీ తెలంగాణ ఉద్యమాన్ని కఠినంగా, చతురంగా అణచివెయ్యలేక పోతే, అనివార్యమైతేనే, అందరి ఆమోదంతోనే తెలంగాణ ఏర్పాటు చెయ్యాలట. అందరి ఆమోదం అనే చిక్కుముడి విప్పడం ఎట్లా? విడిపోవడానికి అందరి ఆమోదం కావాలన్నప్పుడు మరి కలిసి ఉండడానికి అందరి ఆమోదం అవసరం లేదా మిస్టర్ జస్టిస్? ఇన్ని సమస్యలు ఉన్నాయి గనుకనే కమిటీ ఈ ప్రత్యామ్నాయాన్ని రెండవ ఉత్తమ ప్రత్యామ్నాయంగా పరిశీలనలోకి తీసుకోవాలని అభిప్రాయపడింది.

6) రాష్ట్రాన్ని సమైక్యంగా ఉంచుతూనే, రాజ్యాంగపరమైన, చట్టపరమైన చర్యలు చేపట్టాలి. తెలంగాణలో ఆర్థిక, సామాజిక అభివృద్ధికి, రాజ్యాధికారంలో సముచిత స్థానం తెలంగాణకు ఇవ్వడం కోసం తెలంగాణ రీజినల్ కౌన్సిల్‌ని ఏర్పాటు చెయ్యడం.

ఇది వారి దృష్టిలో మొదటి ఉత్తమ ప్రత్యామ్నాయం. ఇది ఎట్లాంటిదంటే, ఎక్స్‌పైరీ తేది దాటిన మందును రోగికి అందించడం లాంటిది. (డా. నర్సయ్యగారికి కృతజ్ఞతలు). ఎందుకంటే 1956 నుండి ఇప్పటిదాకా తెలంగాణకు కల్పించిన రాజ్యాంగ రక్షణలు, కమిటీల, కమిషన్‌ల సిఫారసులు, ఫార్ములాలు, కోర్టు తీర్పులు, జి.ఒ.లు తెలంగాణకు న్యాయాన్ని ఇవ్వలేకపోయినాయి. పెద్ద మనుషుల ఒప్పందంలో భాగంగా ఏర్పాటైన రీజినల్ కమిటీ (ఇది రీజినల్ కౌన్సిల్‌గా ఏర్పడవలసింది. కాని కమిటీగా ఏర్పడింది.) జి.ఒ. నెం. 36, ఆరు సూత్రాల పథకం, ఆర్టికల్ 371 (డి), రాష్ట్రపతి ఉత్తర్వులు, 610 జి.ఒ., గిర్‌గ్లానీ కమిటీ సిఫారసులు, రెండు హౌస్ కమిటీల సిఫారసులు, మంత్రుల కమిటీ, అధికారుల కమిటీ, తెలంగాణ ప్రాంతీయ అభివృద్ధి బోర్డు ఇవన్నీ 54 ఏండ్ల అన్యాయం చరిత్రకు, వివక్షతల చరిత్రకు, ఆధిపత్యాల చరిత్రకు సాక్ష్యాలు. ఫజల్ అలీ కమిషన్ తెలంగాణకు స్కాటిష్ డెవల్యూషన్ లాంటి ఏర్పాట్లు కూడా పనిచెయ్యవని చెప్పింది. చరిత్ర కూడా అదే రుజువు చేసింది. ఇవ్వాళ విఫల ప్రయోగాన్నే శ్రీకృష్ణ కమిటీ అత్యుత్తమ ప్రత్యామ్నాయంగా ముందుకు తెచ్చింది.

తెలంగాణలో రెండు సామెతలున్నాయి. కాశికి పోయి కొంగ పియ్యి తెచ్చినట్లు, కొండను తవ్వి ఎలకను పట్టినట్లు, శ్రీకృష్ణ కమిటీ ఎనిమిది నెలల సంప్రదింపుల అనంతరం కాశికి పోయి కొంగ పియ్యిని కూడా తేలేకపోయిందనీ, కొండను తవ్వి ఎలకను కూడా పట్టలేక పోయిందనీ నిపుణులు పెదవి విరుస్తున్నారు. జస్టిస్ శ్రీకృష్ణ లాంటి ఒక పేరుపొందిన న్యాయనిపుణుడి ఆధ్వర్యంలో రూపొందిన నివేదికనేనా ఇది అని అందరూ విస్మయం చెందుతున్నారు. కన్సల్టెంట్‌లు రూపొందించిన తప్పుల తడక నివేదికను పరిశీలించకుండానే సంతకం చేసి సమర్పించడం చూస్తే ముందే ఒక నిర్ధారణకు వచ్చి ఆ నిర్ధారణకు అనుకూలంగానే నివేదిక రూపొందినట్లు అర్థమవుతున్నది. సంప్రదింపుల్లో వెల్లడి అయిన ప్రజాభిప్రాయాన్ని ప్రతిఫలించేబదులు, సీమాంధ్ర సంపన్న వర్గాల ఆకాంక్షలు, వాటికి వెన్నుదన్నుగా ఉన్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ప్రయోజనాలే ఈ నివేదికలో ప్రతిఫలించాయి. నకల్ కొట్టడానికి (కాపీ కొట్టడానికి) అకల్ (బుద్ధి) ఉండాలంటారు. శ్రీకృష్ణ కమిటీ అకల్ లేకుండానే కన్సల్టెంట్‌లు రూపొందించిన నివేదికలను నకల్ చేసింది. వాస్తవాలను విస్మరించింది. తొక్కి పెట్టింది. వక్రీకరించింది. గణాంకాలను తనకు వాదనకు అనుకూలంగా వాడుకున్నది.

విచిత్రమేమిటంటే, 'వాస్తవాలను విస్మరించడం అపచారం. వాస్తవాలను సరిగ్గానూ, సంపూర్ణంగానూ ఎదుర్కోకపోతే అవి ప్రతీకారం తీర్చుకుంటాయి' అనే సర్దార్ వల్లభభాయ్ పటేల్ మాటల్ని ఉటంకిస్తూ నివేదిక ముగించారు. ఈ ఉటంకింపు అక్షరమక్షరంగా శ్రీకృష్ణ కమిటీకే వర్తిస్తుంది. తెలంగాణ వాస్తవికత ప్రతీకారం తీర్చుకోవడానికి సిద్ధపడుతున్నది.

(అల్లం నారాయణకు కృతజ్ఞతలు)

*(రచయిత నీటి పారుదల శాఖలో ఇంజనీరు, తెలంగాణ రచయితల వేదిక నాయకులు)*

విశాల సాహితి బి.ఎస్. రాములు పురస్కారాలు 1998 నుండి ఇవ్వబడుతున్నవి. ఈసారి మునుపెన్నడూ లేని విధంగా 106 గ్రంథాలు పురస్కార పరిశీలనకు అందాయి. అనేక కోణాల్లో పరిశీలించిన మీదట 2007–2010 సంవత్సరాలకు గాను పురస్కారాలకు 16 మందిని ఎంపిక చేయడం జరిగింది. ఈ కింది రచయితలు ఎంపికయ్యారు – రామచంద్రమౌళి, ఐతా చంద్రయ్య, దిలావర్, అనిశెట్టి రజిత, గూడ అంజయ్య, జీవన్, శిరంశెట్టి కాంతారావు, వంగూరి చిట్టెన్‌రాజు, నారాయణస్వామి, ఎ.ఎన్. జగన్నాథ శర్మ, కొండవీటి సత్యవతి, విహారి, బొజ్జా విజయభారతి, బండ సరోజన, సయ్యద్ నశీర్ అహమ్మద్, కె. జితేంద్రబాబు. వీరికి కొంత నగదుతోపాటు మెమెంటో సత్కారం ఉంటుంది. రాష్ట్రంలో జరిగే ఉద్యమాల వెల్లువలో దొరికే వీలునుసరించి జనవరి, ఫిబ్రవరి 2011లో పురస్కారాల సభ హైదరాబాద్‌లో జరుగుతుంది. సామాజిక తత్వవేత్త, సుప్రసిద్ధ రచయిత బి.ఎస్. రాములు గారి 50వ జన్మదిన స్వర్ణోత్సవం సందర్భంగా బీడీ కార్మికురాలైన వారి తల్లి కీ.శే. మిట్టపల్లి లక్ష్మీరాజవ్వ (1930–1991) పేరిట ప్రారంభించిన ఈ పురస్కారాలను 1998 నుండి ఇప్పటి వరకు 50 మంది సాహితీవేత్తలకు ఇవ్వడంతోపాటు వందలాది రచయితలను సత్కరించారు.

**– గూడూరి సీతారాం**

విశాల సాహితి బి.ఎస్. రాములు పురస్కారాల కమిటీ

*దేశవ్యాప్తంగా ప్రజలపై అమలవుతున్న రాజ్యహింస గురించి చెపుతూ, శ్రమ జీవుల పక్షాన నిల్చుంటారో, పాలకవర్గాలవైపు నిల్చుంటారో బుద్ధిజీవులు తేల్చుకోవాల్సిన సందర్భం ఇది అంటున్నారు* **వరవరరావు**

# అభివృద్ధి పథంలో రాజ్యహింస

'ఇదివరకు నేను కూడ యాపిల్ పండ్ల గురించి, పువ్వులు, వెన్నెల గురించే రాసేవాణ్ని. కాని జనరల్! నీ ప్రసంగాలు వింటున్నప్పటి నుంచి నీ గురించే రాయాల్సి వస్తున్నది' – సుప్రసిద్ధ జర్మన్ రచయిత బెర్టోల్ట్ బ్రెఖ్ట్ నాజీ హిట్లర్‌ను ఉద్దేశించి రాసిన మాటలివి.

గవర్నర్ గారు డిసెంబర్ 31 తర్వాత జనవరి 1 వస్తుందన్నాడు గానీ అసలు డిసెంబర్ 31 వచ్చినట్లు లేదు. డిసెంబర్ 30 పొగమంచు వీడీవీడక ముందే వచ్చి కేంద్ర హోంమంత్రికి ఏదో చిదంబర రహస్యం చెప్పి వెళ్లిపోయినట్లున్నది – ఏకంగా ఇంక జనవరి ఆరే వచ్చింది. లేక గవర్నర్‌గారు సెలవిచ్చిన జనవరి 1, డిసెంబర్ 31 అర్ధరాత్రి మొదలయ్యే వేడుకలను భగ్నం చేయడానికి ఇష్టం లేక 'తొందరపడి ఒక కోయిల' ముందే ప్రభుత్వం చెవిలో కూసిందేమో. తెలంగాణ ప్రజల హృదయ స్పందనల కాలమానం – ఒక రోజుకోసం నిరీక్షణ అంటే ఒక వారమని తెలిసివచ్చింది.

ఇంత కాలజ్ఞానం లేని పామరుణ్ని డిసెంబర్ 31 నుంచి జనవరి 6 ఆరు రోజులు కదా అనుకొని ఆరు నెలల ముందే ఒడిషాలోని బాలేశ్వర్‌లో పుస్తకోత్సవాల్లో 'చంద్రభాగ' అనే సాహిత్య పత్రిక ఐదో వార్షికోత్సవంలో మాట్లాడడానికి ఒప్పుకొని బయల్దేరాను. బాలేశ్వర్ మన తెలుగు సాహిత్యంలో గురజాడతో పోల్చదగిన ఫకీర్ మోహన్ అనే ఆధునిక ఒడియా సాహిత్య ప్రవక్త పుట్టిన ఊరు. ఆయన 'షికార్' కథ ఆధారంగానే బెంగాలీ సినీ దర్శకుడు మృణాల్‌సేన్ 'మృగయా' అనే సినిమా తీసాడు. తెల్లదొరకు వేట నేర్పి, కుందేలు మొదలు పులి వరకు వీరోచితంగా వేటాడినందుకు బహుమతులు పొందుతూ తెల్లదొరకు, దొరసానికి బంగ్లాలో సన్నిహిత మిత్రుడయిన ఒక ఆదివాసీ యువకుడు తన వివాహపు తొలి రాత్రి గుడిసె నుంచి తన నవ వధువును బలవంతంగా ఎత్తుకపోయి దారుణంగా చెరచిన మహాజన్‌ను వెంటాడి కసిగా ప్రతీకారంగా వేటాడి శిరసు తెచ్చి బహూకరించినందుకు ఉరికంబం ఎక్కాల్సివచ్చింది. సాక్ష్యం ఆ తెల్లదొర, దొరసానులే.

విచిత్రంగా నా ప్రయాణం పొడుగునా ఈ వేట వార్తలే. 5వ తేదీన భువనేశ్వర్‌లో దిగాను. అప్పటికే టుంకా అడవుల్లో జనవరి 2న జరిగిందని చెప్తున్న ఎన్‌కౌంటర్ వార్తతో భువనేశ్వర్ ఉద్విగ్నంగా ఉన్నది. ఐదు సంవత్సరాల క్రితం ఇదే జనవరి 5న కళింగనగర్‌లో టాటా ఉక్కు ఫ్యాక్టరీ నిర్మాణాన్ని అడ్డుకున్న ఆదివాసులపై పోలీసులు, టాటా భద్రతా సిబ్బంది కాల్పులు జరిపారు. పదముగ్గురు మరణించారు. ఆ ఆదివాసీ అమరుల ఐదవ సంస్మరణ వార్షికోత్సవాల ఏర్పాట్లలో ఉన్న పరిసర గ్రామాలపై దాడులు చేసి ఎందరినో పోలీసులు డిసెంబర్ 20న ఎత్తుకపోయారు. ఒకరి జాడ ఒకరికి తెలియదు. చివరకు జనవరి 2న ఒక ఎన్‌కౌంటర్ జరిగినట్లు అందులో ఐదుగురు మావోయిస్టులు చనిపోయినట్లు పోలీసులు ప్రకటించారు. మన టివిలకు కూడా అందులో ప్రముఖ మావోయిస్టులు ఉండి ఉంటారని అనిపించింది. ఆ అయిదుగురూ ఊరూ పేరూ లేని ఆదివాసులే. అందులో నలుగురు మహిళలు. ఆ నలుగురిలో ఒకరు పన్నెండేళ్ల పసిబాల. ఇది కప్పిపుచ్చుకోవడానికి అక్కడ ఒక ఆయుధపు డంపు దొరికిందని ఒక కథ అల్లారు. అంతకు ముందే గంధ మాదన్ పర్వతాల్లో గనుల తవ్వకం చేపట్టవద్దని ఏర్పడిన ఒక ఐక్య పోరాట సంఘటన నాయకులను ఇద్దర్ని బార్ఘర్ జిల్లా పైకమాల్ ప్రాంతంలో మావోయిస్టుల పేరుతో ఎన్‌కౌంటర్ చేసారు. వారిలో ఒకరు బిజెపి మండలాధ్యక్షుడు. అంతకు ముందు గజపతి జిల్లాలో పోలీసు కస్టడీలో ఒక ఆదివాసీ యువకుణ్ని కొట్టి చంపారు.

ఈ సంఘటనలతో, ఈ వార్తలతో వేడెక్కి ఉన్న ఒడిషాలోకి నేను కలకత్తా నుంచి తిరుగు ప్రయాణంలో ప్రవేశించిన జనవరి 9 ఆదివారం రోజు కోపర్‌డంగ్ తర్వాత పెద్దదయిన ఎన్‌కౌంటర్ మళ్లీ ఒకటి జరిగింది. భువనేశ్వర్‌లోనూ, బరంపురంలోనూ రచయితలు, మహిళా సంఘం కార్యకర్తలు, హక్కుల సంఘాల వాళ్లు నాకు ట్రెయిన్ దగ్గరికి వచ్చి ఆ ఘోర సంఘటన గురించి చెప్పారు. వాస్తవానికి ఆదివారం 9వ తేదీ ఉదయం 5.30 గంటలకు ఒక నిర్దిష్టమైన సమాచారంతో రాయగఢ జిల్లా కాశీపూర్‌లో బాసంగిమల్లి కొండల్లో సమావేశమైన మావోయిస్టు దళాన్ని తొమ్మిదిమందిని మొత్తంగా పట్టుకొని చంపారు. వీరిలో కాశీపూర్ దళ కమాండర్ రవి (దువ్వూరి శ్రీనివాసరావు, తూర్పు గోదావరి జిల్లా) తప్ప ఆయన సహచరితోపాటు అందరూ ఆదివాసులే. అందులో అయిదుగురు మహిళలు. దువ్వూరి శ్రీనివాసరావు రాజమండ్రిలో కండక్టర్ ఉద్యోగం చేసేవాడు. తూర్పు గోదావరి జిల్లాలో వడ్మాపురం చంద్రమౌళి విప్లవోద్యమం నిర్మాణం చేస్తున్న సమయంలో విప్లవ రాజకీయాలకు ఆకర్షితుడయి, రెండు దశాబ్దాల క్రితం అజ్ఞాత జీవితంలోకి వెళ్లి 1998లో అరెస్టయి, విడుదలయ్యాక మళ్లీ అజ్ఞాతంలోకి వెళ్లి ఒడిషాలో కాశీపూర్ ప్రాంతాల్లో గనుల తవ్వకాలకు వ్యతిరేకంగా పోరాటం నిర్మిస్తున్నాడు. నియాంగిరి

కొండల్లో వేదాంత కంపెనీ అక్రమ తవ్వకాలపై అక్కడి ఆదివాసుల పోరాటం ప్రపంచవ్యాప్తంగా 'అవతార్' సినిమా కథవలె ప్రచారం అయి వేదాంత కంపెనీ అనుమతిని ప్రభుత్వం తాత్కాలికంగా వెనక్కి తీసుకున్న నేపథ్యంలో ఇక్కడ మావోయిస్టు పార్టీ ఉన్నదని, ఆదివాసుల పట్ల ప్రజాస్వామ్యవాదులకుండే, పర్యావరణవాదులకుండే అభిమానాన్ని బెదిరించి దూరం చేయడానికి ఎన్‌కౌంటర్‌ను ప్రభుత్వం ఎంచుకున్నది. మరోవైపు ఒడిషాలో వేదాంత విశ్వవిద్యాలయానికి ప్రభుత్వం కేటాయించిన భూమి విషయంలో, అనుమతి విషయంలో కూడ సుప్రీంకోర్టులో విచారణ జరుగుతున్నది. అత్యున్నత న్యాయస్థానానికి మావోయిస్టు బూచి చూపి వేదాంత కంపెనీ ప్రవేశానికి అనుకూల వాతావరణాన్ని కల్పించడానికి కూడా ఈ గ్రీన్‌హంట్ ఎన్‌కౌంటర్‌ను ప్రభుత్వం ఎంచుకున్నది. ఈ ఎన్‌కౌంటర్‌లో రాయగఢ, గజపతి, కంధమాల్ జిల్లాల్లో రాజ్యం ఒక బీభత్స వాతావరణాన్ని సృష్టించింది. (కంధమాల్ జిల్లాలో చలి కూడ జీరో డిగ్రీకి చేరుకున్నది.)

హైదరాబాద్ నుంచి నలువైపుల (లేదా ఎనిమిది దిక్కుల) దూరాన్ని బాగే ఆమ్ ప్రాంతం నుంచి లెక్కకడతారు. దానిని తెలంగాణ ప్రజలు తమ అమరుల స్మృతిలో గన్‌పార్క్ అనవచ్చు. అధికార శాసనసభ ఉన్న చోట – ఆకాశవాణి కూడ ఉంటుంది. అటు పోలీసు కమిషనర్ ఆఫీసు ఉంటుంది – ఎదురుగా సర్దార్ వల్లభ్‌భాయ్ పటేల్, స్వామి రామానంద తీర్థ, ప్రకాశం పంతులుల విగ్రహాల మీదుగా విహంగ వీక్షణంతో చూస్తే, నగర పోలీసు కమిషనర్ ఆఫీసు ఉంటుంది. అక్కడ నుంచి ఈ జాతీయ రహదారుల గమ్యాల దూరాల లెక్క మొదలవుతుంది. అక్కడ నుంచి కలకత్తాకు వెళ్లే జాతీయ రహదారి నల్లగొండ చౌరస్తాలో మా ఇంటి పక్కనుంచి పోతుంది. రైలయితే బెజవాడ తర్వాత సుప్రసిద్ధ కార్టూనిస్టు ఉదయమే పరుగెత్తడానికి ఎంతో ఇష్టపడే తూర్పు సముద్రతీరం, ఇపుడు ప్రభుత్వాలు ఎంతో శ్రద్ధపెడుతున్న కోస్టల్ కారిడార్ వెంట ప్రయాణం. అది ఎయిట్‌లైనర్ సరీసృపం వంటి రోడ్డయినా, దక్షిణ – తూర్పు రైల్వే లైను అయినా పల్లెలు, అడవి విధ్వంసం కాకుండా ఏర్పడినవి కావు. తెలంగాణ నుంచి బెజవాడకు వచ్చి ఈ రైల్వే లైనుకు కలిసే తోవ అయితే గోదావరి లోయ పొడుగునా సింగరేణి ఓపెన్ కాస్ట్ విధ్వంసం, దాటగానే పోలవరం ఇందిరా సాగర్ విధ్వంసం – ముగియగానే వాకపల్లి, భల్లూగూడ – అంటే దుబాయి, జిందాల్ కంపెనీల విధ్వంసం, గ్రేహౌండ్స్ అత్యాచారాలు, ఎన్‌కౌంటర్లు – ఒడిషాలో ప్రవేశిస్తే ఒక ఉక్కు రాష్ట్ర నిర్మాణం కోసం ఆదివాసుల గుండె గనులు తవ్వి, ఆదివాసుల రక్త మాంసాలతో వేస్తున్న దారులు. మీకంతా ఈ అభివృద్ధి పథమే కనిపిస్తుంది. చచ్చినవాళ్లు కనిపించరు గదా. తల్లి, భార్య, కన్న బిడ్డలు కూడ శవాలను ఎంతకాలం సజీవంగా ఉన్నవాళ్ల వలె తమ కళ్లల్లో, రెక్కల్లో పెట్టుకుంటారు.

మార్జినలైజ్ అవుతున్న అంటారే – దారిద్ర్య రేఖ కింద ఉన్న శ్రమజీవులను – రాజ్యం మట్టిలో కప్పేస్తుంది. సుత్తి కొడవలి నక్షత్రంతో మెరిసే ఎంతో నాగరికమైన ఎర్రజెండా బెంగాల్‌లోకి ప్రవేశిద్దాం. ఖరగ్‌పూర్ రైల్వేస్టేషన్, గంగానది దాటగానే కనుచూపుకు దూరంగా మేదినీపూర్ జిల్లా ఉంటుంది. నందిగ్రామ్ సందర్భంగా ప్రపంచానికంతా మళ్లీ ఒకసారి తెలిసింది.

ఇప్పుడు లాల్‌ఘడ్ సందర్భంగా నందిగ్రామ్ హత్యకాండను కలకత్తా వీథుల్లో బుద్ధిజీవులు, కవులు, రచయితలు, కళాకారులు మళ్లీ తలచుకుంటున్నారు. ఇపుడక్కడ ఒక వైపు పారామిలిటరీ బలగాలు. వాళ్లకు ఆదేశాలిస్తూ, నిర్దేశిస్తూ సిపిఎం నాయకులు నిర్వహిస్తున్న హర్మద్ వాహినీ శిబిరాలు. ఈ శిబిరాల నిండా కంఠదఘ్నంగా ఆయుధాలు. బకాసురుని భోజనానికి ప్రతిరోజూ ఒక ఇంటి నుంచి ఒక యువకుడు, ఆహారము బండిలో పోవాలని ఆదేశాలు ఉన్నట్లుగా లాల్‌ఘడ్‌లో ప్రతి కుటుంబం నుంచి ఒక యువకుణ్ని ఆ శిబిరానికి పంపితే మార్క్సిస్టు పార్టీ నాయకత్వం వాళ్లను సాయుధం చేసి హర్మద్ వాహినిలో చేర్చుకుంటుంది. 'మావోయిస్టులను ప్రజలు స్వచ్ఛందంగా ఎదుర్కొంటున్నారు. లాల్‌ఘడ్‌ను తిరిగి ఆక్రమించుకుంటున్నారు' అని ప్రకటిస్తుంది. అది ఆ గ్రామ ప్రజలు అంగీకరించలేదు. తమ యువకులను పంపడానికి నిరాకరిస్తూ ప్రదర్శనగా శిబిరం దగ్గరికి వెళ్లారు. శిబిరంలోంచి హర్మద్‌వాహిని కాల్పులు జరిపింది. తొమ్మిది మంది పేద ఆదివాసీ ప్రజలు మరణించారు. అందులో మహిళలూ ఉన్నారు. పిల్లలూ ఉన్నారు. (మహిళలను, పిల్లలను ముందు కవచంగా పెట్టుకొని తృణమూల్ – మావోయిస్టులు దాడి చేయడానికి వెళ్లారని సిపిఎం నాయకత్వం సులభంగానే అనగలదు) జనవరి 7న సరిగ్గా నందిగ్రామ్‌లో నిరాయుధులపై జరిగిన దాడి వంటిదే. ఇది సిపిఎంకు తృణమూల్ కాంగ్రెస్‌కు ఎన్నికల వేటలో భాగం కావచ్చు. ఎవరి వేటకు ఏ జీవి పడిపోయిందో పార్టీ శవాల లెక్కింపు ఓట్ల లెక్కింపుకు దారితీయవచ్చు. కాని వాళ్లంతా ఆదివాసులు. బర్గా ఆపరేషన్ కింద తమకు పంచుతామని కేటాయించిన నాలుగు వేల ఐదు వందల ఎకరాల భూమికి మరో ఐదు వందల ఎకరాలు సేకరించుకోవడానికి అనుమతించి మొత్తం ఐదు వేల ఎకరాలు జిందాల్ కంపెనీకి కట్టబెట్టినందుకు ప్రతిఘటిస్తున్నారు ఆదివాసులు. గత ఎన్నికల కాలం ముందు నుంచీ పోలీసుల అత్యాచారాలు ప్రశ్నించి, ప్రతిఘటించడానికి సంఘటితమైన ఆదివాసులు. నందిగ్రామ్‌లో సలీమ్ కంపెనీ కోసం సాధించలేకపోయిందీ, సింగూరులో కార్ల కంపెనీ కోసం సాధించలేకపోయిందీ, లాల్‌ఘడ్‌లో జిందాల్ కంపెనీ కోసం కూడ సాధించలేకపోతే సిపిఎం కు అది ఎన్నికల ఓటమి కన్న అవమానకరమైన విషయం. 'మైండ్‌సెట్ మారడం' అంటే సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు దాసోహమే. అందుకని కలకత్తా కాలేజ్ స్ట్రీట్‌లో జనవరి 8న వేలాది మంది బుద్ధిజీవులు మీడియా ముందు అభిప్రాయపడినట్లుగా తమ కంపెనీ ప్రభువుల కోసం వాళ్లు తమ శవపేటిక తయారు చేసుకొని అందులో దూరి ఆ శవపేటికపై ఆఖరి మేకు కొట్టమని హర్మద్ వాహినికి స్వేచ్ఛనిచ్చారు. బిజెపి – కాంగ్రెస్ మిలాఖత్‌తో ఛత్తీస్‌ఘడ్‌లో ఏర్పడిన సాల్వాజుడుం దురంతాలను ఎండగట్టగలిగినంత సులభం కాదు, జంగల్ మహల్‌లో సిపిఎం – కాంగ్రెస్ మిలాఖత్‌తో ఏర్పడిన హర్మద్ వాహిని దురంతాలను ఎండగట్టడం. కానీ ఛత్తీస్‌ఘడ్‌లో ఒక బినాయక్‌సేన్, ఒక హిమాంశు కుమార్ సాల్వాజుడుం దురంతాలను ప్రశ్నించారేమోకానీ బెంగాల్‌లో వేలాది మంది బుద్ధిజీవులు ప్రశ్నిస్తున్నారు.

ప్రయాణం ముగిసి మన రాజధాని చేరుకునే వరకు జనవరి 6 నుంచి ఉస్మానియా విశ్వవిద్యాలయం క్యాంపస్‌లో దూరానికి చేరువగా

*భూమికీ, మనిషికీ సంబంధాన్ని నిర్దేశించే రెవెన్యూ పాలన ప్రారంభం, పూర్వాపరాల చరిత్రను వివరిస్తున్నారు*

**ఎస్. సరళా వందనం**

# ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన - 2

*(గత సంచిక తరువాయి...)*

**కా**కతీయుల పాలనలో ఉత్తరాన ఒడిషా రాష్ట్రంలోని తెలుగు మాట్లాడే ప్రాంతం నుండి మద్రాసు రాష్ట్రం వరకూ విస్తరించింది. అప్పటికే వ్యవసాయం మాత్రమే కాకుండా రాష్ట్ర సముద్రతీరం (కోరమండల్ తీరం) పొడవునా నౌకాయానం ఉచ్ఛస్థితిలో ఉండేది. గ్రామాల నుంచీ, పట్టణాల నుంచీ కలంకారీ వస్త్రాలు, ఆభరణాలు, బంగారు, వెండి, లోహాలు తాపడం చేసిన అలంకరణ వస్తువులు పశ్చిమ దేశాలకు ఎగుమతి చేసేవారు. వీటితోపాటు రాష్ట్రం నుంచి ధాన్యం, బెల్లం, ఉప్పు విరివిగా ఎగుమతి అయ్యేవి. పటిష్ఠమైన ప్రభుత్వాలు, స్థిరమైన పాలన ఉండడం వలన గ్రామీణ స్వయం పోషక వ్యవస్థ బలంగా ఉండేది. ముఖ్యంగా ప్రజల శక్తియుక్తులకనుగుణంగా వనరులను వారికి రెవెన్యూ యంత్రాంగం అందించడం వలన ఉత్పత్తి చాల ఎక్కువగా ఉండి, ఎగుమతులు చాల ఎక్కువగా జరిగేవి. పారిశ్రామిక విప్లవంతో ముడిపడిన పెట్టుబడిదారీ విధానం వేళ్లూనుకోక పోవడం, గ్రామీణ స్వయం పోషక వ్యవస్థ బలంగా ఉండడం వలన దిగుమతుల అవసరమే ఉండేది కాదు. ఇండియా, చైనా దేశాల నుండి దిగుమతి అయ్యే విలాస వస్తువుల వలన దేశ ఆర్థిక లోటును పూడ్చుకోవడానికి క్రీ.పూ. 4 శతాబ్దంలోనే పశ్చిమ దేశాలు మన దేశంపై దండెత్తాలని నిర్ణయించుకున్నాయి. వీటి ఫలితమే అలెగ్జాండర్ మన దేశం మీదకు దండెత్తేలా చేసింది. తరువాత పర్షియా నుంచి మహమ్మదీయ సుల్తానులు దేశ సంపదను దోచుకోవడం కోసం తరచుగా దండయాత్రలు చేయడం మొదలుపెట్టారు. క్రీ.శ. 1820 వరకు ప్రపంచ జి.డి.పి.లో 60 నుంచి 75 శాతం వాటా ఇండియా, చైనా తదితర ఆసియా దేశాలదేనంటే అందులో మన రాష్ట్రం పొడువునా సముద్ర తీరంలో జరిగే నౌకాయానం ద్వారా జరిగే ఎగుమతుల ద్వారానే ఎక్కువగా ఉండేదనడంలో సందేహం లేదు. మానవ వనరుల అంచనాకు తగినట్లుగా ఇతర వనరులను వినియోగించుకోవడంలో ఎలాంటి ఆటంకాలు కలగకుండా ప్రజలకు అప్పగించి దీని ద్వారా ఉత్పత్తి పెరిగే విధంగా చూసే రెవెన్యూ యంత్రాంగం పాత్ర ఈ అభివృద్ధిలో విస్మరించడానికి వీలులేనిది.

విదేశాలకు ఎగుమతులే కాకుండా, అంతర్గత వాణిజ్యం కూడా బాగా అభివృద్ధి అయింది. ఎడ్లబండ్ల మీద కూలీలతో ఉప్పు, కలంకారీ వస్త్రాలు, ధాన్యం మొదలయినవి కోస్తా తీర ప్రాంత వ్యాపారులు ఇప్పటి కర్నూలు జిల్లాలోని గాజులపల్లి, కృష్ణంశెట్టిపల్లి (పశ్చిమ నల్లమల అడవులు) గ్రామాలకు తీసుకొచ్చేవారు. తమ సరుకులకు బదులుగా అక్కడ లభించే కాల్చిన ఇనుము (ఉక్కు)ను తమ ప్రాంతాలకు తీసుకొని వెళ్లేవారు. రెవెన్యూ యంత్రాంగం వ్యాపారులు చేసుకొనే లావాదేవీలను బట్టి సుంకం వసూలు చేసేది. వ్యాపారుల సరుకుకు ప్రయాణాల్లో రక్షణ కల్పించడం, గ్రామాల్లోని సరుకుకు స్థానిక వ్యాపారులకు నష్టం కలుగకుండా వ్యాపారాన్ని నడిపించడం గ్రామ రెవెన్యూ యంత్రాంగం స్వయంగానూ, కొన్నిసార్లు ఖడ్గదారుల మద్దతుతోనూ సమర్థంగా నిర్వహించి పాలకులకు, ప్రజలకు మధ్య ఫలవంతమైన లావాదేవీలు నడిపించేది.

ఆ కాలంలో గనుల తవ్వకాలకు అనుమతులివ్వడం, ఖనిజాల

---

వినొస్తున్న ప్రతిఘటనా నినాదాలు – పోలీసు బులెటు శబ్దాలు. అవి రబ్బరు బులెట్లో, బాష్పగోళాలో – నిజంగా పెలెట్లో – కానీ రోజూ పదుల, ఇరవైల సంఖ్యలో విద్యార్థులు గాయపడుతూనే ఉన్నారు. శ్రీకృష్ణ కమిషన్ రిపోర్ట్ రావడానికన్న ఎంతో ముందే అదనపు పారామిలిటరీ బలగాలు, తెలంగాణలో విద్యాలయాల్లో దిగాయి. అభివృద్ధి పథంలో ఉక్కుపాదాల పదఘట్టనలు వస్తాయి. తెలంగాణ చాల అభివృద్ధి చెందింది గదా. సైబరాబాద్, గ్రేటర్ హైదరాబాద్ అయింది గదా. అందుకని గాంధీ ఆసుపత్రిలో గాయపడిన విద్యార్థులు, చెర్లపల్లి జైల్లో విద్యార్థులు, నగరమంతా, క్యాంపస్‌లనిండా తుపాకులు. విద్యార్థులకు తిండిలేదు. నీళ్లు లేవు. వెలుగులేదు. సెలవులిచ్చారు గనుక ఉండవు. రాజ్యహింసకు సెలవు లేదు.

గవర్నర్ గారు రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన తెచ్చుకొని మరింత ప్రత్యక్ష పోలీసు పాలన కోసం తహతహలాడుతూ ఢిల్లీ చుట్టూ తిరుగుతున్నారు.

ఆకాశంలో విమానాలు ఎగురుతున్నాయి. జాతీయ రహదారుల్లో రాజధానీ, సూపర్‌ఫాస్ట్ ఎక్స్‌ప్రెస్‌లు తిరుగుతున్నాయి. అడవులు, మైదానాలు గ్రీన్‌హంట్‌లు, సెజ్‌లు, రియల్ ఎస్టేట్‌లు విస్తరిస్తున్నాయి. ఈ పచ్చని వేట చాలనట్లు ఆకుపచ్చ దుస్తుల్లో అంతటా పదఘట్టనలు, తుపాకులే వినిపిస్తున్నాయి. కనిపిస్తున్నాయి.

ఈ అభివృద్ధి పథంలో మన అడుగు రాజద్రోహం వైపా, ప్రజాద్రోహం వైపా బుద్ధిజీవులు తేల్చుకోవాల్సి ఉన్నది.

*(రచయిత విప్లవ రచయితల సంఘం సభ్యులు)* వీ

ఎగుమతులకు సుంకాలు వసూలు చేయడం, గనులు దురాక్రమణ కాకుండా చూడడం రెవెన్యూ యంత్రాంగం పరిధిలోనే ఉండేవి. పైన పేర్కొన్న విధులన్నీ నిర్వహించడానికి గ్రామ రెవెన్యూ యంత్రాంగానికి వారి అధికార ఖర్చులకు, జీవనానికి కలిపి వసూలు చేసిన పన్నులలో 1/8 వంతు ఇచ్చే పద్ధతి ఉండేది. కొన్నిసార్లు వీరి జీవనానికి మాత్రం శిస్తు లేకుండా భూమిని సాగు చేసుకోవడానికి ఇచ్చే పద్ధతి కూడా అమలులో ఉండేది.

భూమిని ప్రజల వినియోగంలోకి తీసుకురావడానికి, భూ వినియోగంలో ఏర్పడే తగాదాలు పరిష్కరించడానికి, పండే పంటకు శిస్తు విధించడానికి అప్పట్లో గ్రామ రెవెన్యూ యంత్రాంగం కింద పేర్కొన్న విధంగా కొలతలు నిర్వహించేది. భూమిని కుంటలలో కొలిచేది.

1 కుంట = 18 మూరల చతురస్రాకారపు కొలతలో ఉండే భూమి
1 ముంత = 152 కుంట భూమి లేదా 2 1/4 ఎకరాల భూమి
16 ముంతలు = 1 టుము

అప్పట్లో చలవాని రూక (రూపాయి) విలువ = 13 అణాల 4 పైసలుండేది.

రూపాయి విలువ ప్రాంతాల వారీగా రకరకాలుగా ఉండేది. భూమి శిస్తును నేల రకాన్ని బట్టి, ఆయా నేలలో పండే పంట దిగుబడిని బట్టి దాదాపు రాష్ట్రమంతా ఒకే రీతిలో నిర్ణయించేవారు. భూమి శిస్తును కార్తీక మార్గశిర మాసాల్లో నిర్ణయించి దాదాపు అన్నిచోట్ల కూడా నాలుగు విడతలుగా వసూలు చేసేవారు.

1 ముంత తువ్వ నేలకు శిస్తు = రు. 1 నుంచి రు. 1 1/4
1 ముంత ఎర్ర నేలకు శిస్తు = రు. 1 1/6 నుంచి రు. 1 1/4
1 ముంత రేగడి నేలకు శిస్తు = రు. 1 నుంచి రు. 4
1 ముంత నల్లరేగడి నేలకు శిస్తు = రు. 10 నుంచి రు. 12

ఆ కాలంలో ఆర్థికంగా మంచి స్థితిలో ఉన్న రైతులకు నల్లరేగడి నేలలో తమల పాకులు, చెరకు, ద్రాక్ష వంటి వాణిజ్య పంటలు పండించుకోవడానికి భూమి ఇచ్చేవారు. ఇప్పుడు పరిశ్రమలు పెట్టి పెట్టుబడిదారులకు రాయితీలు, ప్రోత్సాహకాలు ఇచ్చే విధానం ఉన్నట్లు గానే, అప్పట్లో పెట్టుబడి పెట్టి వాణిజ్య పంటలను పండిస్తున్నందుకు వీరుసాగు చేస్తున్న విస్తీర్ణంలో 5 లేక 6 ముంతల భూమికి శిస్తును మాఫీ చేసేవారు. కొన్ని భూములకు ప్రభుత్వమే పెట్టుబడి పెట్టి రైతులతో సాగు చేయించి, పనిచేసినందుకు గాను పండిన పంటలో 1/4 వంతు పంట రైతుకు ఇచ్చేవారు. అప్పట్లో మెట్ట పంటలపై శిస్తును డబ్బు రూపంలోనూ, తరి భూములపై విధించే శిస్తును ధాన్యం రూపంలోను వసూలు చేసేవారు. గ్రామానికి పాలకులు నిర్ణయించిన శిస్తు వసూలు కాని సందర్భంలో గ్రామ రెవెన్యూ అధికారులు తమ పలుకుబడితో ధనికరైతుల దగ్గర నుంచి తక్కువ పడిన మొత్తాన్ని ముందుగా సర్దుబాటు చేసి పాలకుల పీడన నుంచి ముందు ప్రజలను తప్పించేవారు.

యుద్ధాలు జరిగేటప్పుడు రైతులు, సామాన్య ప్రజలు తరచుగా వేరే చోటకు తాత్కాలికంగా వెళ్లి ప్రశాంత వాతావరణం నెలకొన్నప్పుడు తిరిగి గ్రామాలకు వచ్చేవారు. ప్రజలు తిరిగి మామూలు జీవనం గడపడానికి కావలసిన పరిస్థితులు కల్పించడం, యుద్ధంలో గెలిచిన లేదా ఓడిన స్థానిక పాలకులు వారి అవసరాల కోసం ప్రజలను ఇష్టారాజ్యంగా దోచుకోకుండా గ్రామ స్తోమత మేరకే పన్నులను విధించే విధంగా ఒప్పందం చేసుకోవడంలో గ్రామ రెవెన్యూ యంత్రాంగం ముఖ్యపాత్ర పోషించేది. ఇదంతా గ్రామం మీద వీరికి ఉన్న పూర్తి అవగాహనతో సజావుగా జరిగే విధంగా పాలకులకు పరిస్థితులను వివరించి ఒప్పించేవారు.

## మహమ్మదీయ సుల్తానుల పాలనలో రెవెన్యూ పాలన

క్రీ.శ. 13వ శతాబ్ది చివరి నాటికి పర్షియా నుంచి భారతదేశంపై దండెత్తిన సుల్తానులు ఉత్తర భారతదేశం నుంచి బెంగాల్ వరకు ఆక్రమించుకొని పరిపాలించేవారు. దక్షిణ భారతదేశం సంపదతో తుల తూగుతుందని తెలుసుకొని ఢిల్లీ సుల్తాను, మాలిక్ కాఫర్‌ను క్రీ.శ. 1309లో కాకతీయ రాజైన ప్రతాపరుద్రదేవుని రాజధాని వరంగల్‌పై దండయాత్రకు పంపాడు. ప్రతాపరుద్రుడు యుద్ధంలో ఓడిపోయి 10 మార్చ్ 1310న ఢిల్లీ సుల్తానుతో సంధి చేసుకొని వెయ్యి ఒంటెలపై తన ఖజానాలో ఉన్న సంపదను ఢిల్లీ సుల్తానుకు పంపాడు. వీటితోపాటు ఢిల్లీ సుల్తానుకు ప్రతి సంవత్సరం కప్పం చెల్లిస్తాననే షరతుకు కూడా ఒప్పుకున్నాడు. క్రీ.శ. 1323లో తిరిగి ఢిల్లీ సుల్తానులు ప్రతాపునిపై దాడి చేసి అతనిని ఖైదీగా పట్టుకొని ఢిల్లీ తీసుకొని వెళ్తూ, ఇక్కడ రాష్ట్రంలో అన్ని చోట్ల మహమ్మదీయులను తమ పాలనకు ప్రతినిధులు (గవర్నర్లు)గా నియమించారు. క్రీ.శ. 1325 నుంచి 1352 వరకూ ఢిల్లీ సుల్తానుగా ఉన్న మహమ్మద్ – బిన్ – తుగ్లక్ అరాచకాలు భరించలేక దక్షిణాది రాష్ట్రాలలో అతని పాలనకు ప్రతినిధులుగా ఉన్న ఈ మహమ్మదీయ పాలకులు ఢిల్లీ సుల్తానుతో తెగతెంపులు చేసుకొని స్వతంత్రంగా పరిపాలించడం మొదలుపెట్టారు. వీరే బహమనీ సుల్తానులు. వీరు ఉత్తరాదిన గంజాం గజపతి నగరం నుంచి దక్షిణాన కర్ణాటక, పడమర మహారాష్ట్ర వరకు పరిపాలించారు.

వీరు మెజారిటీ ప్రజలు హిందువులు కాబట్టి హిందువులకు పెద్ద పెద్ద ఉద్యోగాలిచ్చారు. రైతుల వద్ద నుండి పన్నులు వసూలు చేసే అధికారం హిందూ అధికారులకే అప్పగించి, సైన్యాన్ని మహమ్మదీయుల ఆధీనంలో ఉంచేవారు. హిందూ అధికారుల మీద ఒక ప్రభుత్వ ఏజెంట్ (అమిన్) ఉండేవాడు. ఇతను రెవెన్యూ యంత్రాంగం వసూలు చేసిన పన్నును గ్రహించడంతో పాటు సివిల్ దావాలకు తీర్పు చెప్పే అధికారం కలిగి ఉండేవాడు. గ్రామస్థాయిలో మాత్రం పంచాయితీలు, గ్రామ పెద్దల ఆధీనంలో ఉండే గ్రామ న్యాయస్థానాలు రెవెన్యూ యంత్రాంగం సహకారంతో తీర్పు చెప్పేవారు. ఈ సుల్తానుల పరిపాలనా కాలంలో కొండలపై ఉండే కోటలు (ముఖ్యంగా సైనిక స్థావరాలు) లో కాకుండా మిగిలిన చోట్ల పన్ను వసూలుకు మరాఠాలను, బ్రాహ్మణులను, నాయక్‌కార్లకు (సహజంగా మహమ్మదీయ సుల్తానులు మహమ్మదీయుల తోనే సైన్యాన్ని తయారు చేసుకొనేవారు. కాని వారి రాజ్యాలు విస్తరించడంతో హిందువులతో సైన్యాన్ని తయారు చేసుకోవాల్సిన పరిస్థితి వచ్చింది. ఈ స్వదేశీ హిందూ సైన్యాధికారులనే 'నాయక్‌కార్లు' అంటారు.) భూములు పెద్ద విస్తీర్ణంలో అప్పగించి వీరి ద్వారా పన్నులు వసూలు చేయించేవారు.

ప్రతి సంవత్సరం భూములను వేలం వేసి, ఎవరు ఎక్కువ పన్ను వసూలు చేస్తామని వేలంలో భూములను దక్కించుకుంటారో వారికే గ్రామాలకు గ్రామాలు అప్పగించే పద్ధతి మొదలయింది. దానితో ఇప్పటి

వరకూ భూమిపై వ్యవసాయం చేసుకొనే హక్కు స్థిరంగా ఉన్న రైతు కుటుంబాలు వాటిని కోల్పోయాయి. రెవెన్యూ యంత్రాంగానికి భూమిపై నియంత్రణ తగ్గిపోయే పరిస్థితి వచ్చింది. గ్రామ వనరులపై, ప్రజల ఉత్పత్తి శక్తిపై అంచనా లేకుండా చాల ఎక్కువ మొత్తంలో పన్ను చెల్లిస్తామని ఒప్పుకొన్న పాలక ప్రతినిధుల వలన ఈ విధంగా జరిగింది.

ప్రజలు పన్నులు సక్రమంగా చెల్లించలేని పరిస్థితులలో మహమ్మదీయ సుల్తానులు తరచుగా దాడి చేస్తూ గ్రామాలకు గ్రామాలు దోచుకొని వెళ్తుండేవారు. వీరు వెళ్లిపోయిన తరువాత ప్రాంతీయ రాజులు తిరిగి తామే రాజులమని ప్రకటించుకోవడం, జరిగిన నష్టాన్ని పూడ్చుకోవడానికి ప్రజలపై పన్నులు వేసి తమ సైన్యంతో ప్రజలపై దాడులు చేసి వసూలు చేస్తుండేవారు. ఈ సమయంలోనే ప్రతాపరుద్రుని సామంతుడైన ప్రోలయ రెడ్డి కొడుకు వేమారెడ్డి (క్రీ.శ. 1324-1353) కొండవీడును రాజధానిగా చేసుకొని ఉత్తరాన రాజమండ్రి వరకూ, దక్షిణాన నెల్లూరు వరకూ, పడమర శ్రీశైలం వరకూ బహుమనీ సుల్తానులను ఓడించి తన ఆధీనంలోకి తెచ్చుకొని రెడ్డి రాజుల వంశస్తుల పాలనకు శ్రీకారం చుట్టాడు. వీరి పరిపాలన, పలుసార్లు మహమ్మదీయ సుల్తానుల దాడులతో, విజయనగర సామ్రాజ్యానికి చెందిన దేవరాయల దాడులతో క్రీ.శ. 1423లో అంతం అయింది. ముఖ్యంగా మరాఠా యోధులు, మహమ్మదీయుల పాలకుల అనుచరులు, బంధువులు, దళారులు రైతులకు పంట చేతికొచ్చే సమయంలో మొత్తం పంటను గ్రామాల్లోనే మకాం వేసి బలవంతంగా తీసుకుపోయేవారు. గ్రామాలకు గ్రామాలనే మరాఠా యోధులు తగులబెడుతుండేవారు.

మొదటి ప్రతాపరుద్రుని కాలంలో రామయ్య అనే గ్రామ కరణాన్ని రాజకోశాధికారిగా నియమించారంటే ఆనాటి గ్రామ రెవెన్యూ అధికారుల అనుభవం, పరిజ్ఞానం ఎంత గొప్పగా ఉండేదో అర్థం అవుతుంది. అప్పటి ప్రజల జీవన విధానాన్ని, వ్యవసాయ ఉచ్ఛస్థితిని రెండవ ప్రతాప రుద్రుని కాలం నాటి ఆరవ నరసింహుడు సంస్కృతంలో రాసిన నిర్దోష్య కావ్యంలో ఇలా వర్ణించాడు, 'మణులతో నిండిన మేరు పర్వతపు సానువులను తలపింపు చేస్తూ బంగారు రంగు శాలిపొలాలతో ఆంధ్రదేశం నిండి ఉన్నది.' కాని అదే ఆంధ్రదేశం తరువాత స్థిరమైన ప్రభుత్వాలు లేకపోవడం వలన దండనాయకుల చేతుల్లోకి ప్రజల జీవనం వెళ్లింది. క్రీ.శ. 14, 15వ శతాబ్దాల నాటి పరిస్థితి వర్ణిస్తూ ఆంధ్ర రాష్ట్రమంతా విస్తృతంగా పర్యటించిన కవి సార్వభౌముడు శ్రీనాథుడు (రెడ్డి రాజుల ఆస్థాన కవి) పల్నాడు, రేనాడు (గురజాల, రాయలసీమ ప్రాంతాలు) ప్రజల జీవన విధానాన్ని కళ్లకు కట్టినట్లుగా వర్ణించాడు.

**పల్నాడు**

*రసికుడు పోవడు పల్నా*
*డెసగంగా రంభయైన నేకు లెవడుకున్*
*వసుధీశుడైన దున్నును*
*కుసుమాస్త్రుండైన జొన్న కూడె కుడుచున్.*

**రేనాడు**

*గరళము మ్రింగితిననుచుం*
*బురహర గర్వింపబోకు పోపోపోనీ*
*బిరుదింక గాన వచ్చెడి*
*మెరసెడి రేనాటి జొన్న మెతుకులు తినుమీ*

ఇదంతా కూడా గ్రామ రెవెన్యూ యంత్రాంగం చేతులలో నుండి పన్ను వసూలు చేసే అధికారం దండ నాయకుల చేతుల్లోకి వెళ్లడం వలన ప్రజల జీవన విధానంలో పెనుమార్పులు సంభవించి పూర్తిగా పేదరికం తాండవించింది. పన్నుల భారం ఎక్కువవడం వల్ల ఇలా సంభవించింది. ఒకప్పుడు కడప జిల్లా రాజంపేట తాలూకా గ్రామాలలో వసూలు చేసే రకరకాల సుంకాలను ప్రజల అభ్యర్థన మేరకు ప్రతాపరుద్రుడు రద్దు చేసినట్లుగా చేయవలసిన రాజులు, ఈ అధికారాన్ని ఆయుధాలు ధరించిన వారికప్పగించడం వలన భూమి పై విధించిన పన్నులు కట్టకపోతే క్రూరమైన శిక్షలు అమలు చేసేవారు. కవి సార్వభౌముడు శ్రీనాథుడు ఈయన కొలువుండే రాజులపై సుల్తానులు, విజయనగర సామ్రాజ్యరాజుల దాడుల వలన ఒకప్పుడు భోగ భాగ్యాలు అనుభవించిన వాడు వ్యవసాయం చేసైనా జీవించాలని నిర్ణయించుకొని బొద్దుపల్లె అనే గ్రామ పొలాన్ని గుత్తకు తీసుకొని వ్యవసాయం చేస్తాడు. కాని అప్పటి వరదలకూ, కరువుకూ పంట చేతికి రాదు. శ్రీనాథుడు ఆ విషయాన్ని తన చాటువుల ద్వారా ఈ విధంగా చెప్తాడు.

*కృష్ణవేణమ్మ గొనిపోయెనింత ఫలము*
*బిలబిలాక్షులు తినిపోయె దిలలు బెసలు*
*బొద్దుపల్లెను గొడ్దేరి మోసపోతి*
*నెట్లు చెల్లింతు సుంకంబు లేదు నూర్లు*

శ్రీనాథుడు ఏడు నూర్ల సుంకము (పన్ను) చెల్లించలేక పోయినందుకు దండనాయకులు ఆయన భుజంపై నల్లరాతి గుండు నెక్కించి సంకెళ్లు వేసి ఊరంతా తిప్పే శిక్ష విధిస్తారు. ఆ శిక్ష శ్రీనాథునిపై అమలు చేసిన తరువాత ఆ గాయాలతోనే అతను మరణిస్తాడు. తను మరణించబోయే ముందు కూడా శ్రీనాథుడు 'దివిజ కవివరుల గుండెలు దిగ్గురనగా అరుగుచున్నాడు శ్రీనాథుడు అమరపురికి అని తన వేదనను, తనపై అమలు చేసిన శిక్ష గురించి ఈ విధంగా చెప్పాడు.

*కవిరాజు కంఠంబు కౌగిలించెను గదరా*
*పురవీథినెదురెండ బొగడదండ*
*సార్వభౌముని భుజాస్కందమెక్కెను గదా*
*నగర వాకిటనుండు నల్లగుండు*

ఈ విధంగా దయాదాక్షిణ్యాలు లేకుండా ప్రకృతి వైపరీత్యాల వలన పంటలు దెబ్బతిని ప్రజలు భూమిపై శిస్తును కట్టలేకపోతే కూడా నిర్దాక్షిణ్యంగా పాలక ప్రతినిధులు శిక్షలు అమలు చేసేవారు.

బహుమనీ సుల్తానుల పాలన తరువాత విజయనగర రాజులలోని శ్రీకృష్ణదేవరాయలు (క్రీ.శ. 1516) స్థిరమైన పాలననందించి, గ్రామ గ్రామాన తిరిగి రెవెన్యూ యంత్రాంగాన్ని స్థిరపరిచాడు. విజయనగర రాజుల కాలంలోనే మళ్లీ వ్యవసాయం అభివృద్ధి చెందడానికి నీటి పారుదల వ్యవస్థను అభివృద్ధి చేశారు. కొత్తగా కాలువలు, చెరువులు తవ్వడానికి గనుల నుంచి వెలికి తీసిన బంగారాన్ని అమ్మగా వచ్చిన ధనాన్ని వినియోగించారు. ఇదే సమయంలో గోల్కొండ రాజధానిగా కుతుబ్‌షాహి వంశస్తుల పాలన (క్రీ.శ. 1512) మొదలయింది. క్రీ.శ. 1565 జనవరిలో తళ్లికోట దగ్గర జరిగిన యుద్ధంలో గోల్కొండ, బీజాపూర్, అహ్మద్‌నగర్, బీదర్ సుల్తానులకు, విజయనగర రాజు రామరాయలకు జరిగిన యుద్ధంలో విజయనగర రాజు ఓడిపోయాడు. ఆ తరువాత కొద్దికాలం పాటు మాత్రమే విజయనగర రాజులు

ఆనెగొంది, పెనుగొండ, చంద్రగిరి రాజధానులుగా చిన్న రాజ్యాలను ఏలారు. ప్రస్తుత రాయలసీమ, ఆంధ్ర తీర ప్రాంతాలను మొత్తం కుతుబ్‌షాహీలను ఆశ్రయించిన జమీందార్ల చేతుల్లో ఉండిపోయింది. అప్పటి నుంచి అసఫ్ జాహీల పాలన మొదలయ్యేవరకు ఈ మొత్తం ప్రాంతం మీద ఏకైక పాలనాధికారం గల ప్రభుత్వమే లేకుండా పోయింది.

ఇదే కాలంలో దేశంలో మొఘలుల పరిపాలన ఉత్తర, మధ్య భారతదేశంలో మొదలయింది. షేర్ షా కాలంలో (క్రీ.శ. 1540–45) అతని దగ్గర రెవెన్యూ మంత్రిగా పనిచేసిన తోడర్‌మల్ రెవెన్యూ వసూలులో లోపాలను గుర్తించాడు. ముఖ్యంగా పంట పండిన తరువాత పండిన పంటలో రాజు భాగానికొచ్చే పంటను తీసుకోవడం, ఒక్కోసారి పండక పోయినా రెవెన్యూ వసూలుకు పీడించడం, రైతు ఆర్థిక పరిస్థితి తెలియకుండా ఎక్కువ పన్ను వసూలు చేయడం చాలా చోట్ల జరుగుతుండడం చూశాడు. రెవెన్యూ వసూలులో శాస్త్రీయ పద్ధతిని అవలంబించాలనుకొన్నాడు. ఇందుకోసం రెవెన్యూ వసూలు క్రమబద్ధీకరించడానికి ముప్ఫై సంవత్సరాలుగా ఒకేరకమైన నేలలో పండే పంట దిగుబడిని, ఈ ముప్ఫై ఏళ్లలోనే పంట విలువల సరాసరిని తీసుకొని అందులో 1/3 వంతు పంటను రైతు రాజుకు కట్టాల్సిన పన్నుగా నిర్ణయించాలని తలపెట్టాడు. షేర్‌షా తరువాత అధికారంలో కొచ్చిన అక్బర్ కూడా తోడర్‌మల్‌ను రెవెన్యూ మంత్రిగా నియమించుకొని భూములను సర్వే చేసి, రైతు వారీ పద్ధతిగా శాస్త్రీయమైన పన్నును సంవత్సరానికొకసారి నిర్ణయించే ఈ విధానం అమలు చేశాడు. భూమిపై పన్ను పద్ధతిని 'ఫసలీ' సంవత్సరం ద్వారా నిర్ణయించే పద్ధతిని వీరు ప్రవేశపెట్టారు. ఈ ఫసలీ ప్రతి సంవత్సరం పంటకాలం మొదలయ్యే 1 జూలై నుండి పంటకాలం పూర్తయ్యే తరువాత సంవత్సరం జూన్ 30 వరకు ఉంటుంది. ఫసలీకి ఇంగ్లిష్ సంవత్సరానికి మధ్య తేడా 590 సంవత్సరాల 6 నెలలు. రెవెన్యూ వసూలుకు వీరు కొత్తగా కలెక్టరులను నియమించారు. ఇప్పటికి కూడా భూమిపై రెవెన్యూ వసూలు, జమ, మార్పులను చేర్పులను ఫసలీ సంవత్సరాంతానికి లెక్కించే పద్ధతి అమలులో ఉంది.

## మొఘలుల రెవెన్యూ పరిపాలన

క్రీ.శ. 1652 లో ఔరంగజేబును డెక్కన్‌కు సుబేదారుగా నియమించారు. ఇతని నియామకం ముఖ్య ఉద్దేశం రెవెన్యూను క్రమబద్ధీకరించడం. అప్పటికే రాష్ట్రంలో పరిపాలన అంతా సుల్తానుల అనైక్యతతో, హిందూ రాజుల తిరుగుబాటులతో, మరాఠా యోధుల దోపిడీలతో, ఫ్రెంచ్ దేశస్తుల రాజ్యకాంక్షతో, మచిలీపట్నానికి (క్రీ.శ.1611) వ్యాపార నిమిత్తం వచ్చి కోస్తా తీర ప్రాంతాలలోని భూ వ్యవహారాలలో పరిపాలన వ్యవహారాలలో జోక్యం చేసుకొనే ఇంగ్లిష్ వారితో అస్తవ్యస్తంగా, అరాచకంగా ఉంది. ఆ సమయంలో ఔరంగజేబు అక్బరు కాలం నుంచి అమలులో ఉన్న రెవెన్యూ సంస్కరణలను అమలులోకి తీసుకురావడానికి, ప్రభుత్వాన్ని స్థిరంగా నిలబెట్టడానికి సుబేదారుగా నియమింపబడ్డాడు.

రెవెన్యూను క్రమబద్ధీకరించడానికి ముర్షిద్ – ఖులీ – ఖాన్‌ను నియమించాడు. ఇతను ముందుగా అరాచక పాలనల వలన ఎక్కడికెక్కడో వెళ్లిపోయిన రైతులను, ప్రజలను తిరిగి గ్రామాలకు తీసుకువచ్చి వారు మామూలు జీవనం గడిపే పరిస్థితులు కల్పించాడు. మొఘలుల ఆధీనంలో ఉన్న ప్రాంతాలను జిల్లాలు లేదా సర్కారులుగా విభజించాడు. సర్కారులను విభాగాలుగా విభజించి వీటికి పర్షియా పదాలైన పరగణ, మహల్, దేహ్ లేదా మౌజా, తాలూకాలుగా పేర్లు మార్చారు. అమీన్లను, నిజాయితీ కల సర్వేయర్లను నియమించి భూములను, కాలువలను, నదుల ప్రవాహం కారణంగా సాగుకు పనికి రాని భూములను కొలిపించడమే కాకుండా పంట పండే భూములను వాటి నుండి వేరు చేసి ప్రత్యేకంగా కొలిపించారు. అప్పుడు భూమిపై కొలతలు 'బీగా'ల రూపంలో కొలిచేవారు.

1 బీగా = 30 గుంటల భూమి
1 గుంట = 2 1/2 సెంట్లు
1 సెంటు = 48.4 చదరపు గజాలు
1 గజం = 2 మూరల చతురస్రాకారపు కొలత

ఔరంగజేబు సుబేదారుగా ఉన్న కాలంలో గ్రామస్థాయి నుంచి తిరిగి రెవెన్యూ యంత్రాంగాన్ని పునఃస్థాపించాడు. రైతుల వద్ద నుండి శిస్తు వసూలు చేసే అధికారం హిందూ అధికారులకే అప్పగించి మునపటి మహమ్మదీయ సుల్తానుల మాదిరే వీరిపై మహమ్మదీయ ప్రభుత్వ ఏజెంట్లను (అమీన్‌ను) నియమించాడు. ప్రజలపై మూడు రకాల భూమి శిస్తును విధించాడు. పన్నును అప్పటి పంట కోసం వేసే విత్తనాల రకాన్ని బట్టి, పంట దిగుబడిని బట్టి, మార్కెట్‌లో పంట ధరను బట్టి, రైతు ఆధీనంలోనున్న భూమిలో పంట పండే విస్తీర్ణాన్ని మాత్రమే కొలిచి కట్టాల్సిన పన్నును నిర్ణయించేవారు. ఇది సుమారుగా పండిన పంటలో ఈ విధంగా ఉండేది.

వర్షాధారపు పంటకు – 1/2 వంతు

బావుల ద్వారా సాగు చేసే పంటలకు – 1/3 వంతు ధాన్యంకు; 1/4 నుంచి 1/5 వంతు ద్రాక్ష, చెరకు, పండ్ల తోటలు, కూరగాయలకు.

కాలువలు, చెరువుల ద్వారా సాగుచేసే పంటకు – 1/4 వంతును పన్నుగా విధించేవారు.

(ఇంకావుంది)

(రచయిత రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ అధికారి)
saralareddy007@gmail.com

వీ

*డా. గోపీనాథ్ వ్యాసం పై స్పందిస్తూ శ్రమ విభజనను బలప్రయోగంతో కొనసాగిస్తున్న రాజ్యస్వభావం సారంలో వర్గ సమస్యేనని అంటున్నారు* **సత్యం**

# కుల సమస్య సారాంశంలో వర్గ సమస్యే

డాక్టర్ గోపీనాథ్ వీక్షణం అక్టోబర్, నవంబర్ 2010 సంచికలలో రాసిన వ్యాసం చదివిన తరువాత అందులో పేర్కొన్న కొన్ని అంశాలపై చర్చ జరగడం అవసరమని భావిస్తున్నాను.

గోపీనాథ్ ఆ వ్యాసంలో ఇలా పేర్కొన్నారు – '1) వర్ణాలు కులాలుగా పరిణమించాయి. 2) వృత్తుల ద్వారానే కులాలు వచ్చాయి. 3) ఆనాటి సమాజ శ్రేయస్సు కోసం అందరి అంగీకారంతోనే ఒక్కొక్కరు ఒక్కొక్క వృత్తిని చేపట్టి వృత్తి ప్రావీణ్యం కోసం వంశపారంపర్యంగా వృత్తులు స్థిరీకరించబడినందు వల్లనే కులాలు ఏర్పడ్డాయి. 4) వేద కాలంలో వేద మంత్రాలు చదివే పూజారి, చెప్పులు కుట్టే చర్మకారుడు ఒకే రకమైన సామాజిక గుర్తింపు, గౌరవం పొందారు. (శూద్రులెవరు – ఆర్.ఎస్.శర్మ). ఆ తరువాత కొందరు దుర్మార్గులు అంటరాని తనాన్ని సమాజంలోకి చొప్పించి కుల వ్యవస్థను భ్రష్టు పట్టించారు.'

ఈ అంశాలన్నీ కొట్టిపారవేసి, పని విభజనే కులాలుగా రూపొందిందనే అవగాహనను తిరస్కరించి, బలప్రయోగమే కులాల ఆవిర్భావానికి, కొనసాగింపుకు కారణమని గోపీనాథ్ ప్రతిపాదించారు.

భారతదేశంలో కుల సమస్య ఒక ప్రత్యేక సమస్య. కుల సమస్యపైన, కుల నిర్మూలనపైన శాస్త్రీయ అవగాహన లేకపోవడం ఎంత తప్పో, ఆ సమస్యను అతిగా లాగడం, పరిష్కారాన్ని గందరగోళం చేయడం కూడా అంతే తప్పు. సమస్యను అతిగా చూపెట్టే ప్రయత్నం ఆ వ్యాసం ఆద్యంతమూ కన్పిస్తుంది.

సుప్రసిద్ధ చరిత్రకారులు రొమిలా థాపర్ 'ఏ హిస్టరీ ఆఫ్ ఇండియా' అనే గ్రంథంలో ఇలా చెప్పారు – 'ఆర్యులు మొదట భారతదేశంలోకి వచ్చినప్పుడు వారు మూడు సామాజిక గ్రూపులుగా విడిపోయి ఉన్నారు. అవి – యుద్ధవీరులు లేక కులీనులు, పూజారులు, సామాన్య ప్రజలు. అప్పటికి కులమనే భావనలేదు. అప్పటికి వృత్తులు వంశపారంపర్యంగా రావడం గానీ, ఈ వర్ణాల లోపలే పెళ్లిళ్లు చేసుకోవాలనే నియమాలుగానీ లేవు. ఈ మూడు విభజనలు కేవలం సామాజిక, ఆర్థిక సంస్థలుగానే ఉన్నాయి.'

'ఆర్యులు, దస్యులను (దాసులను లేక ద్రావిడులు అనవచ్చు) ఈ సామాజిక వ్యవస్థ బయట ఉంచే ప్రయత్నం చేసినప్పుడు కులం ఏర్పడడానికి మొదటి అడుగు పడింది.'

'మొదటి మూడు కులాలలకు బ్రాహ్మణులు ఒక సిద్ధాంతపరమైన చట్రం రూపొందించి వాటి మధ్య వివిధ వృత్తులను ఒక పద్ధతి ప్రకారం పేర్చారు. ఈ మూడు కులాల మధ్య వృత్తులు మారడానికి అవకాశం ఏర్పడింది. కాని ఆర్యులు కాని శూద్రుల కులం వృత్తి, వర్ణం ఈ రెండింటి పై ఆధారపడి ఏర్పర్చబడింది. ఆ తరువాత అంటరానికులం అనే భావన తలెత్తి వారిని కుల వ్యవస్థ బయట అందరికంటే తక్కువ స్థాయిలో ఉంచి అపవిత్రం లేక మైలపరిచే వారిగా చూడడం మొదలైంది.'

'ఆ తరువాత అనేక మార్పులు, చేర్పులు (ఉపకులాలు ఏర్పడుతూ) జరిగి వృత్తులు వంశపారంపర్యంగా తయారై కులవ్యవస్థ కొనసాగి ఘనీభవించింది. కులాల లోపలే పెళ్లిళ్లు చేసుకోవాలనే నియమాలు వచ్చాయి.' (ఏ హిస్టరీ ఆఫ్ ఇండియా, పేజీ 37, 38 నుంచి)

కులాల ఆవిర్భావానికి సంబంధించి రొమిలా థాపర్ పేర్కొన్న పై విషయాలను ప్రామాణికంగా తీసుకోవచ్చు. పని విభజన అనేది కులాల పుట్టుకకు భౌతిక పునాదిగా రూపొందింది.

వర్గ విభజన, కుల విభజన లేని ఆదిమ కమ్యూనిస్టు సమాజం నశించిపోయింది. ఉత్పత్తి, మారకపు పద్ధతులలో మార్పులు వచ్చాయి. వర్గాలు ఏర్పడ్డాయి. వర్గ సమాజంతోబాటు మానసిక, శారీరక శ్రమలకు మధ్య వైరుధ్యం, అసమానతలు ఏర్పడ్డాయి. మానసిక శ్రమ చేసేవారు గౌరవనీయులుగా, శారీరక శ్రమ చేసేవారు నీచులుగా భావించే విధానం అమలయింది. కుల వ్యవస్థ మరింత ఘనీభవించింది.

శ్రమ విభజన కుల ఆవిర్భావానికి భౌతిక పునాదిగా చెబుతూ కొండపల్లి సీతారామయ్య కుల సమస్యపై రాసిన వ్యాసంలో (1976) ఇలా పేర్కొన్నారు.

'సామాజిక అభివృద్ధి క్రమంలో కొన్ని చారిత్రక, భౌగోళిక కారణాల వల్ల, ఐరోపా కంటె పటుతరమైన పునాదులతో మన దేశంలో గ్రామీణ వ్యవస్థ ఏర్పడింది. ఆ వ్యవస్థ అభివృద్ధి క్రమంలో జీవితావసరాల ఉత్పత్తి కోసం ప్రజల మధ్య జరిగిన శ్రమ విభజన వంశపారంపర్యంగా కొనసాగి, క్రమంగా ఒక్కొక్క వృత్తికి చెందిన వారొక్కొక్క కులంగా రూపొందారు. ఆ పిమ్మట శాఖలు, ఉపశాఖలుగా క్లిష్టతరమయినది గానూ, ఆ కుల వ్యవస్థ రూపొందడానికి ఎన్ని తదితర భౌతిక కారణాలున్నా అసలది ఆవిర్భవించడానికి భారతీయ గ్రామీణ వ్యవస్థ ఉత్పత్తి క్రమంలో ప్రజల మధ్య ఏర్పడిన శ్రమవిభజనే మూలం. ఫ్యూడలిజం మన దేశంలో చాలా దీర్ఘకాలం కొనసాగి సామాజికాభివృద్ధి స్తంభించిపోగా అలా రూపొందిన కుల వ్యవస్థ పోను పోను అనేక వెర్రితలలు వేసి క్లిష్టతరమయిందిగా తయారయింది.'

'ఫ్యూడల్ ఆర్థిక విధానం సమూలంగా నశించి, పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందే క్రమంలో మానవుల మధ్య శ్రమ విభజనలో కొత్త పద్ధతి ఆరంభమవుతుంది. యంత్రాభివృద్ధికి, యంత్ర నిర్వహణకు అనుకూలంగా ఆ విభజన ఉంటుంది. ఒకే కుటుంబానికి చెందిన ఒకరు డ్రైవరు కాగా, అదే కుటుంబానికి చెందిన మరొకరు అదే ఫ్యాక్టరీలో పద్దులు రాసే గుమాస్తాగా ఉండవచ్చు. అంటే కుటుంబమంతా ఒకే వృత్తికి పరిమితం కావడం అంతరిస్తుంది. అది ఎప్పుడు అంతరిస్తుందో

అప్పుడు ఒకే వృత్తి చేసే వారంతా ఒకే కులమనే వ్యవస్థలు ఆధారంగా ఉన్న భౌతిక పునాది కూడా దెబ్బతిని పోతుంది.'

'పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందిన తర్వాత కూడా కుల వ్యవస్థ అవశేషాలు మిగిలి ఉండవచ్చు. అయితే ఆ పెట్టుబడిదారులు తమ స్వప్రయోజనాలు సాధించుకోవడానికే అవి ఉపకరిస్తాయి. కాని కుల వ్యవస్థ అస్తిత్వానికి గల పునాది రద్దు కావడంతో పెట్టుబడిదారీ విధానం అమలులో ఉన్న దశలోనే అది దుర్బలమయి, చివరకు సోషలిస్టు సమాజంలో వర్గాలు సమూలంగా రద్దయి, ఉత్పత్తి మరింత కేంద్రీకృతమై మానవుల మధ్య శ్రమ విభజన మరింత ఉన్నతస్థాయినందుకోగా దాని అవశేషాలు సైతం సమూలంగా అంతరిస్తాయి. ఇదీ కుల వ్యవస్థ ఆద్యంతాల పరిణామక్రమం. దీన్ని అనుసరించి పీడిత ప్రజలందరి లోనూ, కుల చైతన్యం స్థానే వర్గ చైతన్యాన్ని పెంపొందింపజేసి, వర్గ పునాదులపై వారిని సంఘటితపర్చాల్సిన అవసరముంది. కుల వ్యవస్థకూ దాని పరిష్కారానికి సంబంధించిన జనరల్ అవగాహన ఇది.'

కుల ఆవిర్భావానికి సంబంధించిన శాస్త్రీయ అవగాహన ఇలా ఉండగా, గోపీనాథ్ బల ప్రయోగమే కుల ఆవిర్భావానికి, కొనసాగింపుకు మూలమని ప్రతిపాదించారు. ఒకవేళ బలప్రయోగమే జరిగిందనేది ఒప్పుకున్నా ఆ బలప్రయోగం ఎందుకోసం జరిగిందనేది వివరించాలి. ఆ వ్యాసంలో ఆ వివరణ లేదు. పని విభజన కోసమే ఆ బలప్రయోగం ఉపకరించిందనేది ఒప్పుకోవాలి. ఈ వ్యవస్థే బలప్రయోగంతో కొనసాగుతోంది. కులమైనా, మరొకటైనా దీనికి మినహాయింపు కాదు. ఈ వాస్తవాన్ని గోపీనాథ్ అవగతం చేసుకోవాలి. ఇప్పుడు మాత్రం కులాలు అనేవి సాంప్రదాయాలు, కట్టుబాట్లు, అలవాట్ల రూపంలో స్థిరీకరించబడ్డాయి.

మన దేశంలో జాతీయోద్యమం పురోగమిస్తున్నప్పుడు బ్రిటిష్ సామ్రాజ్యవాదులు హిందూ, ముస్లింల మధ్య మతకార్చిచ్చు లేపి జాతీయ సమైక్యతను ఎలా దెబ్బకొట్ట ప్రయత్నించే వారో అలాగే ఈనాడు వర్గ పోరాటాలు తీవ్రమైనపుడల్లా పీడిత ప్రజల సమైక్య ప్రతిఘటనా శక్తిని దెబ్బకొట్టడానికి ఒకవైపు కుల దురహంకారాలను రెచ్చగొట్టడం, మరో వైపు వెనకబడ్డ కులాల సంక్షేమం పేరుతో ఏదో నామమాత్రమైన పథకాలతో కార్యక్రమాలతో భ్రమలు రేకెత్తించి పాలకవర్గాలు పడరాని పాట్లు పడడం మనం చూస్తూనే ఉన్నాం. అందువల్ల కుల వ్యవస్థ అభివృద్ధి నిరోధక పాత్ర వహిస్తోంది. ఈ వాస్తవం అందరూ అంగీకరిస్తున్నదే.

అంతేకాదు, గోపీనాథ్ తన వ్యాసం చివరలో 'ఏం చేద్దాం' అనే శీర్షిక కింద మొదటి ప్రాధాన్యత అంశంగా సామాజిక రంగంలో దోపిడీ కులాలకు, దోపిడీకి గురయ్యే కులాలకు మధ్య ఉన్న కుల వైరుధ్యాలను పేర్కొన్నారు. ఇది సరైనదేనా? ఎంత మాత్రం కాదు. అంతేకాదు, ప్రమాదకరమైన విషయం కూడా.

కుల సమస్య వ్యాసంలో కె.ఎస్. ఇలా చెప్పారు : 'కేవలం ఆర్థిక సమస్యలపైన జరిగేవే వర్గ పోరాటాలని భావించడం గానీ, సాంఘిక సమస్యలనీ, ఆర్థిక సమస్యలనీ యాంత్రికంగా విడదీసి చూడడంగానీ సరైనది కాదు. మన దేశంలో కుల వ్యవస్థ స్వభావాన్ననుసరించి కుల సమస్య సారాంశంలో వర్గ సమస్యయే. ప్రస్తుతం మన సమాజంలో కొనసాగుతున్న వివిధ వైరుధ్యాలలో ఫ్యూడలిజానికీ విశాల జన సామాన్యానికీ మధ్య గల వైరుధ్యం ప్రధానమైనది. ఈ వైరుధ్యం కులాల రూపంలో ఎలా ప్రతిబింబిస్తుందో చూద్దాం. రైతాంగంలో ఫ్యూడల్ భూస్వాములుగానీ, పెట్టుబడిదారీ భూస్వాములు గానీ సగటున ఆరు ఏడు శాతానికి మించి ఉండరు. నేటి కులాల ప్రకారం నూటికి 90కి పైగా భూస్వాముల కుటుంబాలు అగ్ర కులాలని చెప్పబడే బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, రెడ్డి, కమ్మ, వెలమ, కాపు కులాలకు చెందినవే.

అలానే వెనకబడిన కులాలని చెప్పబడే యాదవ, చాకలి, మంగలి, పెరికి, గౌడ, మున్నేటికాపు, వగైరా కులాలకు, షెడ్యూల్డ్ కులాలుగా పిలవబడుతున్న మాల, మాదిగ, డెక్కలి, నేతకాని వగైరా కులాలకు చెందిన కుటుంబాలలో నూటికి 90కి మించి కేవలం నిరుపేద రైతులు, వ్యవసాయ కులీలు. అందులో ప్రత్యేకించి హరిజనులలో నూటికి 95 కుటుంబాలకు పైగా కేవలం వ్యవసాయ కూలీలుగానే జీవిస్తున్నారు. అందువల్ల కుల ప్రాతిపదికగా చూస్తే ప్రజాస్వామిక విప్లవానికి ఇరుసుగా ఉన్న వ్యవసాయ విప్లవం అగ్రకులాలనబడే వాటికి, వెనకబడిన కులాలనబడే వాటికి మధ్యనే కొనసాగుతుందని బోధపడుతుంది. అందుకనే ప్రపంచమంతటా జాతుల సమస్య ఎలా సారాంశంలో వర్గ సమస్యయో, అలా మన దేశంలో కుల సమస్య కూడా సారాంశంలో వర్గ సమస్యయే.'

'అయితే బహిరంగంగా, ప్రజాస్వామిక విప్లవమన్నా, వ్యవసాయ విప్లవమన్నా అగ్రకులాలకు వ్యతిరేకంగా వెనకబడిన కులాలు చేయవలసిన విప్లవమేనని ఎందుకు సిద్ధాంతీకరించరాదు? అందుకోసం ప్రత్యక్షంగా ఎందుకు పిలుపు ఇవ్వకూడదు? కేవలం అది తప్పు గనుకనే అలా సూత్రీకరణ చేయరాదు. అలాంటి పిలుపు ఇవ్వకూడదు. భూస్వాములలో 90 శాతం అగ్ర కులాలనబడే వాటికి చెందియున్నారే గానీ ఆ కులాలకు చెందిన మొత్తం ప్రజానీకంలో అత్యధిక భాగం ఏదో ఓ రూపంలో భూస్వాముల దోపిడీకి లేదా అణచివేతకు గురి అవుతున్న వారే అనే విషయాన్ని ఎంత మాత్రం మరవరాదు. అలానే వెనకబడిన కులాలనబడే వాటిలో కూడా 90 శాతం నిరుపేద రైతులు, వ్యవసాయ కూలీలే అయినా అందులో నూటికి ఏ ఒక్కరిద్దరో భూస్వాములు గానీ, దళారీ లేదా బ్యూరోక్రటిక్ బూర్జువా వర్గాలకు చెందిన వారుగానీ లేకపోలేదు. పనిగట్టుకొని పాలకవర్గాలు, వెనకబడిన కులాలలో అలాంటి ఏజెంట్లను సృష్టిస్తున్నాయి. పీడిత వర్గాలను చీల్చడానికి పాలకవర్గాలకు సులువైన పద్ధతులలో అది ఒకటి. ముసలయ్యలూ, సంజీవయ్యలూ, జగ్జీవన్‌రామ్‌లూ అలాంటి బాపతే. నూటికి ఇద్దరో ముగ్గురో హరిజనుల నుండి తయారయ్యే పెద్ద పెద్ద ఆఫీసర్లు, కాంగ్రెస్ సంస్థలూ నాయకత్వ స్థానాల్లోకి ఆ కులాల నుండి పాలకవర్గాలు పనిగట్టుకొని నెట్టుకొని వస్తున్న వారంతా అలాంటి సరుకే. వెనకబడిన కులాల ఉద్ధరణ గురించి ఎన్ని చిలుక పలుకులు పలికినా అలాంటి వారంతా ఆచరణలో పాలకవర్గాల ఏజెంట్లుగానూ, ఈనాటి అర్థఫ్యూడల్, అర్థవలస సమాజాన్ని చెక్కు చెదరకుండా యథాతథంగా సంరక్షించేందుకు నమ్మకమయిన బంట్లుగా ఉపకరిస్తున్నారు. ఇది మన కళ్లముందు కన్పిస్తున్న యథార్థం.

అందువల్ల వ్యవసాయ విప్లవం అగ్రకులాలనబడే వాటికి వెనకబడ్డ కులాలనబడే వాటికి మధ్య జరుగుతున్న విప్లవం కాదు. అగ్ర కులాలనబడే వాటికి చెందిన పీడిత రైతాంగాన్ని, వ్యవసాయ కూలీలను తమ వెనుక నిలబెట్టుకోవడానికి వీలుగా భూస్వాములు మాత్రమే అటువంటి నిర్వచనం ఇవ్వగలరు. పీడిత రైతాంగాన్ని చీల్చడం అనే కుట్రలో అటువంటి ప్రచారం ఒక భాగం మాత్రమే.' (కొండపల్లి సీతారామయ్య - ఏరిన రచనలు - రెండవ సంపుటి)

ఈ వాస్తవాలను పరిగణనలోకి తీసుకొని డా. గోపీనాథ్ ఆ వ్యాసంలో వెలిబుచ్చిన అభిప్రాయాలను పునరోలోచించగలరని ఆశిస్తున్నాను.

*(రచయిత సామాజిక ఉద్యమ కార్యకర్త, చరిత్రకారులు)* ❖

*కోస్టల్ కారిడార్ పేరిట రాష్ట్రంలో పెద్ద ఎత్తున జరుగుతున్న విస్థాపన, విధ్వంసాలను వివరిస్తున్నారు*

**తుంపాల శ్రీరామమూర్తి**

# కోస్టల్ కారిడార్‌ను రద్దు చేయాలి

ప్రత్యేక ఆర్థిక మండలాల (సెజ్) చట్టం 2005కి సంబంధించిన నిబంధనలు 10 ఫిబ్రవరి 2006 నుండి అమలులోకి వచ్చాయి. ఈ చట్టంలో మొత్తం 77 సెక్షన్‌లు ఉన్నాయి. వీటిని ఎనిమిది అధ్యాయాలుగా విభజించారు. వాస్తవానికి 1965 నుండి ఎగుమతి మండలాలు 'ఎక్స్‌పోర్ట్ ప్రాసెసింగ్ జోన్స్' పేరుతో మన దేశంలోని వివిధ రాష్ట్రాల్లో సెజ్‌లను పోలిన పారిశ్రామిక వాడలున్నాయి. సెజ్‌లలో కార్మిక చట్టాలేవీ వర్తించవు. రాయితీలు అధికం. ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్నులు కట్టనవసరం లేదు. దిగుమతి సుంకాలు చెల్లించనవసరం లేదు. సెజ్‌లకు అందిస్తున్న రాయితీల వలన ప్రభుత్వ ఆదాయానికి భారీగా నష్టం వస్తుందని ఆర్థిక శాఖ చెబుతుంది. కేవలం 150 సెజ్‌ల ఏర్పాటు వలన 2006-2010 మధ్యకాలంలో రు. 1,75,487 కోట్ల ఆదాయాన్ని ప్రభుత్వం కోల్పోవలసి వచ్చిందని ఆర్థిక శాఖ అంచనా వేసింది. కస్టమ్స్ డ్యూటీ కింద రు. 69,421 కోట్లు, ఎక్సైజ్ డ్యూటీ కింద రు. 8,371 కోట్లు, రు. 97,695 కోట్ల ఇతర ఆదాయాన్ని కోల్పోవలసి వస్తుందని ఆర్థిక నిపుణుల అంచనా. ప్రస్తుతం దేశంలో మొత్తం 404 సెజ్‌లకు కేంద్ర ప్రభుత్వం లాంఛనంగా ఆమోదం తెలిపింది. 172 సెజ్‌లను నోటిఫై చేసింది. ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనే 97 సెజ్‌లను ఆమోదించింది. మన దేశంలో తీరప్రాంతాల అభివృద్ధి పేరుతో మూడు కోస్టల్ కారిడార్‌లు ఏర్పాటు చేస్తోంది. అందులో ఒకటి మన రాష్ట్రంలో శ్రీకాకుళం జిల్లా ఇచ్ఛాపురం నుండి నెల్లూరు జిల్లా తడ వరకు 972 కిలోమీటర్ల తీరప్రాంతంలో కోస్టల్ కారిడార్ ఏర్పాటు జరుగుతోంది. మన రాష్ట్రంలో ఏర్పాటు అవుతున్న 107 సెజ్‌లలో 75 శాతం ఈ కోస్టల్ కారిడార్‌లోనే ఏర్పాటు అవుతున్నాయి.

కోస్టల్ కారిడార్‌ను శ్రీకాకుళం, విజయనగరం, విశాఖ నుంచి ప్రధానంగా పవర్ కారిడార్‌గా (థర్మల్ విద్యుత్ ప్లాంట్ నిర్మాణం) ప్రకటించింది. శ్రీకాకుళం జిల్లాలో 6 పవర్ ప్లాంట్లు, కాకరాపల్లి, సోంపేట, కవిటీ, దుంకూరు ప్రాంతాల్లో వస్తున్నాయి. విజయనగరం జిల్లాలో కొమరాడలో ఒకటి, విశాఖ జిల్లాలో రాంబిల్లి, బుచ్చయ్యపేట, భీమిలి, పరవాడ, నక్కపల్లి మండలాల్లో ఐదు థర్మల్ ప్లాంట్లు వస్తున్నాయి. బొగ్గు ఆధారంగా థర్మల్ పవర్ ప్లాంట్లు ఏర్పాటు చేసిన ప్రాంతాల్లో ఏర్పడిన ఆష్ పాండ్ వలన పంటల దిగుబడి తగ్గిపోతున్నట్టు పర్యావరణ శాస్త్రజ్ఞులు నివేదిక ఇచ్చారు. పవర్ ప్లాంట్ చుట్టుపక్కల ప్రాంతాల్లో జీవనం సాగిస్తున్న వారికి కాన్సర్‌లు, చర్మ సంబంధమయిన, గుండె, ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధులు వస్తున్నాయని పలు సంఘటనలు తెలియచేసాయి. నరాల బలహీనత, బుద్ధిమాంద్యం, తల్లి గర్భంలో ఉండగా శిశువు చనిపోవడం, పుట్టిన పిల్లల శరీరంలో సరైన ఎదుగుదల లేకపోవడం జరుగుతున్నవని వైద్యులు ఇచ్చిన నివేదిక తెలియజేస్తున్నది. ఈ కర్మాగారాలకు సముద్రజలాలు వినియోగించడం, వ్యర్థ పదార్థాలను సముద్రంలోకి పంపడం వలన మత్స్య సంపద నాశనం అవుతుంది.

విశాఖ జిల్లా పెదగంట్యాడ మండలం, తూర్పు గోదావరి జిల్లా కాకినాడ రూరల్ వరకు పెట్రో కెమికల్ అండ్ పెట్రో ఇన్వెస్ట్‌మెంట్ రిజియన్ (పి.సి.పి.ఐ.ఆర్.) కోసం 110 గ్రామాలను 604 చదరపు కిలోమీటర్ల పరిధిలో ఒక లక్షా యాభై వేల ఎకరాల భూమి సేకరణకు జి.ఒ. 373ను 24 మే 2008న విడుదల చేసింది. ఇందులో భాగంగా నక్కపల్లి మండలం వేంపాడు గ్రామస్తులకు 110 ఏకరాల భూమిని స్వాధీనం చేసుకొనుటకు 6 నవంబర్ 2010న 4(1) నోటీసులు జారీ చేసారు. విశాఖ జిల్లాలోనే పెదగంట్యాడ మండలంలో 8 గ్రామాలు - పెదగంట్యాడ, బాలచేరువు, కోరాడ, నెల్లిముక్క, నడుపూరు, సిద్ధేశ్వరం, అప్పికొండ, దేవాడ; పరవాడ మండలంలో 16 గ్రామాలు - లేమర్తి, ఈబోనంగి, జగన్నాథపురం, పొన్నూరు అగ్రహారం, పినమడక, తాడి, పెంట సీమబోనంగి, కలపాక, స్వయంభూవరం, రావాడ, పరవాడ, దేశపాత్రుని పాలెం, పాయకరావు బోనంగి, చీపురుపల్లి, ఈదురుపాక బోనంగి, లంకెలపాలెం, అచ్యుతాపురం మండలం 24 గ్రామాలు, - తాళ్లపాలెం, దిబ్బపాలెం, పూడిమడక, బుద్ధపాలెం, మారుటూరు, మొదుటూరు, జంగులూరు, దుప్పిటూరు, దోశూరు, చిప్పాడ, అచ్యుతాపురం, ఎదురువాడ, తంతిడి, నునపర్తి, పిల్లవానిపాలెం, గంగమాంబ అగ్రహారం, నడింపల్లి, దోప్పెర్ల, సోమవరం, రావిపాలెం, చీమలాపల్లి, జె. అగ్రహారం, చోడపల్లి, భోగాపురం; రాంబిల్లి మండలం 19 గ్రామాలు - ఆనందపురం, చాటిమెట్ట, కృష్ణంపాలెం, మోటారుపాలెం, పూడి, లాలంకోడూరు, గురుజపాలెం, నక్కపాలెం, సి.ఎచ్.వి. కాంద్రజిరాయితీ చింతున, గొరపూడి, పంచాద్రియ, సీతపాలెం, చింతువ, రాజల అగ్రహారం, మర్రిపాలెం, వెలిగుంటపాలెం, దిబ్బపాలెం, విజయరాం; ఎస్. రాయవరం మండలం 4 గ్రామాలు - వాకపాడు, చిన్నపాలెం, పెద్ద ఉప్పలపాలెం, గుడివాడ; నక్కపల్లి మండలం 12 గ్రామాలు - లక్ష్మీపురం, దోనివాని లక్ష్మీపురం, నెల్లిపూడి, అమలాపురం, చందనాడ, రాజయ్యపేట, పెదతీనార్లు, దండవాక,

*ఆదివాసులపై అమలవుతున్న అన్నిరకాల దోపిడీ అణచివేతలను నిలిపివేయాలంటూ, వారి అభివృద్ధికి చేపట్టాల్సిన చర్యలను సూచిస్తున్నారు* **వూకే రామకృష్ణ**

# ఆదివాసుల వర్గీకరణ జరగాలి

ఆంధ్రప్రదేశ్‌లో అరవై లక్షల మంది ఆదివాసీ, గిరిజనులు జీవనం కొనసాగిస్తున్నారు. వీరు రాష్ట్ర జనాభాలో 6.3 శాతంగా ఉన్నారు. 33 గిరిజన తెగలనూ అనుసూచిత తెగలుగా గుర్తించి ప్రభుత్వం ప్రకటించింది. గిరిజనులలో దాదాపుగా 26 లక్షల యాభై వేల మంది వివిధ షెడ్యూల్డ్ ప్రాంతాలలో నివసిస్తున్నారు. 1991 జనాభా లెక్కల ప్రకారం రాష్ట్ర జనాభాలో అక్షరాస్యత 44.09 శాతం ఉండగా, ఆదివాసులలో 17.66 శాతం ఉంది. మహిళల్లో 8.68 శాతంగా ఉంది. ఆదివాసీ గిరిజన ప్రాంతాలలో ఖనిజ, అటవీ సంపద, నీటి వనరులు పుష్కలంగా ఉన్నప్పటికీ ఈ ప్రాంతాలు అన్ని విధాలుగా వెనకబడి ఉన్నాయి. ఆదివాసీ గిరిజనులు భూస్వాముల, వడ్డీ వ్యాపారుల, కాంట్రాక్టర్ల, అటవీ అధికారుల దోపిడీ దౌర్జన్యాలకు గురి అవుతున్నారు.

ఆదివాసీ సంక్షేమం కోసం పెద్ద ఎత్తున కార్యక్రమాలు చేపట్టినట్లుగా ఎడతెగని ప్రచారాలు సాగుతున్నాయి. 1/70 చట్టం అమలులో పాలకవర్గాల నిర్లక్ష్యం తెలియనిది కాదు. రాష్ట్ర ప్రభుత్వం అదనంగా మూడు తెగలను ఆదివాసీ గిరిజనుల జాబితాలో కలిపింది. ఎరుకుల, లంబాడి, యానాదులు తెగలు ఇతర రాష్ట్రాలలో ఎస్.సి., బి.సి., ఒ.సి.లుగా చెలామణీ అవుతున్నారు. వీరిని జాబితాలో కలపడం నిజమైన ఆదివాసీలకు తీవ్రమైన అన్యాయం జరుగుతుంది. ఆదివాసీల అభివృద్ధికి గొడ్డలిపెట్టుగా మారింది. ఆదివాసీల అమాయకత్వం, వెనుకబాటుతనం ఆసరా చేసుకొని భూస్వామ్య వ్యాపార వర్గాలు, ఇతర సంపన్న వర్గాలు వేలాది ఎకరాలు ఆక్రమించుకొని అనుభవిస్తున్నారు. షెడ్యూల్డ్ ప్రాంతాలలోకి గిరిజనేతరులు వలస వస్తున్నారు.

ఆదివాసీ గిరిజనులు సమగ్రంగా అభివృద్ధి చెందాలంటే వారిని ఎ బి సి డి లుగా వర్గీకరించాలి. ఎరుకుల, యానాది, లంబాడి తెగలనూ ఎస్.సి. జాబితాల్లో చేర్చాలి. ఈ పాలకవర్గాలు నూతన పారిశ్రామిక ఆర్థిక విధనాలు, ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, సరళీకరణ విధానాలు అమలు చేస్తూ షెడ్యూల్డ్ ప్రాంతాలలో అటవి, ఖనిజ సంపద, వనరులు కొల్లగొడుతున్నారు.

సామ్రాజ్యవాద సంస్కృతి ఆదివాసులను కబళించింది. బహుళజాతి కంపెనీలు ఆదివాసీ ప్రాంతాలలో తిష్ట వేసాయి. ఆదివాసుల భూములు, చట్టాలు, సంస్కృతి, సాంప్రదాయాలు అన్యాక్రాంతం అవుతున్న నేటి ప్రపంచీకరణ యుగంలో వారి ప్రాథమిక హక్కులు, వారి ఉనికే ప్రశ్నార్థకంగా మారుతోంది. తను హక్కుల సాధన కోసం ఆదివాసీ గిరిజన ప్రజానీకం ఐక్యంగా ఉద్యమాలు చేయాలి.

---

గునిపూడి, వేంపాడు, ఉపమాక, నర్సాపురం; పాయకరావుపేట మండలం 6 గ్రామాలు - పెంటకోట, కుమరాపురం, కేశవరాం, రాజవరం, శ్రీరాంపురం, ఐదాటం; తూర్పు గోదావరి జిల్లాలోని యు. కొత్తపల్లి మండలంలో పదకొండు గ్రామాలు, తొండంగి మండలంలో ఐదు గ్రామాలు, కాకినాడ రూరల్ మండలంలో మూడు గ్రామాల పరిధిలో మొత్తం 110 గ్రామాలలో పి.సి.పి.ఐ.ఆర్. ఏర్పాటు జరుగుతోంది. ఇందులో ప్రైవేట్‌రంగ సహకారంతో రేవులు, ఎక్స్‌ప్రెస్ హైవేలు, భారీ పారిశ్రామిక పార్కులు, ఐ.టి. పార్కులు, పెట్రో కెమికల్ కాంప్లెక్స్‌లు, పెట్రోలియం రిఫైనరీలు, గ్యాస్ టెర్మినల్స్ వగైరా నిర్మిస్తామని ప్రకటించారు. 666 కిలోమీటర్ల రహదారులు, 200 కిలోమీటర్ల కొత్త రైలుమార్గం, అంతర్జాతీయ విమానాశ్రయం, 10 హెలికాప్టర్ స్టేషన్‌లు, 14 చిన్న రేవులు, 3 భారీ రేవులు, 8 షిప్ ల్యాండింగ్ కేంద్రాలు, నేవల్ ఆల్టర్‌నేటివ్ బేస్, ఫార్మా కారిడార్‌లు ఏర్పాటు చేస్తామని చెబుతున్నారు. కారిడార్ నిర్మాణానికి 20 సంవత్సరాల కాలం పడుతుంది. బలవంతంగా భూమి సేకరించడం కోసం 1894 సంవత్సరం నాటి చట్టం అమలు చేస్తున్నారు. ఈ భూసేకరణ వలన మొదటిగా డి-పట్టా, అసైన్డ్ ల్యాండ్ పట్టాదారులు భూమి కోల్పోతారు. ఆహార ధాన్యాల కొరత ఏర్పడుతుంది. వేలమంది మత్స్యకారులు ఉపాధి కోల్పోతారు. రైతులు, చేతివృత్తుల వారు, కూలీలు ఉపాధి, నివాసాలు కోల్పోతారు. సుమారు 3 లక్షల మంది పరోక్షంగా, ప్రత్యక్షంగా నివాసం, ఉపాధి కోల్పోతారు. భూగర్భ జలాలు అడుగంటి పోతాయి. నీటి వనరులు పూర్తిగా దెబ్బతింటాయి. మన జిల్లాలోనే 90,000 ఎకరాల భూమి స్వాధీనం చేసుకుంటారు. కాలుష్య నియంత్రణ మండలి తదితర ప్రభుత్వ సంస్థల అనుమతులు లేవు. ఏయే పరిశ్రమలు వస్తున్నాయో ప్రభుత్వం ప్రజలకు చెప్పలేదు. వేటి గురించి కూడా ప్రజాభిప్రాయ సేకరణ (పబ్లిక్ హియరింగ్) జరుపలేదు. ప్రజలను ప్రభుత్వం తప్పుదోవ పట్టిస్తుంది. భూసేకరణ నిలుపచేయాలని పి.సి.పి.ఐ.ఆర్. జి.ఒ., కోస్టల్ కారిడార్ తదితర జి.ఒ.లను రద్దు చేయాలని ప్రజలు, ప్రజాసంఘాలు ప్రజాస్వామికవాదులు కోరుతున్నారు.

*(రచయిత ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం విశాఖ జిల్లా అధ్యక్షులు)* ✦

## ఆదివాసుల అభివృద్ధికి తీసుకోవాల్సిన చర్యలు

1 గిరిజనులను ఎ.బి.సి.డి.లుగా వర్గీకరించాలి.
2 ఆదివాసీ గిరిజనులకూ ప్రత్యేక జిల్లానూ ఏర్పాటు చేయాలి.
3 ఆదివాసీలకు స్వయం ప్రతిపత్తి కల్పించాలి.
4 1/70 చట్టాన్ని జి.ఒ. నెం. 3 అన్ని ఏజెన్సీ ఏరియాల్లో పకడ్బందీగా అమలు చేయాలి.
5 ఆదివాసుల భూములకూ పట్టాలు ఇవ్వాలి.
6 అడవిపై హక్కు ఆదివాసులకు కల్పించాలి. షెడ్యూల్డ్ ప్రాంతాలలో భూస్వాములు, వ్యాపారస్తులు దోపిడీ వర్గాల కింద ఉన్న భూములన్నింటినీ ఆదివాసులకు పంచాలి.
7 భారత రాజ్యాంగంలోని 6వ షెడ్యూల్ కింద రాష్ట్రంలోని షెడ్యూల్డ్ ప్రాంతాలను ఉప జిల్లా, డివిజన్ స్థాయిలో స్వయం పాలక ఉప జిల్లా మండలిని ఏర్పాటు చేయాలి.
8 షెడ్యూల్ ప్రాంతాలలో గ్రామ, మండల అధ్యక్షులు జడ్.పి.టి.సి.లు, ఎం.పి.టి.సి.లుగా ఆదివాసులు ఉండాలి.
9 గిరిజనుల జనాభా, భౌగోళిక అంశాలు దృష్టిలో పెట్టుకొని 834 గ్రామాలను కలిపి షెడ్యూల్ ప్రాంతాలలో చేర్చాలి.
10 తమ భూములనూ కాపాడుకోవడానికి ఆదివాసీ యువతిని పెళ్లి చేసుకొని గిరిజనేతరుడి భూముల్లో గిరిజన స్త్రీ పేరుతో ఉన్న భూమిని కూడా కలిపి గిరిజనేతరుడికి షెడ్యూల్ ఏరియాలో ఉండవల్సిన సీలింగ్ మించి భూమి ఉంటే ఆ భూమిని నిరుపేద ఆదివాసీ ప్రజలకు పంచాలి.
11 అన్నింటిని అమలు చేయడానికి, పర్యవేక్షించడానికి అన్ని స్థాయిల్లో రాజకీయ పార్టీలు, ప్రజాసంఘాలు ప్రజా కమిటీలు ఏర్పాటు చేయాలి.
12 రాష్ట్రంలో అన్నింటిని ఐ.టి.డి.ఎ. పరిధిలోకి తీసుకురావాలి. పోలీసు స్టేషన్స్ ఏజెన్సీ ప్రాంతాలలో ఉన్నవాటిని ఐ.టి.డి.ఎ. పరిధిలోకి తేవాలి.

ఆదివాసులను వేధిస్తున్న నిజాం పాలకులపై తిరుగుబాటు చేసి ఆదిలాబాద్ జిల్లా గోండ్ ఆదివాసులలో విప్లవాగ్ని రగిలించి తిరుగుబావుటా ఎగరేసిన ఆదివాసీల వీరుడు కొమురంభీం. ఆదివాసుల స్వయం ప్రతిపత్తి కోసం, స్వయం పాలన కోసం, సాధికారత కోసం జల - జంగల్ - జమీన్ నినాదం, ఆదిలాబాద్‌లోని ఆదివాసులకే కాదు రాష్ట్రంలోని ఆదివాసులందరి నినాదంగా మారిపోయింది. నిజానికి ఆయన పోరాటం భారత రాజ్యాంగంలోని 5వ షెడ్యూల్ అవతరణకు కారణం అయింది. రాష్ట్రంలోని పది ఐ.టి.డి.ఎ.లు ఆధ్వర్యంలో గిరిజన దర్బార్ పేరిట వారి సమస్యలు తెలుసుకోవడం కోసం ప్రయత్నాలు చేస్తోంది. గిరిజన దర్బార్‌లో సమస్యలు ఎంతమాత్రం పరిష్కారం అవడం లేదు. దేశంలో ఆదివాసుల భూమి అన్యాక్రాంతం అయిన రాష్ట్రాలలో మనది రెండవది. ప్రపంచంలో నిరుపేద దేశాలయిన సియోరా లియోన్, బుర్కినాసోవో ప్రజల తలసరి ఆదాయం కన్న ఆంధ్రప్రదేశ్‌లో మూలవాసుల జీవన ప్రమాణరేటు తక్కువ ఉందనే నివేదికలు లక్షన్నర కోట్ల బడ్జెట్‌తో విస్మయం కలిగించక మానదు. భారత రాజ్యాంగం 15 (1) ఆర్టికల్ ప్రకారం రాజ్యం, కుల, మత, తెగ, లింగం పుట్టిన స్థల ప్రాతిపదికగా ఎలాంటి వివక్ష చూపించకూడదనే పొందుపరిచింది. అయినప్పటికీ ఈ దేశంలో ఉన్నటువంటి ఆదివాసులు సామాజికంగా, ఆర్థిక, రాజకీయ వివక్షకు గురవుతూనే ఉన్నారు.

ఈ దేశంలో ఆదివాసులనూ ఆదుకుంటాం, అభివృద్ధి చేస్తాం అంటూ కొన్ని సంస్థలు ప్రభుత్వ, ప్రైవేట్ సంస్థలు, మరికొన్ని స్వచ్ఛంధ సంస్థలు వేలకోట్ల రూపాయలు జేబుల్లో వేసుకుంటున్నాయి. ఆదివాసుల చట్టాలు, శాసనాలు, జి.ఒ.లు ఏవీ అమలు జరగడం లేదు. ఆదివాసులలో కళ తప్పి తన ఊరు, జాతి భూములు రోజు రోజుకు పరాధీనమైపోతున్నాయనే బాధ, అశాంతితో సంఘర్షణతో జీవిస్తున్నారు. ఆదివాసులు ఎంత ఆందోళన వ్యక్తం చేసినా ఈ పాలకవర్గాలు పట్టించుకోవడం లేదు. వీటికి తోడు బహుళజాతి కంపెనీలు, అమెరికన్ సామ్రాజ్యవాద విషసంస్కృతి ఆదివాసులను విచ్ఛిన్నం చేస్తున్నాయి.

అడవి తల్లితో పెనవేసుకున్న ఆదివాసులు పుట్టి పెరిగినా అడవులపైనే హక్కుల్ని కోల్పోయి, తరతరాలుగా దోపిడీకి గురవుతున్నారు. కన్న తల్లి ఒడిలోనే పరాయి బిడ్డలుగా బతుకుతున్న ఆదివాసులు, గిరిపుత్రుల అమాయకత్వాన్ని ఆసరగా చేసుకొని భూస్వాములు, ఇతర రెవెన్యూ యంత్రాంగం అటవిశాఖలు మోసం చేస్తున్నాయి. ఆదివాసుల్ని అడవి నుంచి తరిమివేసే కుట్రలు కుతంత్రాలు జరుగుతున్నాయి. పెద్ద ఎత్తున రిజర్వ్ ఫారెస్ట్ రిజర్వేషన్స్, నోటిఫికేషన్స్ జారీ చేయడానికి, సిద్ధపడుతున్న షెడ్యూల్డ్ ఏరియా ప్రాంతాలలోకి అక్రమ వలసలు నిరోధించడానికి ప్రయత్నాలు చేయకపోవడం ఆదివాసుల అభివృద్ధిపై ప్రభుత్వాల చిత్తశుద్ధికి నిదర్శనం. ఆదివాసులకు అసైన్డ్ భూములు అమ్ముకొనే సౌలభ్యం కల్పిస్తామని, అమ్ముకొనేందుకు వీలుగా ఆదివాసుల రక్షణ కవచం 1/70 చట్టాన్ని సవరిస్తామంటున్నారు. సవరిస్తే భూములు ధరలు విపరీతంగా పెరిగినా ప్రస్తుత తరుణంలో భూములు అమ్ముకుంటే కొనగలిగే శక్తి పెద్దలకే ఉంది. పేదలు కాదు. ఆ విధంగా ఆదివాసుల సంస్కృతి సాంప్రదాయాలు విలువల విధ్వంస రచనతో పరస్పర అవినాభావ సంబంధం ఉన్న ఆదివాసుల దీన పరిస్థితి నేడు ఆత్మరక్షణ వలయంలోకి నెట్టాయి. పీడిత ఆదివాసుల స్వేచ్ఛకోసం, న్యాయం కోసం చేసే పోరాటం ప్రభుత్వాలకు వాళ్ల జీవిత వాస్తవాన్ని, వాళ్ల అనుభవాన్ని తెలియజేసి, వారిలో కదలిక తీసుకురావాలి. జాతులు తమ స్వీయ సంస్కృతిని, అస్తిత్వాన్ని కోల్పోయి పరాయికరణ శరవేగంతో జరిగిపోయి, జాతుల మనుగడ నానాటికీ లుప్తమైపోతోంది.

ఆదివాసుల ప్రగతి, అటవి అభివృద్ధి విడదీయరాని అంశాలు ఆదివాసుల భాగస్వామ్యం లేకుండా వారి అభివృద్ధి కోసం రూపొందించిన ఎలాంటి పథకమైన నిరుపయోగంగా తయారవుతుంది. అటవి యాజమాన్యంలో ఆదివాసుల క్రియాశీలక భాగస్వామ్యం కావడం, అటవి సంపదలో వాటాదారుడు కావడం వల్ల మాత్రమే ఆదివాసుల అభివృద్ధి సాధ్యం అవుతుంది.

గిరిజనుల సాగు పద్ధతి పోడు భూములు దగ్గరే ఆగిపోయింది. ఆధునిక సాగు పరికరాలు వినియోగించక పోవడం, సంప్రదాయక విత్తనాలే వాడడం సస్యరక్షణపై అవగాహన లేకపోవడం, ఆధునిక వ్యవసాయంలో చాలా వెనకబడి పోయారు. దేశవ్యాప్తంగా గిరిజనుల భూసమస్య, ముఖ్యంగా అటవి భూములపై హక్కును ధృవపరుస్తూ

చేయబడింది. అయితే పోలవరం ప్రాజెక్ట్ నిర్వాసిత ప్రాంతాలైన 276 గ్రామాల్లో గిరిజన భూములపై అటవి హక్కుల చట్టం ప్రకారం పట్టాలు ఇచ్చేందుకూ నిరాకరిస్తోంది. బాక్సైట్ నిక్షేపాలు ఉన్న ప్రాంతాలలో పట్టాలు ఇచ్చేందుకు నిరాకరిస్తోంది. అటవి భూములు ఆదివాసులకూ జీవనాధారం. అటవిశాఖ అధికారులు, రెవెన్యూ యంత్రాంగం దౌర్జన్యాలు చేయడం, గిరిజనులపై కేసులు పెట్టడం, జైలుకు పంపడం నిత్యకృత్యంగా కొనసాగుతున్నాయి. మన రాష్ట్ర ప్రభుత్వం పద్నాలుగు లక్షల ఎకరాలు పంపిణీ చేసినట్లుగా గొప్పలు చెప్పుకుంటున్నా వాస్తవంగా గిరిజనులకు దక్కింది చాలా తక్కువ.

అటవి అభివృద్ధి పథకాలు ఫ్లోరికల్చర్, హార్టికల్చర్, కాఫీ తోటలు, రబ్బరు తోటలు పేరుతో నేటికీ ప్రభుత్వమే స్వయంగా ఇరవై శాతం ఆదివాసుల, గిరిజనుల భూమిని ఆక్రమించుకుంది. నీటి పారుదల, గనులు, సహజవనరులు, రోడ్లు నిర్మాణాలు ప్రభుత్వ సంస్థలు, కార్యాలయాలు పేరుతో 26 శాతం భూమిని ఆక్రమించారు.

గిరిజన తెగల వారు అడవుల మధ్య అటవీ భూమితో విడదీయరాని సంబంధం కలిగి ఉన్నారు. వారిని అటవిశాఖ పర్యావరణ వేత్తలు అటవి విస్తీర్ణాన్ని నాశనం చేసే వారుగా చిత్రీకరిస్తున్నారు. అటవి ఫలసాయాన్ని అనుభవించే సంప్రదాయపు హక్కునే సవాల్ చేస్తున్నారు. ఇది ఆధునిక పర్యావరణ పరిరక్షణ పేరుతో గిరిజన తెగలపై జరుగుతున్న దాడిగా అర్థం చేసుకోవాలి. గిరిజన తెగలకు రిజర్వేషన్లు ప్రత్యేక గిరిజన జిల్లాలు, షెడ్యూల్ గిరిజన ప్రాంతాలు ప్రకటన 244 (1) ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో తొమ్మిది జిల్లాలలోని ఐదు వేల తొమ్మిది వందల నలభై ఎనిమిది గ్రామాలనూ 5వ షెడ్యూల్ గ్రామాలుగా ప్రకటించారు. మరో ఎనిమిది వందల తొమ్మిది గ్రామాలనూ నూటికి నూరు శాతం గిరిజనులు నివసిస్తున్న గ్రామాలనూ షెడ్యూల్ ఏరియా ప్రాంతాలలో చేర్చాల్సి ఉంటుంది. ఐదో షెడ్యూల్ ప్రధానంగా భూమి సమస్యను ప్రస్తావించి షెడ్యూల్ గ్రామ సభల ద్వారా భూ పంపిణీ జరగాల్సి ఉంది. దీనిలో భూ సమస్యను పరిష్కరించడంలో గిరిజన సంక్షేమానికి బాధ్యత వహిస్తున్న అధికారులకు రెవెన్యూ సమస్యలను పరిష్కరించే హక్కు కూడా షెడ్యూల్ ఏరియాలో ఉందని కోర్టులు ధృవీకరించాయి.

2006లో గిరిజన తెగల అటవి హక్కుల చట్టం మరింత స్పష్టంగా సంప్రదాయపు గిరిజన భూములు, అటవి భూములపై హక్కును కల్పించింది. అయినా మన రాష్ట్రంలో భూ సమస్యను పరిష్కరించే చర్యలను ఈ రాష్ట్ర ప్రభుత్వం చేపట్టలేదు. అటవీ హక్కుల చట్టం అమలు చేయడంలో ఆలస్యం చేయడంలో, నీరు గార్చడంలో రాష్ట్ర ప్రభుత్వం జోక్యం స్పష్టంగా కనిపిస్తుంది.

ఆదివాసీ గిరిజనులు భూమి కోసం, స్వయం పాలన కోసం చిరకాలంగా పోరాటాలు సాగిస్తున్నారు. ఇలాంటి పోరాటాలకూ కమ్యూనిస్టు పార్టీలు, విప్లవ సంస్థలు సహకారాన్ని అందిస్తున్నాయి. కొన్ని దశాబ్దాలుగా గిరిజన తెగలు అటవి భూములపై హక్కు కోసం చేస్తున్న పోరాటాలకు యుపిఎ -1 పాలనలో వామపక్షాల ఒత్తిడితో మాత్రమే చట్టం రూపంలో ఫలితమిచ్చింది. ఇలాంటి పోరాటాలు అనేక రూపాలుగా జరుగుతున్నప్పటికీ దేశ రాజకీయ ఆర్థిక విధానాలతో ఢీకొనగలిగిన పోరాటాలు మాత్రమే పరిమితంగా అయిన ఫలితాలు ఇస్తాయి. మనదేశంలో జనతా ప్రజాస్వామిక విప్లవం కోసం జరుగుతున్న కార్మికవర్గ పోరాటాలతో గిరిజనోద్యమం మమేకమై సాగినప్పుడు మాత్రమే భూమిపై గిరిజనులకు సంపూర్ణ హక్కు కలుగుతుంది. ఈ దేశంలో చాలా మంది ఆదివాసులు అమానుషమైన అర్ధఫ్యూడల్ దోపిడీకి బలవుతున్నారు. వారి భూములు అన్యాక్రాంతం అవుతున్నాయి. అడవిపై హక్కు కోల్పోతున్నారు. కాంట్రాక్టర్లు, భూస్వాములు వారిని చౌకగా దొరికే శ్రామిక వనరుగా ఉపయోగిస్తున్నారు.

కొన్ని రాష్ట్రాల్లో ప్రత్యేక భాషా సంస్కృతి గల తెగలు అధికంగా నివసించే సాంద్రమైన ప్రాంతాలు ఉన్నాయి. తమ గుర్తింపునూ, సంస్కృతీ సంప్రదాయాలనూ సంరక్షించుకుంటూ హక్కుల కోసం నేడు ఉద్యమిస్తున్నారు. తమ ఉనికికి ముప్పు ఏర్పడడం వల్ల బూర్జువ భూస్వామ్య పాలకులు నిర్లక్ష్యపూరిత విధానాల వల్ల గిరిజనుల్లో కొన్ని తరగతులలో వేర్పాటువాద ధోరణులు పెరిగాయి. ఆదివాసీ గిరిజనులు శ్రీకాకుళం నుండి ఆదిలాబాద్ వరకు విస్తరించి ఉన్న నేపథ్యంలో వారి ఉనికి, హక్కులు కాపాడుకునేందుకు స్వయం పాలన డిమాండ్ న్యాయమైంది.

శాస్త్రీయమైన ఆదివాసీ గిరిజన ఉద్యమాలకు ప్రజలు, ప్రజా స్వామికవాదులు, మేధావులు తమ తోడ్పాటును అందించవల్సి ఉంది.

### డిమాండ్లు

1) అటవి హక్కుల చట్టాన్ని, పీసా చట్టాన్ని పకడ్బందీగా అమలు చేయాలి.
2) గిరిజనులను ఎ.బి.సి.డి.లుగా వర్గీకరించాలి.
3) గిరిజన స్వయం పాలన కోసం 5వ షెడ్యూల్ 6వ షెడ్యూల్ నియమ నిబంధనలు అమలు చేయాలి.
4) ఛత్తీస్‌ఘడ్‌లో సల్వాజుడుం తదితర ప్రైవేట్‌సంస్థలను నిషేధించాలి.
5) ఐ.టి.డి.ఎ. పరిధిలోకి పోలీస్ డిపార్ట్‌మెంట్‌ను చేర్చాలి.
6) ఏజెన్సీ ప్రాంతాలలో జి.ఒ. నెం. 3ని పకడ్బందీగా అమలు చేయాలి.
7) గిరిజనోద్యమాలపై అటవీ అధికారుల, పోలీసుల, దౌర్జన్యకాండను నిలిపివేయాలి. అక్రమంగా పెట్టిన కేసులను ఎత్తివేయాలి.

*(రచయిత ఇగ్నో ఎం.ఎ. విద్యార్థి)*

**అవగాహన తరగతి**

*డిసెంబర్ 18న వీక్షణం కార్యాలయంలో మధ్యాహ్నం 3 గంటల నుంచి సాయంత్రం 6 గంటల వరకు 'మతం పుట్టుపూర్వోత్తరాలు' అనే అంశంపై డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్ ప్రసంగం, చర్చ జరిగింది. అనేక ప్రశ్నలకు ఆయన సమాధానాలు చెప్పారు. ఈ సమావేశంలో విద్యార్థులు, రచయితలు, వివిధ సంఘాల కార్యకర్తలు పాల్గొన్నారు.*

*పుస్తకాల ఎంపికలో పాఠకుల ఆసక్తులూ, అభిరుచులూ, ప్రమాణాలూ ఎలా పనిచేస్తున్నాయో అనుభవాల నుంచి వివరిస్తున్నారు* **వై. రామచంద్రం, సి. రాజశేఖర్, ఎ. మల్లేష్, వై. నర్సింలు**

# పుస్తకంపై ఆసక్తి తగ్గలేదు

నేటి హైటెక్, ఫాస్ట్ యుగంలో ఇంటర్నెట్, మొబైల్ ఫోన్‌లు వచ్చిన తరువాత పుస్తకాలకు ఆదరణ తక్కువయిందన్న అభిప్రాయం ఉంది. మేము పాల్గొన్న మూడు బుక్ ఫెయిర్‌ల అనుభవంలో అది తప్పు అని అనిపించింది. బుక్ ఫెయిర్‌లకు ప్రజల నుంచి లభించిన ఆదరణ చూస్తే పుస్తకం పై ప్రజలకు ఆసక్తి తగ్గలేదని మాకనిపించింది. మేము గత నవంబర్‌లో ఖమ్మం, డిసెంబర్‌లో హైదరాబాద్, జనవరిలో విజయవాడలలో జరిగిన బుక్ ఫెయిర్‌లలో పాల్గొన్న అనుభవాలు మీతో పంచుకునేందుకే ఈ చిన్న ప్రయత్నం.

'చినిగిన చొక్కా అయినా తొడుక్కో, ఒక మంచి పుస్తకం కొనుక్కో' అన్న సూక్తి పుస్తక ప్రదర్శనను చూడగానే గుర్తొస్తుంది. మనిషి జీవించడానికి గాలి, నీరు, ఆహారం ఎంత అవసరమో, జ్ఞానం సంపాదించడానికి, తను అనుకున్న గమ్యానికి చేరుకోవడానికి పుస్తక పఠనం కూడా అంతే అవసరం. మానవుడు సృష్టించిన అపూర్వ వస్తువుల్లో పుస్తకం ఒకటి. పుస్తకాలు చదవడం వల్ల మానసిక స్థైర్యం, మానసిక ఉల్లాసం వస్తుంది. చరిత్ర, తత్వశాస్త్రం, భూగోళ, ఖగోళ శాస్త్రాలు, సాహిత్యం, సామాజిక, వైజ్ఞానిక శాస్త్రాల ద్వారా మనిషి ఆలోచనలు విశాలం అవుతాయి. పుస్తకాలే మనిషికి నిజమైన నేస్తాలు.

బుక్ ఫెయిర్‌లు నిర్వహించడం ఒక మంచి సంప్రదాయం. పుస్తక ప్రియులకు మంచి అవకాశం. అన్ని రకాల పుస్తకాలు ఒక చోటనే లభించడం పాఠకులకు ఒక గొప్ప అవకాశం.

చిన్న పిల్లలు మొదలుకొని అన్ని వయసుల వాళ్లకి పుస్తకాలు ప్రదర్శనకూ, అమ్మకానికీ పెట్టారు. సాహిత్యం, విద్యా రంగం, వృత్తి నైపుణ్యం, వ్యక్తిత్వ వికాసం, ఆధ్యాత్మికం.... ఇలా అన్ని రకాల పుస్తకాలు లభించడం బుక్ ఫెయిర్ ప్రత్యేకత. తెలుగు భాషలోనే కాక ఇతర భాషల పుస్తకాలు కూడా అందుబాటులో పెట్టారు. బుక్ ఫెయిర్‌కు ప్రతిరోజూ వేల సంఖ్యలో సందర్శకులు వచ్చేవారు. అన్ని వయసుల వాళ్లూ వచ్చేవారు.

ఖమ్మంలో 96, హైదరాబాద్‌లో 250, విజయవాడలో 296 స్టాల్స్ ఏర్పాటు చేశారు. ఖమ్మం, విజయవాడలలో ప్రవేశం ఉచితంగా ఉన్నందున చాలా మంది బుక్ ఫెయిర్ చూడడానికి వచ్చారు. హైదరాబాద్‌లో ప్రవేశ రుసుం పెట్టారు. అయినా క్రితం సంవత్సరం కంటే ఈ సంవత్సరం చలి ఎక్కువగా ఉండడం, హుసేన్‌సాగర్ అంచున ఉండడం వల్ల హైదరాబాద్ బుక్ ఫెయిర్‌కు జనం చాలా పలుచగా వచ్చారు.

పుస్తక పరిచయాలూ, పుస్తక ఆవిష్కరణ సభలూ బుక్‌ఫెయిర్ ప్రాంగణంలోనే నిర్వహించడం, సాహిత్యరంగంలో కృషిచేసిన వారి అనుభవాలను పంచుకునేందుకు వేదిక కల్పించడం కొత్త తరానికి ఆసక్తి పెంచడానికి పనికి వచ్చేదిగా ఉంది. వివిధ భాషలలో సాహిత్యానికి తెలుగు అనువాదాలు కూడా విరివిరిగా అందుబాటులోకి వచ్చాయి.

ఆధ్యాత్మికం, వృత్తి నైపుణ్యం, చిన్న పిల్లల కథలు, వ్యక్తిత్వ వికాసంకు సంబంధించిన పుస్తకాలకు చాలా డిమాండ్ ఉంది.

ఇక్కడ ఒక విషయం చెప్పాలి. అది ఏమిటంటే చేగెవారా అంటే యువతకి ఒక క్రేజ్, ఒక జిజ్ఞాస. ఆయనకు సంబంధించిన పుస్తకాలు కనీసం ఒక్కసారైనా చూడడానికైనా ఇష్టపడతారు. అలాగే అంబేద్కర్‌కు సంబంధించిన రచనలు, జీవిత చరిత్రలకు బాగా ఆదరణ ఉంది. ఒకప్పుడు విప్లవ సాహిత్యం పుస్తకాలు బహిరంగంగా కొనడానికి, చదవడానికి ఆలోచించేవారు. అలాంటి పుస్తకాలు కొనడం ఇబ్బంది అనుకునేవారు. కానీ ప్రజలలో చాలా మార్పు వచ్చింది. వాటిని ఇప్పుడు అడిగి మరీ కొనుక్కుంటున్నారు. మార్క్స్, లెనిన్, మావో రచనలు, మన దగ్గర  ఉన్న విప్లవ సాహిత్యానికి కూడా మంచి ఆదరణ లభించింది.

పేద విద్యార్థులు పాఠకులుగా తయారు కావాలంటే వారికి వివిధ సంస్థలు, ప్రచురణకర్తలు తక్కువ ధరకు లేదా ఉచితంగా పుస్తకాలు పంపిణీ చేస్తే బాగుంటుంది. సమాజంలో మార్పు జరగాలి. సమానత్వం ఏర్పడాలి అంటారు. వారికి ఆర్థిక సహాయం చేయకున్నా మంచి పుస్తకాలు అందించగలిగితే వారి మానసిక స్థైర్యంలో, ఎదుగుదలలో మార్పు వస్తుంది. మనిషి మానసిక పరివర్తనలో మార్పు వచ్చినప్పుడు అది సమాజ మార్పుకూ దోహదం చేస్తుంది.

### కొన్ని అనుభవాలు :

– కొన్ని విలువయిన పుస్తకాలు కొనుక్కోవడానికి ధరలు అందుబాటులో లేకపోగా, పేపరు చాలా తక్కువ నాణ్యతతో ఉండడం వల్ల ఎక్కువ కాలం మన్నిక లేకుండా, నలుగురు చదువుకోవడానికి పంచుకోవడానికి వీలు లేకుండా ఉన్నాయి. ఒకరు మాత్రమే చదివితే దాని ఉపయోగపు విలువ అయిపోయేట్టుగా ఉన్నాయి.

– వ్యక్తిత్వ వికాసం, ఇంగ్లిష్ లెర్నింగ్ పుస్తకాలు, ఆధ్యాత్మిక పుస్తకాలు, ఆరోగ్య పుస్తకాలను మహిళలు ఎక్కువగా కొనుగోలు చేస్తున్నారు.

– పిల్లలు కొనే పుస్తకాలలో నీతి కథలు, దేశభక్తికి సంబంధించిన పుస్తకాలు, నాయకుల జీవిత చరిత్రలు ఉన్నాయి.

– యువకులు కెరీర్‌కు సంబంధించిన, అందులోనూ వారికి సంబంధించిన ప్రత్యేకమైన పుస్తకాలు ఎక్కువగా కొంటున్నారు. ఇందులో ధరలతో సంబంధంలేకుండా కొనుగోలు చేస్తున్నారు.

– అభ్యుదయ సాహిత్యాన్ని నలబై పైబడిన వారు మాత్రమే కొంటున్నారు.

– సామాజిక పరమైన సాహిత్యాన్ని కింది వర్గాలకు చెందినవారు ఎక్కువగా చదువుతున్నారు. చదవాలనే ఆసక్తి ఉన్నా ధరలు ఎక్కువగా ఉండడంతో వెనక్కి తగ్గుతున్నారు.

– వస్తు ప్రపంచంలో కొట్టుకుపోకుండా ఉండడానికి తమ పిల్లలకు కథల పుస్తకాలను కొని, తమ వంతు ప్రయత్నం చేస్తున్న తల్లిదండ్రుల తపన కనబడింది.

– ఇప్పుడున్న యువత రెడీమెడ్‌ను ఎక్కువగా ఆస్వాదిస్తున్నారు. 'బుక్' కల్చర్ నుండి 'లుక్' కల్చర్‌లోకి పయనిస్తున్నారనిపిస్తోంది. యువత దృష్టంతా స్క్రీన్ లేదా సౌండ్‌లో నిమగ్నమౌతోంది. టివి, కంప్యూటర్, సెల్‌లో మాట్లాడడం, మెసేజ్ పంపడాలు, పాటలు వినడం, గేమ్స్ ఆడడం ఇలా ఇంకా చాలా రకాలుగా వాడుతున్నారు.

వేల రూపాయల ఖరీదైన పుస్తకాలు అమ్ముడవుతున్నాయనే సంతోషం పబ్లిషర్స్‌కు ఉండవచ్చు. ఆ పుస్తకం ధర ఎవరికి అందుబాటులో ఉంటుంది, దాని ద్వారా ఎవరికి ఉపయోగ పడుతుంది అనే విషయం ఆలోచిస్తే ఇందులో పేద, ధనిక వర్గానికి సంబంధించిన విషయంగా చూడవచ్చునేమో అనిపిస్తుంది. వేల రేట్లతో ఉన్న ఎంత మంచి పుస్తకమైనా సామాన్యులకు అందుబాటులో లేనప్పుడు అది పుస్తకాన్ని ముద్రించిన వారికి, పబ్లిషర్‌కు, దాన్ని చదివి సొమ్ముచేసుకునే వారికి దాని ఉపయోగం పరిమితమౌతుంది అనేది ఒక అభిప్రాయం.

అక్షర జ్ఞానం పెరిగింది కాని జ్ఞాన పరంగా ఎదగలేదు. అందుకు ప్రభుత్వాలు గ్రామాల్లో గ్రంథాలయాలను ఏర్పాటు చేసి విస్తృతంగా ప్రజలకు అందుబాటులోకి తీసుకురావాల్సిన అవసరం చాల ఉంది. గ్రంథాలు కూడా మాతృభాషలో ఉండాలి. అప్పుడు సామాన్య అక్షర జ్ఞానం ఉన్నవాళ్లు కూడా సృజనాత్మకతను వ్యక్తీకరించడానికి, సమాజాన్ని అర్థంచేసుకొని తక్కువ సమయంలో సమాజాన్ని ఉన్నతీకరించడానికి తోడ్పడుతుంది. పుస్తకాలు మాతృభాషలో ఉండడం వల్ల కొంతవరకైనా సామాన్యులకు సమాజాన్ని అర్థం చేసుకోవడానికి, సామాజిక అభివృద్ధికి, మార్పుకు తోడ్పడతాయి.

గ్రంథాలయ స్థాపన మళ్లీ ఒక ఉద్యమంగా ఊరూరా విస్తరింప జేసినప్పుడే సమాజం ఒక అడుగు ముందుకు వేయడానికి, అది అర్థవంతంగా నిలబడి ఉండడానికి ఉపయోపడుతుంది. మన భాషా సాహిత్యం, చరిత్రలను కాపాడుకోవడానికి ఈ పని మనం విస్తృతంగా చేయాల్సి ఉంది. మనిషి ఇంత చైతన్యాన్ని సాధించాడంటే శ్రమ ద్వారా వచ్చిన అనుభవాన్ని అక్షరబద్ధం చేయడం వల్లనే ఇన్ని రకాల వసతులను (సమానంగా కాకపోయినా) పొందగల్గుతున్నాం. జ్ఞాన పరంగా అందరూ అభివృద్ధి చెందనంత వరకు అది కొందరి చేతుల్లోనే ఉండి మార్కెట్ సరుకుగా మారి ఆస్తిగా ఉంటుంది. వి

ప్రకృతినీ, పరిసరాలనూ పరిశీలించి, పదార్థాలను ఉపయోగంలోకి తెచ్చి, మనుగడ సాగించిన అందరూ ఆయా కాలాలలో శాస్త్రవేత్తలే అంటున్నారు **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# అపోహలూ, గుడ్డి నమ్మకాలూ

ప్రపంచంలో ఎదురయే వింతలూ, విచిత్రమైన విషయాల పట్ల మనిషికి ఆదినుంచీ భయాలూ, అపోహలూ, ఆసక్తీ ఉంటూనే ఉన్నాయి. ఈ మూడు భావాలూ అదే క్రమంలో కలిగాయనేది కూడా నిజం. భయం తీరి, అపోహలు కాస్త కాస్తగా తగ్గాక పెరిగే ఆసక్తి వల్ల మనిషి పరిశోధనలూ, పరిశీలనలూ మొదలుపెట్టాడు. మొదట్లో ప్రకృతిని అర్థం చేసుకోవడం, తరవాత దాన్ని తనకు అనుకూలంగా మలుచుకోవడం ఆరంభించాడు.

మొదటిది విజ్ఞానం అనుకుంటే రెండోది టెక్నాలజీ అనుకోవచ్చునేమో. ఇలాంటి వ్యాసాలను చదివిన కొందరు విద్యాధికులైన మిత్రులు ఏవో కొన్ని విషయాల గురించి తమ అభ్యంతరాలను లేవనెత్తే సందర్భంలో 'మీ సైంటిస్టులు' అంటూ వాక్యాన్ని మొదలెట్టడం చూస్తే ఆశ్చర్యం కలిగింది. సైంటిస్టులు ఏదో ఒక ప్రత్యేకజాతికి చెందినవారని ఈనాటికీ ఎవరైనా అనుకుంటూ ఉంటే అది అజ్ఞానమే అనిపిస్తుంది.

మొదటగా నిప్పు ఉపయోగాన్ని కనిపెట్టిన గుహావాసులు సైంటిస్టులే. ఫలానా చెట్టుకు కాసిన పళ్లు విషమని తెలుసుకుని ఇతరులకు హెచ్చరించినవాళ్లూ సైంటిస్టులే. ఎప్పుడూ అశుభ్రంగా ఉండే ప్రాంతాల్లో తిరుగుతూ, ఇంటి పనులు చేసుకుంటూ ఉన్న స్త్రీలు కాళ్లకు పసుపు రాసుకుంటే క్రిమిసంహారకంగా పని చేస్తుందనీ, ఇంటి గడపలకు పసుపు రాస్తే క్రిములు లోపలికి ప్రవేశించవనీ చెప్పిన మనవాళ్లు సైంటిస్టులు కారా? అలాగే విత్తులు నాటి వ్యవసాయం మొదలెట్టినవారూ, మబ్బుల కదలికనూ, రుతువుల క్రమాన్నీ అర్థం చేసుకుని 'నువ్వులు' జాగర్త చేసినవారూ, రాత్రి పూట నక్షత్రాల సహాయంతో ఓడలు నడిపినవారూ అందరూ తమ తమ కాలంలో అందుబాటులో ఉన్న జ్ఞానాన్ని వినియోగించుకున్న సైంటిస్టులే. ఇదంతా సైన్స్ కాదనీ నిజమైన సైంటిస్టు తాను సంపాదించిన జ్ఞానాన్ని విశ్లేషణ కూడా చేస్తాడనీ వాదించవచ్చు. శైశవదశలో మొదలైన మానవ సమాజం ఆ దశకు చేరుకోవడానికి సమయం పట్టింది. ఏమైనా కొంత వివేచనా, వివేకమూ ఉండడం వల్లనే మనిషికి ప్రాథమిక విజ్ఞానం అందుబాటులోకి వచ్చిందనడంలో సందేహం లేదు.

విజ్ఞానం పెరిగిన చోట గుడ్డినమ్మకం తగ్గుతూ పోతుంది. క్రీస్తుకు రెండు మూడువేల ఏళ్ల క్రితం సుమేరియన్ నాగరికతలో వానలు కురిసినప్పుడు 'మార్డుక్' అనే దేవతవల్ల పంటలు పండుతాయనే నమ్మకం ఉండేదట. ఆ తరవాత ఆ నాగరికతకు పరోక్షంగా వారసులైన గ్రీక్ తత్వవేత్తలు క్రీ.పూ. అయిదో శతాబ్దం ప్రాంతంలో మార్డుక్ సంగతి వదిలేసి వానలు కురిసినప్పుడు పంటలు పండుతాయనే ప్రతిపాదన చేశారట. ఇది విజ్ఞాన ప్రగతిలో ఒక మెట్టు. ఈ నాటికీ ఎంత దైవభక్తి ఉన్నా, పొయ్యిమీద పెట్టిన పాలు పొంగకుండా ఉండటానికీ, బైటికి వెళ్లేటప్పుడు దొంగలు చొరబడకుండా వీధి తలుపుకు తాళం వెయ్యటానికీ ఎవరూ దేవుడి మీద ఆధారపడరు. దీని కర్థం ఒకటే. మనకి తెలియనివీ, 'అలవి' కానివీ అయిన విషయాల్లోనే మనం దేవుణ్ణి నమ్ముతాం. దీన్నిబట్టి చూస్తే మనం ఆదిమ మానవులంత వెనకబడి ఉన్నట్టే అనిపిస్తుంది. ఎందుకంటే ఆ రోజుల్లో అడవుల్లో వాటంతటవే రాజుకునే అగ్నికీలలూ, అకస్మాత్తుగా ఉరిమి, వర్షించే మేఘాలూ అన్నీ అప్పటివారిని భయ భ్రాంతులను చెయ్యడంతో వారు అగ్నిదేవుణ్ణీ, వానదేవుణ్ణీ, వాయుదేవుణ్ణీ ఊహించుకుని వారిని 'మంచి' చేసుకోవడానికి పూజలు చేశారు.

ఇవన్నీ ప్రకృతి సిద్ధంగా జరిగే విషయాలేనని అర్థం అయిన దశలో ఈ దేవుళ్ల ప్రాభవం తగ్గిపోయిందని మనకు తెలుసు. అందుచేత మరింత నాజూకు పద్ధతుల్లో గుడ్డిగా అన్నిటినీ నమ్మే ఆధునికులు ఆటవికదశను దాటారని చెప్పలేం. అంతేకాదు, గ్రామదేవతలకు బలులిచ్చి మొరటుగా పూజలు చేసేవారికీ, తిరుపతివంటి 'పెద్ద' ఆలయాలకు వెళ్లి సంస్కృతంలో శ్లోకాలు చదివేవారికీ ఏ మాత్రమూ తేడాలేదు. అలాగే మొక్కుల మీద నమ్మకం ఉన్నవారికీ, బుడబుక్కలవాణ్ణి పిలిపించేవారికీ, చిలక జోస్యంగాళ్లకూ కూడా పెద్దగా తేడాలేదు.

అజ్ఞానానికి నమ్మకం అనేది ప్రత్యామ్నాయం. వ్యక్తిగతంగానూ, సామాజికంగానూ గుడ్డినమ్మకాలు కొంత ఊరటనిచ్చి మేలు చేస్తాయని సైకాలజిస్టులు మనకు చెప్పవచ్చు. అదే నిజమైతే నమ్మకాలు ఒక ఊతకర్ర వంటివి మాత్రమే అని గుర్తించడం అవసరం. జీవరాశి అంతా కేవలం జీవరసాయనాల కలయికవల్లనే రూపొందిందని రెండు మూడు తరాలుగా నేర్చుకున్న పాశ్చాత్య సమాజంలో ప్రజలకు వ్యక్తిగత స్థాయిలో దేవుడి మీద మనవారిలాగా గుడ్డి నమ్మకం ఉండదు. అందువల్లనే ఆ దేశాల్లో ఫ్లయింగ్ సాసర్ల గురించీ, గ్రహాంతరవాసులు రావడం గురించిన నమ్మకాలు పెరుగుతున్నాయని కొందరు విశ్లేషకుల అభిప్రాయం.

మన దేవతల్లాగా నాలుగు చేతులతో (ఆడదేవతలు అందుకు అనువైన బ్లౌజులు కూడా ధరించినట్టు బొమ్మలు గీస్తారు) ఎవరూ

ప్రత్యక్షం కారు గనక పాశ్చాత్యదేశాల్లో గ్రహాంతరవాసుల చిత్రీకరణ ఆకుపచ్చని మొహాలతో, బాగా వెడల్పైన నుదుటితో (ఎక్కువ తెలివితేటలు కదా!), తలమీద రెండు ఏంటెనాలతో జరుగుతుంది. ఇది ఎక్కువ 'సహేతుకం' అనిపిస్తుందేమో కాని ఇదీ ఒకరకమైన గుడ్డినమ్మకంతో కూడిన ఆశాభావ దృక్పథం. మనిషిని 'మించిన' శక్తి, లేదా వ్యక్తి కోసం వెతుకులాట.

మనకు తెలియని విషయాల గురించి మతం పేరుతో వివరణ ఇచ్చేవారిని నమ్మకుండా ఉండడమే మంచిది. 'దేన్నైనా ఎలాగైనా సమర్థించవచ్చు కదా' అన్న వాదం ప్రమాదకరం. సైన్స్‌లో తెలియని విషయాలు ఎన్నో ఉన్నాయి. వాటిని గురించి ఎప్పటికప్పుడు ప్రయత్నించి, మరింతగా తెలుసుకోవడమే లక్ష్యం. మూఢనమ్మకాలనూ, అర్థంలేని మతవిశ్వాసాలనూ ప్రోత్సహిస్తూ, పుట్టేది ఆడపిల్ల అయితే అందుకు తల్లే కారణమని నిందించే మూర్ఖులు ఈ నాటికీ విద్యాధికుల్లో ఎందరో కనిపిస్తారు. వీరి సంగతే ఇలా ఉంటే సగం అక్షరాస్యులైన కోట్ల ప్రజల మాటేమిటి? తన డయాబిటీస్ వ్యాధినే నయం చేసుకోలేని బాబా 'శక్తుల' గురించి వైనవైనాలుగా వర్ణించేవారిని ఏమనాలి? ప్రజల అమాయకత్వాన్నీ, అయోమయాన్నీ ఆసరాగా చేసుకుని పబ్బం గడుపుకునేవారిని పట్టుకునేదెవరు? ఈ ప్రశ్నలకు జవాబులు లేవు. 'ఆస్తికులు' ఇలాటి వ్యాసాలు చదవరు.

అయినా బొత్తిగా నిరుత్సాహపడవలసిన అవసరం లేదు. అప్పుడప్పుడూ వెనకడుగు వేసినా మానవసమాజం భౌతికవాదం దిశగానే ముందుకు వెళుతుంది. జనాభా పెరిగి, సమస్యల పరిష్కారాలకు టెక్నాలజీ మీద అంతకంతకూ ఎక్కువగా ఆధారపడవలసిన ప్రస్తుత పరిస్థితుల్లో అది తప్పనిసరి అవుతుంది. ఉదాహరణకు మశూచివంటి వాటికి కారణం 'అమ్మవారు' కాదని నెమ్మదిగా జనం తెలుసుకుంటున్నారు.

ఈ సందర్భంలో పల్లెపల్లెకూ తిరిగి ఓపికగా ప్రజలకు నచ్చజెప్పి టీకాల ద్వారా రోగవ్యాప్తి నిరోధానికి పాటుపడిన వైద్యులకు తగిన గుర్తింపు రాకపోవచ్చు. కానీ వాళ్లని ఎవరూ నాస్తికులని తిట్టలేదు. మనదేశంలో లాగానే ఒకప్పుడు గ్రీక్ తత్వవేత్తలు ప్రయోగాలద్వారా జ్ఞానం పొందడం మానేసి కేవలం 'వాదనల' ద్వారా తత్వపరమైన ఆలోచనలు చేసేవారట. అలాకాకుండా ఎవరో కొందరు ప్రతిదాన్నీ ప్రయోగాత్మకంగా పరిశీలన చెయ్యడం వల్లనే మానవజాతి ఈ మాత్రమైనా ప్రగతిని సాధించిందని చాలామంది గుర్తించరు. మూఢ విశ్వాసాలకు కొత్తరంగులు పులుముకుంటూ, వాటిని బలపరచడం తమ జన్మహక్కయినట్టు ప్రవర్తించే ఆధునిక ఆటవికులకు ఈ విషయం ఎన్నిసార్లు చెప్పినా తప్పులేదు.

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)* వీ

## భారత్‌లో ఉండలేం!

దేశంలో విచ్చలవిడిగా పెరిగిపోతున్న అవినీతిపై ఆవేదన చెందిన ఏడుగురు గాంధేయవాదులు నిరసన దీక్షకు సిద్ధమయ్యారు. అవినీతి, నేరాల నుండి రాజకీయాలను వేరుచేయాలనే డిమాండ్‌తో జనవరి 1న ఢిల్లీలోని జంతర్ మంతర్ వద్ద సత్యాగ్రహం చేశారు. మేము బాపు, భగత్ సింగ్ జన్మించిన దేశానికి చెందినవాళ్లం. అవినీతి భారత్‌లో ఉండలేం అని శంభూదత్తా(92) అన్నారు. ఈ సందర్భంగా ప్రభుత్వం ముందు మూడు డిమాండ్లు ఉంచారు. 1. శక్తివంతమైన లోక్‌పాల్‌ను వెంటనే నియమించాలి. 2. తీవ్రమైన క్రిమినల్ కేసులు ఎదుర్కొంటున్నవారు ఎన్నికల్లో పోటీ చేయకుండా నిషేధించాలి. 3. ప్రభుత్వాధికారులు, వారి బంధువులు అక్రమంగా కూడబెట్టిన ఆస్తులను స్వాధీనం చేసుకోవాలి.

## ఉల్ఫాతో శాంతి చర్చలు

జనవరి 1న గౌహతి కేంద్ర కార్మాగారం నుండి విడుదలైన ఉల్ఫా అధినేత అరబింద రాజ్ కోవా అస్సాం ప్రభుత్వంతో శాంతి చర్చలకు సిద్ధంగా ఉన్నామని వెల్లడించారు. అస్సాంలో శాంతికి కట్టుబడి ఉన్నామని తెలిపారు. చర్చల్లో పాల్గొనడానికి తనతో పాటు ఉల్ఫా కేంద్ర కమిటీ సభ్యులు శస చౌధరి, చిత్రాబాన్, చిత్రాబాన్ హజారికాలను కూడా విడుదల చేయాలని ప్రభుత్వాన్ని కోరారు. చర్చలకు వీలుగా అవసరమైతే నిషేధం ఎత్తివేస్తామని అస్సాం ముఖ్యమంత్రి తరుణ్ గొగోయ్ తెలిపారు.

## బోఫోర్స్‌లో అవినీతి నిజమే

రాజీవ్‌గాంధీ ప్రభుత్వ హయాంలో బోఫోర్స్ కంపెనీతో ఆయుధాల కొనుగోలు కోసం రు. 1437 కోట్ల ఒప్పందం కుదుర్చుకున్నది. అప్పటి కేంద్ర ప్రభుత్వం స్వీడన్‌కు చెందిన ఎబి బోఫోర్స్ కంపెనీకి రు. 41 కోట్లు అధికంగా చెల్లించినట్టు ఆదాయపు పన్ను (ఐటి) అప్పిలేట్ ట్రిబ్యునల్ స్పష్టం చేసింది. ఈ డబ్బు మొత్తం రాజీవ్‌గాంధీ కుటుంబానికి సన్నిహితులు నడిపె కొల్బార్ ఇన్వెస్ట్‌మెంట్స్ లిమిటెడ్, వెల్సన్ ఓవర్సీస్ ఖాతాల్లోకి జమయినట్లు ట్రిబ్యునల్ పేర్కొంది. బోఫోర్స్ లావాదేవిల్లో ఎవరికి ఎటువంటి కమిషన్లు అందలేదని సిబిఐ తన దర్యాప్తులో తేల్చగా, దానికి విరుద్ధంగా ఐటి ట్రిబ్యునల్ తీర్పువెలువడింది. ఆదర్శ్ సొసైటీ, 2జీ, కామన్‌వెల్త్ క్రీడల కుంభకోణాలలో కూరుకు పోయిన కాంగ్రెస్‌కు ట్రిబ్యునల్ తీర్పు మరోదెబ్బ.

## ఎన్‌కౌంటర్‌పై సుప్రీంకోర్టు ఆగ్రహం

మావోయిస్టు పార్టీ కేంద్ర కమిటీ అధికార ప్రతినిధి అజాద్, జర్నలిస్ట్ హేమచంద్రపాండేల ఎన్‌కౌంటర్‌పై సుప్రీంకోర్టు గర్హించింది. వారి మరణంపై న్యాయవిచారణకు ఎందుకు ఆదేశించకూడదో ఆరు వారాల్లో సమాధానం ఇవ్వాలని జనవరి 14న కేంద్రం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలను ఆదేశించింది. జూలై 1, 2010న ఆదిలాబాద్ జిల్లాలోని వాంకిడి అడవుల్లో పోలీసులు జరిపిన కాల్పుల్లో అజాద్, పాండేలు మరణించారు. దీనిపై ప్రపంచ వ్యాప్తంగా ఉన్న ఉద్యమ సంస్థల నుండి హక్కుల సంఘాల నుండి, మేధావుల నుండి తీవ్ర విమర్శలు వెల్లువెత్తాయి. అజాద్, పాండేలను నాగ్‌పూర్ నుండి పట్టుకెళ్లి బూటకపు ఎన్‌కౌంటర్లో కాల్చిచంపారని, దీనిపై న్యాయ విచారణ జరపాలని సామాజిక కార్యకర్త స్వామి అగ్నివేశ్, పాండే భార్య బబిత వేసిన పిటిషన్లపై జస్టిస్ ఆఫ్తాబ్ ఆలం, జస్టిస్ ఆర్.ఎం. లోధాలతో కూడిన సుప్రీంకోర్టు ధర్మాసనం విచారణ సాగించింది. ఈ సందర్భంగా ధర్మాసనం స్పందిస్తూ 'మనది గణతంత్ర దేశం ఇందులో రాజ్యం చట్టాలకు అతీతంగా, తన సొంత పిల్లల్ని చంపుకోవడాన్ని మేం అంగీకరించలేం' అని సుప్రీంకోర్టు వ్యాఖ్యానించింది.

## శబరిమలైలో తొక్కిసలాట

మకరజ్యోతిని దర్శించుకుని శబరిమలై నుంచి తిరిగి వస్తున్న అయ్యప్ప భక్తులు జనవరి 14న రాత్రి 8:30 గంటలకు కెరళలోని ఇదుక్కి జిల్లా పులుమేడిలో జరిగిన తొక్కిసలాటలో అకాల మరణానికి గురైనారు. పొలిమేడులో ఓ వాహనం అదుపు తప్పి భక్తులపైకి రావడంతో భయాందోళనకు లోనై తొక్కిసలాట జరిగింది. ఈ ఘటనలో 102 మంది చనిపోగా, 50 మందికి పైగా గాయపడ్డారు. మృతుల్లో అత్యధికులు తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, కర్నాటకలకు చెందినవారున్నారు.

## విదేశాల్లోని నల్లడబ్బు ఎక్కడిది?

విదేశీ బ్యాంకుల్లో గుట్టలుగా పోగుపడిన లక్షల కోట్లు మన దేశ సంపన్నులు దాచిన నల్లడబ్బు బయటపడింది. ఒక్క స్విస్ బ్యాంకులోనే భారతీయులు దాచుకున్న సొమ్ము డెబ్బై లక్షల కోట్ల రూపాయలు ఉన్నట్లు గణాంకాలు తెల్పుతున్నాయి. ఆ సొమ్మంతా దేశాన్ని కొల్లగొట్టిన సంపదేనని సుప్రీంకోర్టు కూడా తీవ్రంగా వ్యాఖ్యానించింది. వారి పేర్లు వెల్లడించడానికి ప్రభుత్వానికి ఇబ్బంది ఏమిటని నిలదీసింది.

## కర్ణాటక రాజకీయాలు

కర్ణాటక ముఖ్యమంత్రి యడ్యూరప్ప భూ కుంభకోణానికి పాల్పడ్డారన్న ఆరోపణలకు సంబంధించి న్యాయస్థానంలో ప్రవేటు కేసు నమోదుకు గవర్నర్ జనవరి 21న న్యాయవాదులకు అనుమతినిచ్చారు. యడ్యూరప్పపై జనవరి 22, 23 తేదీల్లో భూమి అక్రమ బదలాయింపు, కుట్ర, మోసం, రక్తసంబంధీకులకు చట్టవిరుద్ధంగా లాభాల్ని కట్టబెట్టడం లాంటి ఆరోపణలతో పిటిషన్లు దాఖలైనాయి. ఈ కుంభకోణంలో యడ్యూరప్ప అండ్ కంపెనీకి దాదాపు రు.189 కోట్ల లాభం చేకూరిందని, పర్యవసానంగా ఆ రాష్ట్ర ఖజానాకు రు.465 కోట్ల నష్టం వాటిల్లిందని పిటిషన్‌దారులు ఆరోపిస్తున్నారు.

## మాలెగాంవ్ పేలుళ్లలో ఆర్ఎస్ఎస్ పాత్ర?

మాలేగాంవ్ పేలుళ్ల కేసులో ప్రధాన నిందితుడైన ఆర్ఎస్ఎస్ ప్రచారక్ స్వామి అసిమానంద తన నేరాన్ని అంగీకరిస్తూ వాంగ్మూల మిచ్చాడు. మహారాష్ట్రలోని మాలెగాంవ్‌లో 2006లో జరిగిన పేలుళ్లతో హిందూ మత సంస్థలకు సంబంధముందని 'సంఝౌత ఎక్స్‌ప్రెస్' పేలుళ్ల కేసులో నిందితుడు స్వామి అసీమానంద వెల్లడించారు. ఈ కేసు పునర్విచారణకు అనుమతివ్వాలని కోరుతూ జనవరి 12న మహారాష్ట్ర వ్యవస్థీకృత నేరాల నిరోధక కోర్టు (ఎండిఒసిఎ)కు సిబిఐ విజ్ఞప్తి చేసింది. సిబిఐ న్యాయవాది వాదనలతో ఏకీభవించిన న్యాయమూర్తి జనవరి 27 వరకు ఆయన్ను రిమాండ్‌లో ఉంచాలని ఆదేశించారు.

## కలెక్టర్ సజీవ దహనం

చమురు అక్రమాల్ని అడ్డుకొని, నిలదీసినందుకే కలెక్టర్ యశ్వంత్ సొనావణే (42)ను పట్టపగలే సజీవ దహనం చేశారు. మహారాష్ట్రలోని నాసిక్ జిల్లాలోని మన్మాడ్ వద్ద జనవరి 25న ఈ ఘటన జరిగింది. అధికారిక కార్యక్రమం కోసం వెళుతుండగా చమురు స్మగ్లింగ్, కల్తీకి పాల్పడే పోపట్ షిండే, అతడి కుమారుడు, మేనల్లుడు, ఇతరులు కలిసి యశ్వంత్‌ను కొట్టి, కిరోసిన్ పోసి నిప్పంటించారని దీనితో ఆయన అక్కడికక్కడే మరణించారని అదనపు డిజిపి కె.పి. రఘువంశీ తెలిపారు. దీనికంతటికి కారణం చమురు కల్తీ చేస్తున్నారన్న ఆరోపణలపై యశ్వంత్ నేతృత్వంలో రెవెన్యూ అధికారులు పనెవాడి పట్టణంలోని చమురు డిపోలపై జనవరి 24న దాడులు చేశారు. ఇందుకు కక్షపెంచుకుని ఈ ఘాతుకానికి పాల్పడ్డారు. వీ

## సూడాన్‌లో రెఫరెండం

సూడాన్‌లో ఉత్తర, దక్షిణ భాగాలుగా విడిపోయే దానికి సంబంధించి జనవరి 9న రెఫరెండం ఓటింగ్ రాజధాని జూడాలో జరిగింది. ఓటింగ్‌లో దాదాపు ముప్పై లక్షల మందికిపైగా సూడానీయులు పాల్గొన్నారు. దక్షిణ సూడాన్ ప్రజలు 99 శాతం మంది విడిపోవడానికే మొగ్గుచూపారు. ఈ ఓటింగ్ ప్రక్రియను పర్యవేక్షించడానికి ఐక్యరాజ్య సమితితో పాటు ఐరోపా, ఆఫ్రికా నుంచి ప్రతినిధులు వచ్చారు. సూడాన్ అంతర్యుద్ధంలో ఇరవై లక్షల మందికి పైగా ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. నలభై లక్షల మందికి పైగా నిర్వాసితులయ్యారు. దక్షిణ సూడాన్‌లో భారీ చమురు నిల్వలున్నాయి. ఆ ప్రాంతంపై ఆధిపత్యానికి ఉత్తర సూడాన్ పాలకులు, చమురు కంపెనీ అధిపతులు తీవ్ర అణచివేతకు పాల్పడ్డారు.

## ఆస్ట్రేలియాలో వరదలు

ఆస్ట్రేలియాలోని క్వీన్స్‌లాండ్‌లో డిసెంబర్ 2010లో వచ్చిన భారీ వర్షాలకు నదులు పొంగి వరదలు సంభవించడంతో జనజీవనం అస్తవ్యస్థమైంది. ముప్పై ఐదు మంది మరణించారు. రెండు లక్షల మంది వరకు నిర్వాసితులయ్యారు. ఇళ్లు, వ్యాపార సంస్థలు నీట మునిగి పోయాయి. చాలా చోట్ల వంతెనలు తెగిపోయాయి. రోడ్లు దెబ్బ తిన్నాయి.

## బ్రెజిల్‌లో భారీ వర్షాలు

బ్రెజిల్‌లోని రియో డి జనేరోలో భారీ వర్షాల కారణంగా కొండ చర్యలు విరిగిపడడంతో భారీ ప్రాణ నష్టం, ఆస్తి నష్టం సంభవించింది. ఇప్పటి వరకు 830 మంది వరకు మరణించారు. ఇరవై ఐదు వేల మందికిపైగా తమ ఇళ్ల నుంచి సురక్షిత స్థలాలకు తరలించబడ్డారు. వరదల తర్వాత సంభవించే అంటు రోగాలతో ప్రజలు తీవ్ర ఇబ్బందులకు గురవుతున్నారు. పరిశుద్ధ మంచినీరు, తిండి లేకపోవడంతో అంటువ్యాధులు ప్రబలుతున్నాయి.

## జాస్మిన్ విప్లవం

ఆఫ్రికా దేశమైన టునీషియాలో ప్రజా తిరుగుబాటు లేచింది. డిసెంబర్ 17న మహమ్మద్ బొవజిజి అనే యువకుడు ప్రభుత్వాధికారులు, పోలీసులు తనపై జరిగిన దుర్మార్గాన్ని భరించలేక ప్రభుత్వ కార్యాలయం ముందు ఒంటిపై కిరోసిన్ పోసుకొని నిప్పంటించుకుని ఆత్మహుతి చేసుకున్నాడు. పోలీసుల దౌర్జన్యాలను సహించలేక, ఈ పనిచేశానని తన తల్లికి ఆఖరు సారిగా ఇంటర్నెట్‌లో ఉత్తరం రాస్తూ చెప్పాడు. దీంతో టునీషియా ప్రజలలో ఎన్నో సంవత్సరాలుగా దాగి ఉన్న ఆగ్రహజ్వాలలు ఒక్కసారిగా ఉప్పెనగా లేచాయి. ప్రభుత్వ కార్యాలయాలపై దాడులు మొదలయ్యాయి. ఆంక్షలు విధించినా వేలాదిమంది ప్రజలు వాటిని అతిక్రమించి బొవజిజి అంతిమ యాత్రలో పాల్గొన్నారు. ప్రజా తిరుగుబాటుతో దేశాధ్యక్షుడు బెన్ అలీ దేశం వదిలి పారిపొయ్యాడు. సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడింది. కానీ ఆ ప్రభుత్వంపై కూడా ప్రజలకు నమ్మకం లేకపోవడంతో దాన్ని కూడా ప్రశ్నించడం మొదలుపెట్టారు.

## వికీలీక్స్ చేతిలో నల్లధనం గుట్టు

స్విట్జర్లాండ్‌లోని బ్యాంకులలో అక్రమంగా దాచుకున్న నల్లధనం వివరాలు వికీలీక్స్ వెబ్‌సైట్ చేతిలోకి వచ్చాయి. స్విస్ నిఘా సంస్థ (విజిల్ బ్లోయెర్)కు చెందిన రుడాల్ఫ్ ఎల్మర్ ఈ వివరాలు వికీలీక్స్ అధినేత జూలియన్ అసాంజేకు జనవరి 17న అందజేశారు. ఈ వివరాలను క్షుణ్ణంగా పరిశీలించి వాటిని తమ వెబ్‌సైట్ మీద ఉంచుతామని అసాంజే చెప్పారు. అధిక శాతం అమెరికా, బ్రిటన్, జర్మనీ, ఆస్ట్రియా, ఆసియా దేశాలకు చెందిన ధనిక వ్యాపారవేత్తలు, అధికారులు, రాజకీయ నాయకులకు సంబంధించిన అక్రమ ఆస్తుల వివరాలు ఉన్నాయని ఎల్మర్ తెలిపారు. ఈ సమాచారం బయటపడితే అక్రమ సంపాదన ఆదాయపు పన్ను ఎగ్గొట్టి అక్రమంగా స్విట్జర్లాండ్ బ్యాంకులలో దాచుకొన్న వారి వివరాలు తెలిసే అవకాశం ఉంది.

## జోర్డాన్‌లో ప్రజాందోళనలు

జోర్డాన్‌లో ప్రజల జీవన స్థితిగతులు దినదినం దిగజారి పోతున్నాయి. ప్రజలు ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిరసన కార్యక్రమాలు చేపట్టారు. వేలాది మంది వీధుల్లోకి వచ్చి ప్రధాని సమీర్ రిఫై దిగిపోవాలంటూ పార్లమెంట్ ముందు నినాదాలతో ప్రదర్శన చేపట్టారు. ప్రదర్శనలో వివిధ ప్రజా సంఘాలు, కార్మిక సంఘాలు, ప్రతిపక్ష పార్టీల కార్యకర్తలు పాల్గొన్నారు. ఈ ప్రదర్శనకు కొంత మంది పార్లమెంట్ సభ్యులు కూడా మద్దతు తెలిపారు.

## అమెరికా బ్యాంకుల దివాళా

అమెరికాలో గత సంవత్సరం 157 బ్యాంకులు దివాళా తీశాయి. తొమ్మిది వేల కోట్ల డాలర్ల ఆస్తులు కరిగిపోయాయి. గత రెండు దశాబ్దాలలో ఇది అధికం. పొదుపు ఖాతాలు స్తంభించిపోయి, రుణాలు పెరిగి వాణిజ్య కార్యకలాపాలు నిలిచిపోయాయి. అమెరికాలో బ్యాంకు డిపాజిట్లకు బీమా సదుపాయం కల్పించే ఫెడరల్ డిపాజిట్ ఇన్సూరెన్స్ (ఎఫ్.డి.ఐ.సి.) అధీనంలో సుమారు ఎనిమిది వేల బ్యాంకులున్నాయి. నిరుద్యోగ స్థాయి హెచ్చుగా పెరిగిపోయింది. 2008 సెప్టెంబర్ నుంచి ఇప్పటి వరకు 311 బ్యాంకులు దివాళా తీశాయి.

## ఈజిప్ట్‌లో ప్రజా ఉద్యమం

ఈజిప్ట్ రాజధాని కైరోలో జనవరి 25న అధ్యక్షుడు హొస్నీ ముబారక్‌కు పాలనకు వ్యతిరేకంగా ప్రజలు నిరసన ప్రదర్శనలు చేపట్టారు. ముప్పై సంవత్సరాలుగా అత్యంత దుర్మార్గంగా పాలన సాగడంతో ప్రజలు తీవ్ర పేదరికం, అణచివేతలకు గురవుతున్నారు. ప్రదర్శనలో ప్రజలు వేలాదిగా తరలివచ్చి అధ్యక్షుడు దిగిపోవాలంటూ ఆందోళనలు చేపట్టారు. నిరసనకారులపై పోలీసులు బాష్పవాయు గోళాలతో దాడిచేశారు. ఈ దాడిలో ఇద్దరు ప్రదర్శనకారులు మరణించారు. ఈ సందర్భంగా ఆందోళనకారులు అధికార పార్టీ కార్యాలయంపై దాడి చేశారు. పొరుగు దేశమైన టునీషియా ప్రజా విప్లవం స్ఫూర్తితో ఈజిప్ట్ ప్రజలు కూడా తిరుగుబాటు పట్టారు. వి

# అసహజ మరణాల సూచి

సంకలనం : **రాంకి, వై. రామచంద్రం**

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 డిసెంబర్ 2010 నుండి 20 జనవరి 2011 వరకు 20 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 2313)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| **(1)** | **(2)** | **(3)** | **(4)** | **(5)** | **(6)** | **(7)** | **(8)** | **(9)** | **(10)** | **(11)** | **(12)** | **(13)** | **(14)** | **(15)** | **(16)** | **(17)** | **(18)** | **(19)** | **(20)** | **(21)** | **(22)** |
| ఆదిలాబాద్ | 1 | 7 | – | 18 | 24 | 10 | 6 | 4 | 2 | 2 | 3 | 4 | 1 | 2 | 18 | 21 | – | – | – | 3 | – |
| హైదరాబాద్ | – | – | – | 8 | 9 | – | – | – | 2 | 7 | 8 | 4 | – | – | 34 | 15 | – | – | – | 4 | – |
| కరీంనగర్ | 1 | 15 | 2 | 24 | 41 | 18 | 40 | 3 | 2 | 10 | 4 | 6 | 5 | 7 | 41 | 15 | – | – | – | 4 | 12 |
| ఖమ్మం | – | 45 | – | 11 | 19 | 5 | 12 | 3 | – | 6 | – | 8 | 2 | 3 | 30 | 12 | – | – | – | – | – |
| మెదక్ | – | 10 | – | 7 | 20 | 2 | 6 | 1 | – | 3 | 2 | 6 | – | 1 | 50 | 28 | – | – | – | – | – |
| మహబూబ్‌నగర్ | 1 | 9 | – | 32 | 31 | 1 | 2 | – | – | 4 | 1 | 3 | 3 | 3 | 57 | 7 | – | – | – | – | – |
| నల్గొండ | – | 24 | 1 | 22 | 17 | 3 | 3 | 2 | 1 | 3 | 3 | 3 | 7 | 7 | 62 | 22 | – | 1 | – | 1 | – |
| నిజామాబాద్ | – | – | – | 9 | 20 | 3 | – | 5 | – | 4 | 4 | 2 | 1 | – | 7 | 29 | – | – | – | – | – |
| రంగారెడ్డి | – | 14 | – | 10 | 15 | 7 | 6 | 3 | 4 | 8 | 4 | 6 | 7 | 3 | 29 | 5 | – | – | – | – | 1 |
| వరంగల్ | – | 2 | – | 5 | 5 | 6 | 5 | 6 | 1 | 1 | – | – | – | 5 | 11 | 5 | – | – | – | – | – |
| అనంతపూర్ | – | 8 | 1 | 10 | 6 | 1 | 2 | – | 3 | – | 1 | 4 | 5 | 3 | 32 | – | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 8 | 8 | 6 | 7 | – | 5 | 9 | 1 | 4 | 5 | – | 44 | – | – | – | – | – | – |
| కర్నూలు | – | 16 | – | 9 | 14 | 2 | 6 | 1 | 2 | 2 | 6 | 7 | 5 | 3 | 43 | 15 | – | – | – | 7 | 1 |
| గుంటూరు | – | 53 | – | 4 | 2 | 1 | – | 1 | 1 | 2 | 5 | 5 | – | 3 | 43 | 12 | – | – | – | – | – |
| నెల్లూరు | – | 2 | – | 5 | 9 | 1 | 3 | 3 | – | 5 | – | 8 | – | 6 | 32 | 10 | – | – | – | – | – |
| కడప | – | 3 | – | 4 | 6 | 1 | 1 | – | 3 | 2 | 1 | 2 | 2 | – | 15 | 6 | – | – | – | – | – |
| ప్రకాశం | – | 5 | 2 | – | – | 12 | 9 | – | 3 | 2 | 3 | 2 | – | 5 | 38 | – | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | 27 | – | 7 | 5 | 3 | 3 | 6 | – | – | 5 | 6 | – | 2 | 22 | 8 | – | – | – | – | – |
| విజయనగరం | – | 2 | – | 3 | 2 | 2 | 1 | 2 | 2 | 3 | – | 1 | – | – | 15 | 11 | – | – | – | – | – |
| తూర్పు గోదావరి | – | 27 | – | 9 | 11 | – | 17 | 2 | – | 3 | – | 4 | 2 | 3 | 52 | 35 | – | – | – | 2 | – |
| **మొత్తం** | **3** | **269** | **6** | **205** | **264** | **84** | **129** | **42** | **31** | **76** | **56** | **85** | **45** | **51** | **675** | **256** | **–** | **1** | **–** | **21** | **14** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ;
మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఎక్బాల్; నల్గొండ – గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; వరంగల్ – ఎ.కుమార్;
అనంతపూర్ – కె. నాగేశ్వరచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్;
గుంటూరు – బి. అంజమ్మ ; నెల్లూరు – బాలగురువయ్య; శ్రీకాకుళం – జి. సుధీర్; ప్రకాశం – ఎల్. సాంబశివరావు, విజయనగరం – డి. సుధాకర్

